# పరిశీలన



వ్యాససంకలనము

నాయని కృష్ణకుమారి

# నా మాట

నేను ఎంతోకాలంనుండి సాహిత్య వ్యాసంగం చేస్తున్నా. దాదాపు పాతిక సంవత్సరాలకు పైబడి నా రచనలు, వివిధ ప్రక్రియలకు చెందినవి. ప్రముఖ పత్రికలలో ప్రచురింపబడుతూనేఉన్నా, పుస్తకరూపంలో వాటిని వెలువరించాలనే బలమైన అభిప్రాయం నాకు ఇంతవరకూ కలగనేలేదు. అందుకు ఎన్నో కారణాలు- అట్టమీద నాపేరుతో అందంగా ఒకపుస్తకం అంగడిలోకి వస్తుందనే బలమైన మోజుకంటే కాగితాలు కొనడం, మంచి ప్రెస్ వెతుక్కోవడం, ప్రూఫులు దిద్దుకోవడం, అంతాఅయి పుస్తకాలు ఇంటికొచ్చాక అమ్ముకోవడం చేతకాక, వాటిని ఏ మూలనో మేటివేసి కాపాడుకోవడం, ఇవన్నీ నన్ను బాగా భయపెట్టేవి మరి ఇప్పుడీ పుస్తక ప్రకటనా రంగంలోకి చాలా సాహసంచేసే దిగుతున్న నేమో నేను: విదేశాలలోలాగా, రాయడం రచయితవంతూ, పుస్తకం వేసి, అమ్మి పెట్టి, లాభాలు సంపాదించుకుని, రచయితకుకూడా కనకవర్షం కురిపించేలాగా చెయ్యడం మరొకరివంతూ అయ్యే బంగారుకాలం మనకెప్పుడైనా వస్తుందా!

ఈ పుస్తకానికి "పరిశీలన" అని పేరు పెట్టాను. ఇందులో ఉన్న వివిధ విషయాలమీద నేను చేసిన పరిశీలనమాత్రమే కనిపిస్తున్న కారణంచేత, ఈ పేరు న్నుకో వలసి వచ్చింది. వీటిల్లో కొన్నిచోట్ల ఆ పరిశీలనవల్ల, ఆనందమూ, మరికొన్నిచోట్ల విచికిత్సా, ఇంకా కొన్నిచోట్ల, అసంతృప్తీ వంటి ఆత్మగత భావాల ఛాయలు, నా వివరణలో కనిపించ వచ్చును. ఒక విధంగా, ఈ పరిశీలన ఆత్మగత సాహిత్యానుభూతికి అద్దంమాత్రమే.

ఇందులో 1949 నుండీ 1976 వరకూ వివిధ పత్రికల్లో అచ్చైన రచనలు కుదురుకుని ఉన్నాయి. అయితే ప్రతి సంవత్సరానికి ఒక రచన చొప్పున ఇందులో ప్రాతినిధ్యం వహించలేదు. అందుకు కారణం ఉంది. ఒక్కో విషయాన్ని కేవలం ఆనందించడంకోసం చదవడంవేరు, అది పరిశీలన అట్లాకాక, అందులో ఉండే గుప్తవిషయాలను వెలికి తీసుకవస్తూ విమర్శనాత్మకంగా దాన్ని చూడడం వేరు. అది పరిశోధన పైన చెప్పిన కాల

మానంలో అచ్చైన అటువంటి విమర్శనాత్మక రచనల్ని ఈ సంపుటి నుండి అపేతలుంచడం జరిగింది. అదికూడా పుస్తకరూపంపొందితే, పుస్తకంపేరు "పరిశోధన"గా కుదురుకుంటుంది. అచ్చైన రచనల్ని రెండు సంపుటాలకు పంచడం వల్లనేమో, ఇందులో ప్రతి సంవత్సరానికి ఒక రచన రావడం కుదర లేదు.

ఆయా పత్రికల్లో అచ్చువేసిన నాడు ఆ రచనలు ఏ శైలిలో ఉన్నాయో, అదేవిధంగా ఈ పుస్తకంలో గ్రహించడం జరిగింది. తెలుగుదేశంలో భాషా పరిణామం చూస్తే, అందులో మొదట సమాసబంధురమైన గ్రాంథికశైలిమీద అంతులేని అపేక్ష, ఇప్పుడు, సర్వజన సులభమైన వ్యావహారికంమీద ఆసక్తీ కనిపిస్తాయి వ్యక్తిగతమైన శైలిని చూచినా, ప్రతిఒక్కరి భాషా పరిణామంలో ఇదే సత్యం స్ఫురిస్తుంది. భాష వశపడుతూ, రచన, చేతిలో ఒదుగుతున్న తొలిరోజుల్లో ఎవరికయినా, పెద్ద పెద్ద పదాలు వెయ్యాలనీ, మంచి సమాసాలూ కూర్చాలనీ అంతులేని ఆరాటం ఉండడం సహజం. ఆ ప్రయత్నంలో, అప్రయత్నంగా అటువంటి పదాలు పడకపోతే నిఘంటువులు వెతుక్కుంటూ మాటలు పేర్చుకుని రచన సాగించడం రచయితలందరి అనుభవంలోకి దాదాపు వచ్చే విషయమే. మనిషి ఎదుగుతున్న కొద్దీ, అనుభవం నేర్పిన పాఠాలతో, అంతరంగం, తన చుట్టూ తాను గీచుకున్న అనేక కట్టుడులను అధిగమించే విధంగానే, రచన విషయంలో కూడా జరుగుతుంది. అందువల్ల తొలిరోజుల్లో వీరగ్రాంథికాభిమానులు తర్వాత సరళగ్రాంథికాభిమానులు కాగలరు. సరళ గ్రాథికం వ్రాసే వారు వ్యావహారికాన్ని చేపట్టగలరు. అయితే వ్యక్తిగతంగా జరిగే ఈ మార్పులకు, మొత్తం దేశంలో జరిగే మార్పులు ఎక్కువ చేయూతనిచ్చేవిగా ఉంటాయి.

ఈ పుస్తకంలో, మొదటి రెండు వ్యాసాలూ, నేను తెలుగు ఆనర్సు చదువుకుంటున్న రోజుల్లో వ్రాసి ప్రచురించినవి. అప్పటి శైలి అలాతప్ప మరోలాగా ఉండడానికి వీలులేదు. అట్లాఅని బలవంతంగా అట్లా వ్రాయాల్సి వచ్చిందని చెప్పడం నాకు అభిమతం కాదు. ఇప్పటికీ, ఆవ్యాసాలు రెండూ, దాని తర్వాతఉన్న కల్పవృక్షమూ, చదువుకుంటూ ఒక విధంగా నేను, ఆ

పొందికకు తన్మయత్వం పొందుతూనే ఉంటాను. ఇప్పుడట్లా వ్రాస్తే ఎందరు ఆ శైలిని అభిమానించ గలరన్న సందేహమేతప్ప, ఆ శైలిమీద నాకు నిరాదరణ లేదు.

కాలాతీత వ్యక్తుల్ని గురించి కొంత చెప్పాలి. కీర్తిశేషురాలు శ్రీమతి శ్రీదేవి నాస్నేహితురాలు. మాస్నేహం మొదట ఆవిడ డాక్టరు కావడంమూలాన మామధ్య ఆరంభమైంది. మొదట మొదట ఆవిడలో నేను, ఆవిడ వృత్తి కౌశలాన్ని చూచి, ముగ్ధురాల్ని అవుతుండేదాన్ని. ఆవదల పదవలో ఎక్కి-అవతలి తీరం అందుకోబోతున్న మా అమ్మను తిరిగి తెచ్చి మామధ్య పడేసిన శ్రీదేవిని నేనెలా మర్చిపోగలను. ఆవిడ తెలుగు స్వతంత్రకు ఉపసంపాద కులుగా ఉండేవారు. కథలు అడపాదడపా కనిపిస్తూనే ఉండేవి. గేయాలుకూడా అప్పుడప్పుడూ వస్తూ ఉండేవి. కాని ఆవిడ కాలాతీతవ్యక్తులు నన్ను అమితంగా కదిలించింది. ఆవిడ అకాలమృత్యువు బారిన పడకుండా ఈనాటికీ మనమధ్యన ఉండి ఉంటే, ఆ పుస్తకంమీద సమీక్ష వ్రాసేదాన్ని కాదేమో? నన్నెన్నో పుస్త కాలు, ఎందరో రచయితలు, రచయిత్రులు, ఆలోచింప చేయడం జరిగింది. అవన్నీ నామనస్సులోనే గుప్తాలు. శ్రీదేవి మనమధ్య లేదుకాబట్టి ఆవిడతో నాకు వ్యక్తిగతమైన అనుబంధం ముడిపడినందువల్ల కాబోలు ఆవిణ్ణి గురించి ఆలోచించే మనస్సు, ఆ సమయాన నా కలాన్ని కదిపింది. ఒక స్మృతి గీతాన్ని రూపు కట్టించింది. మరో జ్ఞాపికగా ఈ సమీక్షను వెలువరించింది.

మిగిలినవన్నీ ఆయాసందర్భాలలో, ప్రత్యేక సంస్థలో, సంచికలో, వ్రాయమని నన్ను ఆదేశించగా, అర్థించగా, రూపుదాల్చిన రచనలు. ఇవన్నీ నాకు నా బిడ్డలవలె అనురాగ స్థానాలు. వీటిని అభిమానించి ఆదరించే ఆంధ్ర పాఠక లోకానికి అంజలిస్తూ,

నాయని కృష్ణకుమారి

22-7-77

# పరిశీలన

## రెండవతారికలు : ఒక ఫలశ్రుతి

ఒకపని చేసితిమా, దానినుండి ఒక యానందమును బొందితిమా, ఆ యనుభూతికి కారకులైన ఆర్యులు మన మనస్సులకు తగిలివత్తురు. వెనువెంటనే మనలో నురకలెత్తు తెలుగుదనపు పవిత్రరక్తము కృతజ్ఞతా సాంద్రమగును. ఒకసారి ఒక్క నిముసములో సగముసేపైన ఒక్క తటిల్లత మెరసి మాయమై నంత అల్పవ్యవధిలోనైన వారినిగూర్చిన యాలోచనలు మనలో నేతాము లెత్తును అట్లగుట అనుసరింపవలసిన మర్యాద అనిగాదు. ఆచరింపవలసిన విధాయక కృత్యమనిగాదు. తెలుగుతల్లులు తమ పాపల కుగ్గుపాలతో రంగరించిపోసిన మహాగుణమని. తరతరములనుండి యనూచానముగ తరలివచ్చు మహద్భాగ్యమని తెలుగుభాష యున్నది. దానికీనాటికొక వ్యవస్థనొందిన సాహిత్యమున్నది. అందు పురాణవాఙ్మయము గలదు. ఉదాత్త గంభీరములైన నీతిబోధలున్నవి. మధుర సారళ్యములు మేళగించిన భక్తిపారవశ్యములున్నవి. శృంగార రసానంద పోషక ములైన ప్రాబంధిక గాథలున్నవి. ఇవన్నియు స్వతంత్రములు గావని యొక వెక్కిరింపు. అనుకరణయో అనుసరణయో అనునదొక యీసడింపు. అయిన నేమాయె! ఆ స్వతంతములని పిలువబడునవి గూడ ఏదోదివ్యశక్తి ప్రేరితములై సృష్టిలో పొడుకొనిపోయిన నగ్నసత్యములకు నాందులుగావేమి? అప్పుడవి మాత్ర మనుకరణములు గాకపోవునా? అనుసరణములు గాదన్నమానునా? ఇది యొక చిక్కువిడని సమస్య అవునన్నవా రవునందురు; కాదన్నవారు కాదం దురు. అట్టిమన తెలుగుసాహిత్యమునకొక మహాత్ముడు పెట్టినదిభిక్ష. ఈనాడది యింతస్థితికి వచ్చినదన్న, మనవారు కవులై కవికుల కలహంసలై వర్ధిల్లుచుండి రన్న, అదియంతయు నాతనిచేతి చలువ. అట్లుకాదనలేదు, కృతజ్ఞతగల యాంధ్ర ప్రాణి.

ఆ పుణ్యమూర్తి అపస్తంబసూత్రుడు. ముద్గలగోత్ర జాతుడు. పేరు నన్నయ. బ్రాహ్మణకులమున భట్టారకుడీయన. యజ్ఞముచేసిన సోమయాజి

ఈతడే చాళుక్యరాజచంద్రుడు రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడుగ వర్ధిల్లి గౌరవము పెంచుకొన్నది. ఈతడే నిరంతర సంహితాభ్యసనతత్పరతచే తద్ధర్మములను జీవితమున రంగరించుకొన్నది. ఈతడే వేదఋక్కుల గానపవిత్రతను తనవాక్కున నిల్పుకొన్నది. బ్రహ్మాండాది నానాపురాణముల జీర్ణించుకొన్నయిట్టి విజ్ఞానఖని వాక్కున కవితాదేవి పీఠము పెట్టుకున్నది. సుప్రసన్నవదనయై యాశిషముల వెదజల్లినది. "బంగారము ఘుమఘుమలాడు" నన్న ఇదియేకాదేమి!

ఆయన ఆంధ్రభారతము తెలుగు భాషాదేవికి తొలి పూజాకుసుమము. తెలుగు ప్రాణికే అక్షరభిక్ష పెట్టిన అన్నపూర్ణ. అది అమృతమై యుద్భవించినది ఆంధ్రుల కమరత చేకూర్చినది. నిజమునకు తదుద్భవమున కెన్నిపాట్లు! తత్సంపాదన కెంత ప్రయత్నము! ఆ కష్టముల కన్నిటికి ఒరిపిడి నన్నయ. ఆ ఉపద్రవముల పొగమంచునకు బాలసూర్యుడు నన్నయ. ఆయన మంథరమై పండితమండలిని తరచినాడు. జగన్మోహినియై తెలుగువారికి ధర్మామృతమును పంచిపెట్టినాడు. "ఓయి అన్నికష్టములబడెనా. రెండున్నర పర్వములు తెనిగించుటకు?" ఒక్క హెచ్చరికను మెరయును మనోవీథులలో.

ఇక భారతావతారికను పరికించితిమా, అందు కొన్నికొన్ని మన కతివిచిత్రముగ కన్పట్టును. వీని నిట్లేల రచించినాడన్న సందియమునకు చోటిచ్చును. ఆ సందియములు తీర్చుకొనుట మాత్రమే మనపని.

శ్రీ వాణీగిరిజాశ్చిరాయ దధతో
వక్షోముఖాఙ్గేషు యే
లోకానాంస్థితి మావహన్త్య విహతాం
స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా
స్సమ్పూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ
శ్రీకన్ధరా శ్శ్రేయసే

భారతావతారికలోని మంగళాచరణశ్లోకమిది.

ప్రాయునదా తెలుగు భారతము! ఆంధ్రీకరించువాడా తెలుగువాడు నన్నయ ఆయనకు సంస్కృతమున నెంత యభిమానమున్నదో తెలుగున నంతకిబ్బడిగ నున్నది. అట్టివాడు నాందిగ సంస్కృతమున శ్లోకము రచించుటేమి? మార్గ యనిపించుకొను సంస్కృతమునుండి కవితా సరస్వతిని దేశీవీథులలో నడిపించు చుంటినే, యేమైన బెడిసికొట్టునేమోయని ప్రారంభించెనా? లేక దేవభాష సంస్కృతము. ఆది గ్రంథమునకు మకుటముగ నుండియే తీరవలయునని మొదలిడెనా?

తరువాత;-

"అమలిన తారకాసముదే
యంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ము
దంబున బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల
గౌరవ భారత భారతీ సము
ద్రము దరియంగ నీదను వి
ధాత్రునకైనను నేరబోలునే?

అని చెప్పుట మరియొక విచిత్రము. ఇట్లుచెప్పుట తనశక్తిని మరుగు పరచుకొనుటకై చెప్పుటయా లేక ఏదేని ప్రయోజనము కొరకు చెప్పుటయా? అట్లు చెప్పిన వెనువెంటనే, "దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యను గ్రహంబున జేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచించెద" అని వెల్లడించుట మరొక విశేషము. ఇవ్విధముగ రాజును, పండిత మండలిని, తన కావ్యప్రారంభ మునకు సూత్రప్రాయముగ నిలబెట్టుటేల? వారి కెట్టి విశిష్టత యున్నది కార్య నిర్వహణమున?

తరువాత పండిత సభలను నుతించినాడు.

"పరమవివేక సౌరభవి
భాసిత సద్గుణపుంజవారిజో
త్కర రుచిరంబులై సకల

గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్రపావన ప
యః పరిపూర్ణములై సత్సభాం
తర సరసీ వనంబుల ము
దంబొనరంగొనియాడి వేడుకన్."

అని వానిని "సరసీవనంబుల" తోడ బోల్చియు నంతతో వదలక పర్వా నుక్రమణిక జెప్పుచు నందు గూడ జొన్పినాడు. సభాపర్వము "పండిత చేతో నిర్వృతి జేసినది. "సకలసభారమ్య" మైనది యారణ్యపర్వము. "సభా రంజనమై సర్వమనోజ్ఞము నాదగి వెలసిన నాల్గవ పర్వము విరాటపర్వము. ఏనవపర్వంబిది నానుద్యోగ పర్వమిమ్మైనది సభల. అత్యనుపమమై "సభల" నమరినది ద్రోణపర్వము ఇట్టులే ఏ పర్వమునకా పర్వము సభల యామోదము బడసినదని చెప్పుచు వచ్చినాడు నన్నపార్యుడు. ఈ సభలకెందుల కంతటి స్థానము నీయవలసివచ్చినది? ప్రతిసారి వానిని నుతింపవలసిన యవసరమేమి కలిగినది నన్నయకు?

ఆపైన నారాయణభట్టునెడల నన్నయభట్టు కృతజ్ఞత
"పాయక పాకశాసనికి
భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధ
రామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధు
రంధరుడుం దనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాడభిమ
తంబుగ దోడయి నిర్వహింపగన్"

తన పూనిక భారత ఘోరరణము వంటిదట. కాననే తరువాతి శ్రీనాథు డన్నాడాయనను "భారత ఘట్టోల్లంఘనపటిష్ఠభుగాఢప్రతిభు" డని తాను పాకశాస నితన నారాయణభట్టు నారాయణుడే, అనిన శ్రీకృష్ణుడర్జునునకు జేసినంత సహా కృతి యాయన నన్నయకు చేసినాడన్నమాట. ఆ పద్యమున వేసిన చిగురు

తోడై నిర్వహించుటలో ఏ అర్థమున్నదో? ఏ విధముగ నారాయణభట్టు నన్నయకు తోడైనాడు? ఆయన కలముతో నీయనగూడ కలము కలిపినాడా? ఆయన భావములతో నీయనగూడ తనభావముల పెనవైచినాడా? అటులే యయ్యేనేని ఆశ్వాసాంతగద్యములో నారాయణభట్టు పేరు జోడింపనంతటి కృతఘ్నుడుకాడే నన్నయభట్టు. మరి యాసహాయమెట్టిది. ఈ నిర్వహించుటయే విధిని?

ఈ ప్రశ్న పరంపరకంతటికి జవాబులే కావలయునా, వెనుకటి చరిత్ర యంతయు త్రవ్వి చూడవలయును. నాడే నన్నయగారి కష్టములు, ఆయన భారత రచనా నిర్వహణ కెదుర్కొన్న సమస్యలు, అన్నియు బయటపడునది.

మహారాష్ట్రమున ఆభీరుల కోడి శకులంతరించిపోయిరి. డెబ్బదిసంవత్సరములైన పరిపాలనపు ముచ్చట దీర్చికొనిరో లేదోగాని యాభీరులవంతు కూడ వచ్చినది. అప్పుడప్పుడే కన్నులుదెరచి నేల నాలుగు చెరగుల కలయగొన్న చాళుక్య వీరులు వారిని శాసించినారు. పదభ్రష్టులను జేసి తత్సింహాసన మాక్రమించినారు. వారి బాహుబలవిజృంభణ పరరాజ్యమహావృక్షముల పెకలించివైచినది. వానిని కలిపికొన్న చాళుక్య రాజ్యలక్ష్మికి సర్వవాహినుల లయమొనరించుకొన్న మహాసాగరపు పోలిక. పరాక్రమమునకుతోడు దూరదృష్టి గూడ మహారాజైన కుబ్జవిష్ణువర్ధనుని సొత్తు. విపులమైన ఆ రాజ్యభవనమునకు తన భుజాస్తంభములే చాలును. అయినను భ్రాతృవత్సలుడా రాజచంద్రుడు. ఒక్కతల్లికడుపున రక్తము రెండుగా చీల్చుకొని పుట్టిన తన తమ్మునకు రాజ్యభార నిర్వహణమున పాలుండకపోవుటేమి? కాననే తన రాజ్యమున తూర్పుసీమయందు తమ్మని శాసనము, పశ్చిమమున తనపాలనము.

ఆ కుబ్జవిష్ణువర్ధనుని వంశమువాడు వేంగినాటిని పాలించిన, ధన్యజీవి, విమలాదిత్యుడు. ఈయన సింహాసనారూఢు డగుటకు ముందెన్ని కలహఝంఝా మారుతములు! ఎన్ని విప్లవ విస్ఫులింగములు. కొంతకాలము పాటాతడు చోళుల చెరసాలయందు బందీ. కాని చివరకా బందిఖానాయే అత్తయిల్లయి అలరించిన దా అదృష్టవంతుని. మామగారి ప్రాపు నరునకు నారాయణునివలె నిలువగా తన సింహాసనమును సుస్థిరము చేసికొన్నాడాయన. తండ్రి సంపాదించిపెట్టిపోయిన

ఈ సువ్యవస్థలో కడుపులోని చల్ల గదలకుండ కాలూని కూరుచుండవచ్చును రాజ రాజు. కాని ఆయన సోమరిగాడు. ఒక ప్రక్క పారంపర్యముగ తనకు సంక్ర మించిన రాజ్యరక్షణ, మరియొకప్రక్క తనలో నురకలెత్తు తెలుగు రక్తము ప్రేరేపించు వాఙ్మయ పోషణ. ఇవిరెండును రెండుకన్నులాయనకు. వానికి కుడి యెడమ భేదములే లేవు. కాననే అతనిని నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుం డని నుతింతురా, వివిధాగమవిహితశ్రముడని నుడువవలయును. అపరాజిత భూరిభుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుడని పొగిడిరా, మనీషి విద్యాశ్రమతత్త్వవిత్తమున మహినొప్పిన వాడని ప్రస్తుతింపవలయును. మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంతసామంత పరివృతు డగునా, అపార శబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును, భారత రామా యణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును మృదుమధుర రసభావభాసుర నవార్థవచన రచనా విశారదులైన మహాకవులును వివిధ తర్కవిగాహిత సమస్త శాస్త్ర సాగరగరీయః ప్రతిభులైన తార్కికులును నాదిగాగల విద్వజ్జనంబులు పరి వేష్టించి కొలువబడిన వాడగును. ఇంతటిరాజు ఆకవికి అండ.

ప్రాణికి ప్రాణమువలె, ప్రాణమునకు ప్రాణివలె నన్నయ రాజరాజు లొకరినొక రాశ్రయించుకొన్నారు. ఆ ఏకతా ఫలితముగనె భారతరూపమేర్పద గలిగినది. ఘృతమునకు పాత్ర యాధారమా పాత్రకు ఘృత మాధారమాయనునది గాదిచటప్రశ్న. భారతజననమున వీరిరువురికి గల బాధ్యత ఎట్టిది? ఒకరికొక రెంతవర కుపయోగకులైరి? అను నంశములు చర్చనీయములు.

వీరిర్వురికృషియు సాహిత్యవిషయకమేకదా! కాన నన్నయకు పూర్వము తెలుగుభాషయవస్థను పరికింతము. అప్పటికి దానికి లిపి యున్నది, పాల్కురికి సోమనచే తుమ్మెదపదములు. గొబ్బిపదములు, ప్రభాతపదములు, వెన్నెల పదములు అని పేర్కొనబడిన దేశీయ పదములున్నవి. సోమనాథుడు వీనికి ఛందోనియమముల చెప్పుచు "అనియతగణైః యతిర్వాప్రాసోవా" యని నిర్ణయించినాడు. ఇదంతయు గమనించిన కొందరిమతమున నన్నయ ఆదికవిగాడు. అతడు నాగమశాసను డనుకొన్నది ముచ్చటకు దగిలించుకొన్న బిరుదు. వారి యుద్దేశ్యమున వాగమశాసనుడన్న, ఆదికవియన్న ఇదివరకులేని

ఛందమును సృష్టించినాడని కాబోలును. అంతవరకు తెలుగుప్రాణి కని విని యెఱుగని లిపిని నిర్మించినాడని కావును.

నన్నయ చేసినపని యదిగాదు. అతడు లిపిని సృష్టింపలేదు. దేశీయఛందముల గ్రహింపకపోలేదు. కాని వానికి తోడుతోడుగ సంస్కృత ఛందోవాహినినుండి పాయలు తీసి కలిపినాడు తెలుగుభాషకొక వ్యవస్థ నిచ్చుటకై సంస్కృతపు టూనకట్టలు పోసినాడు. ఇది యాయన జేసినపని. ఈ విధముగ ఆరూఢముగ, అప్రశస్తముగ నున్న తెలుగు వాఙ్మయమును సవరించినాడేగాని సృష్టింపలేదు. ఆ పనిచేయుటకై, తన భారతాంధ్రీకరణ మనాహతముగ సాగుటకై యాతడు రచించుకొన్న ప్రణాళిక మాత్రమే ఆంధ్రశబ్దచింతామణి.

చాళుక్యుల వియ్యంకులు, చోళుల కెంతో వెలలేని సాహిత్యమున్నది. దాని సర్వతోముఖ విజృంభణ విజ్ఞులకు కన్నులపండువు. ప్రతిపండితుడును ప్రతి కవియు, ప్రతివిజ్ఞాన ఖనియు గూడిన ఒక కూడిక వారి సంఘము, ఎవ్వరేని యొక గ్రంథము రచించిరా, ఒకకావ్యగానము చేసిరా అది ముందు వినపడ వలయు నీసంఘమునకు. దానిని విన్నవారు దాని ప్రాశస్త్యము నేర్పరింతురు. దానికి సాహిత్యవిపణిలో వెలకట్టుదురు. అట్లెంచుకొనబడిన గ్రంథమే వారి పరిభాషలో 'సెందర్'. అదియే పండితపామరులు చదువుటకు యోగ్యతను సంపాదించుకొన్నది. ప్రపంచమున ప్రయాణించుట కనుజ్ఞను తెచ్చికొన్నది. ఈపద్ధతి రాజరాజు కనుల కాకట్టయినదేమి! కాననే, వారిని తానుగూడ అనుకరింపవలయు నన్న యాశయే తన రాజ్యమున పండితసభలను కూర్చిపెట్టినది.

కాని ఆ సభలలో తెలుగునకు స్థానము లేదు. ఈసడింపు మాత్రమున్నది అందు కవనము చెప్పినవారికి అవంతయైన ప్రోత్సాహము లేదు సరిగదా అగౌరవమున్నది. కారణమాభాష దేశి. అనాగరకులు, మోటువారు నిత్యవ్యవహారమున కుపయోగించు భాషయది. "ఒక్కరూపన్నది లేక పలుపోకల బట్టిన ఆ పదజాల మేమి, కట్టుబడి కావ్యరూపమున నుండుటేమి? అసలందున్నదే కొద్ది సామగ్రియాయె. దీనితో నెన్ని భావముల స్ఫురింపజేయగలరు? ఎంతరసమును

చిప్పిలింపగలరు. ఎవరయ్యాతెలుగున కవిత్వము చెప్పెదనను తెలివి మాలినవాడు? పండువంటి సంస్కృతమున్నది. లెక్కకు మిగిలిన విషయములున్నవి మోజు దీర చేతికి వచ్చిన గ్రంథములు వ్రాసిన కాదందురెవ్వరు! మీదు మిక్కిలి ఆదర మును గౌరవమును గలుగునే? ఇదియేధోరణి ఆనాటి పండితులందరికిని. ఇదియే హేళన తెలుగు విషయమున వారిహృదుల నిండినది.

అట్టి కాలపు రాజును, కవియు వారు. కాని మనస్సులలో తెలుగుదుస్థితి యున్నది. దానిని వాఙ్మయస్థితికి దేవలయునన్న దుగ్ధ యున్నది. అట్లని అందరు పండితులను కాదని వీరేమి చేయవలయును?

తానురాజే! మూర్ధాభిషిక్తుడే. అయిననేమి ప్రజలను తాను శాసించునా? వారిలో అసంతృప్తిరేపునా? రేపి తనహృదయమున తీరని చిచ్చు రగుల్చుకొనునా?

తాను పండితుడే. పండితమండలికి అధ్యక్షప్రాయుడే. కాని ఏమి ఫలము. వారిని కాదని ముందంజ వేయునా? ప్రజల దృష్టిలో పేలవమైపోవునా? పోయి "సుజను" డన్న తన ఖ్యాతికే మచ్చ దెచ్చుకొనునా?

అట్లని ఎంతకాలమని తమ కోర్కెను తమలోనే యణచుకొని గ్రుక్కిళ్లు మ్రింగుట! ఎంతకాలము, ఇప్పుడు పోయిన దేమిలే మంచి కాలము వచ్చునని వేచియుండుట, అన్నికాలములు, మనవా? ప్రతి నిమేషమును గడచిపోవుచున్నదే.

అన్నియు ననుకూలించిన -

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిగొనియాడుచుండు"

భారతమును తెలుగుసేయవలయునని యుత్సాహించినన్నయకు, అప్పుడుమరి, ఆ కృతి సర్వధర్మసంపుటీకరణమాయె. "ఇదం భారత మహాశ్రిత్య కదా భువి నవర్తతే" యనియు, "ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ పురుషర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" అనియు దీనిని జెప్పికొనిరాయె. అట్లే, హిమకరువొట్టి పూరుభరతేశ కురుప్రభు పాండుభూపతుల్ క్రమమున వంశకర్త లనగా మహినొప్పిన" తనవంశమున "ప్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర" యని, భారతమును తెలుగు సేయింపవలయునని రాజరాజున కున్నది. ఇట్లీరువురి దృక్కులకును భారత మాశ్రితము. పై పెచ్చు ఆనాటికే భారతమును కన్నడించినారు కన్నడకవులు. ఆ చర్య వీరిరువురి హృదుల యందున్న వాంఛకు పాతుగట్టె. కాని మొదలు లేదు మొత్తుకోడు కొడుకుపేరు సోమలింగమన్నాడట యెవరో! అటుల, అసలు తెలుగునే కావ్యోప యోగమున కంగీకరింపని పండితమండలి భారతాంధ్రీకరణ కొప్పుకొనునా? ఈ కోర్కెను వెలిబుచ్చుటయు, ముల్లువేసి కొల్లబడుచుటయు నొక్కటి గాదేమి?

ఇట్లు కింకర్తవ్యమని మొగమొగములు జూచుకొను సమయమున నవత రించినాడా బహుధా విజ్ఞానమూర్తి నారాయణభట్టు. నరునకు నారాయణునివలె బలారికి బృహస్పతివలె ఆ నన్నయభట్టుకీ నారాయణభట్టు చేదోడును, వాదో డును. అతడు సంస్కృత ప్రాకృత పైశాచి కాంధ్రభాషలయందు 'కవిరాజ శేఖరుడు' అదృష్టము కొలది యిటుల లభించిన యీ విజ్ఞానపు తెప్ప నాదరువుగ గొని యేటి కెదురీదు ప్రయత్నము లారాజునవి, ఆ కవివిని.

రాజరాజు పండిత సభలలో సభ్యులను భారతాంధ్రీకరణ విషయమై కదిపి వదిలి పెట్టెను. ఆయన వివిధాగమ విహితశ్రము డాయె, మనీషి విద్యాశ్రమ తత్త్వ విత్తమున మహి నొప్పువా డాయెను. అర్థధర్మ శాస్త్రముల తెరం గెరింగి, ఉదాత్తరసాన్వితకావ్యనాటక క్రమములు పెక్కులు సూచినవాడు గూడను. అంతటివాడు వెలికి దెచ్చిన విషయమే యని అందరును ఆస్థతో విందురు,

చర్చోప చర్చలు గావింతురు. కొంద రామోదించువారు, మరికొందరు నిరసించు వారును, ఈ విధముగ సభయంతయు రెండు తెన్నుల బోవును. ఆమోదించు పక్ష మీ మూర్తిత్రయపు కన్నుల చందమామ, నిరసించువారి ప్రాణములకు నారాయణభట్టు పెనుభూతము. ఆతడు బహుభాషల పాండిత్యము గడించెనా! యుక్తియుక్తముగ వాదింపను గూడ గలడా!-ఇక నేమి! ఆనాటికే కన్నడమున భారతము వెలసినది. ఇతర భాషలన్నియు పదిముఖముల విస్తరిల్లుచున్నవి. "మాతృభాష కిదేమి గతి యయ్యా, మీ నిరాదరణ కిదేమి పెరవారి విషయమ్మా, ఈ యవమానమెవ్వరి కేమి!"-ఇట్లే నల్లేరుపై బండినడక నారాయణభట్టువాదనా ప్రౌఢిమ. దీని నామోదించి తలయూపు పని ఆ 'విమల విచారు' నిది, ఈ 'లోకజ్ఞు' నిది, "ఇదేమి చిత్రమో, అంతటివారికే నచ్చినదీ యూహ. దాని కెంతటి ప్రాముఖ్యమో," యని మెత్తబడువారు కొందరైన, "పోనిమ్ము, జరిగినది జరుగనీ, అవునన్న పోయినదేమి!" యని యొప్పుకొను వారు మరికొందరు; అటునిటు జేరక పట్టిన కుందేలికి కాళ్లు మూడే యన్నరకపు కొరకరాని కొయ్యలు నుండకపోరు, - ఈ విధముగ వారు మూవురును జేరి పండితబాహుళ్యపు టంగీకృతిని సంపాదింతురు. కాని యీ యంగీకృతి నాభికడనుండి వచ్చినదా, నాలుకచిగురుమాటయా!

ఏది యేమైనను, దానిని సరిదిద్దుకొను బాధ్యత యిక నన్నపార్యునిదే. కారణ మాతడు గ్రంథకర్త. ఆ కృతి బాగోగులపై వారి యభిప్రాయముల మార్చున కాస్కారమున్నది.

కిడెంచి మేలెంచు మని, వారు పై మాటగ నీ పని కొప్పుకొని చాటునకు బోయి నాలుకాడించు రకమే యనుకొందము. అప్పుడు నన్నపార్యుని యుద్దేశ్యము పూర్ణమైనదనుట యెట్లు! తొట్టతొలి కృతియే యీనడింపుల పాలైన తరువాత నా భాషలో మరి యే గ్రంథములైన బుట్టునా? పుట్టి మన్ననల చూర గొనునా! అయ్యవారిని జేయబోయిన కోతియై నటుల తాను నాడు పూనుకొని విఫలుడైనాడో, మరి కల్పకల్పములకు తెలుగున సాహిత్యము పుట్టునో లేదో!

ఎట్టి క్లిష్టపరిస్థితులను దాటుట యన్న, పండిత పామరుల మనస్సును తనయెడల స్నేహప్రేమార్ద్రములు జేసి కొనుటే! మతవిషయకముగ గాని, రచనా ధోరణిలోగాని, ఆనాటి సాంఘికాచారాదిక చిత్రణమున గాని విప్రతిపత్తి చూపట్ట గూడదు, భారతపాఠకునకు. ఆ విధముగ నే దృష్టితో, నేమనస్తత్త్వము గలవాడు జదివినను తన కృతి ఆ విధముగ వాని మనస్సు నలరించినదా, ఇక తాను సఫలుడైనటులే.

కాననే మంగళాచరణశ్లోకము సంస్కృతమున నున్నది. అందు త్రిమూర్త్యాత్మకమైన పరతత్త్వమే ప్రస్తుతింపబడినది. అది సంస్కృతమున నుండుటకు హేతువు పతితల దేశికవితాపఠన దోషము నివారణ మగుటకు, పండితుల సంస్కృతప్రియతకు కొంత గౌరవమిచ్చి యాదరించినటుల గాన్పించు టకు, ఇక త్రిమూర్తులకభేదము చెప్పి స్తుతించుట మతవైవిధ్యమున్న పాఠకుల నిరసనకు పాలుగాకుండుటకు! అవును మరి. పాఠకులు కొందరు శివభక్తు లుందురు. మరికొందరు విష్ణుపాదపూజా నిరతు లుందురు ఇకకొందరు బ్రహ్మోపాసకులుందురు. వీరి కందరికి భారత మాదరణీయ మగుట కింతకన్న నులువేది? బృహత్కల్పసాధన కీ కిటుకు!

తానాంధ్రీకరించినంత మేర సంస్కృత భారతమును నన్నయ అనుకరించి నాడే గాని అనుసరింపలేదు. ఆయనది యథోచితానుసరణమే. దానికి కారణ మడుగుదుమా, ఆయన మనస్సులోని దొక్కటే యూహ. తన కృతి జన బాహుళ్యపుప్రేమాదరములచూరగొనవలయును. వ్యాసుని కాలపునాటి పరిస్థితులు నన్నయ కాలపువారికి వెగటుగ దోచవచ్చును. నన్నయ నాటి యాచారములు వ్యాసునినాటి కందకపోవచ్చును. అట్టియెడ ప్రజాశ్రేయస్సే మనమున బెట్టికొన్న నన్నయ వానిని తన శక్తికొలది మార్చివైచినాడు. అందుల కుదాహరింపం సంస్కృత భారతమున కచదేవయానీ ఘట్టము. దేవయాని ప్రేమ నుదాత్తముగ చిత్రించుటకు యత్నించినాడు వేదవ్యాసుడు. అటులే కర్ణజననమును గూడ. నన్నయనాటి కవి సంఘదూష్యములు, కాననే వానిని పట్టించుకొనక ముక్తసరిగ

[్రోచివై]చినా డాయన, ఈ విధముగ భారతమంతయు నుదాహరింపవచ్చును–ఈ పనిచేతగూడ భారతము జనుల యాదరమునకు పాత్రమైనదని చెప్ప సాహసింప వచ్చును.

ఇక నన్నయ "భారతాంధ్రీకరణ మెంతకష్టతరకార్యమో చూడు" డని చెప్పిన పలుకుల నాలకింతము:

తాజెప్పబోవునదా పంచమవేదమగు భారతము. ఆ చెప్పుటయు పదజాల పరిపుష్టముగాని తెలుగున తాను ప్రతిభావంతుడే. కాని ఎంతటి ప్రతిభకలవాడైనను "తారకాసముదయ మెన్న" గలడా? సర్వవేదముల సార మశేష మెఱుంగగలడా? అటులే యీ క్వచిత్సామగ్రితో నర్థబలగురుత్వము వహించిన భారతభారతీ సముద్రము నీద దొరకొనువాడను నేను, అందే లోపము వాటిల్లిన నదియెన్నుట మీకు న్యాయము గాదుసుమీ! యని హెచ్చరించుటకు జెప్పినవా పలుకులు. ఇంత హెచ్చరింపును హెచ్చరించి, యావెంటనే "దేవా, నీయనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునజేసి" యని రాజును విద్వజ్జనులను నిలబెట్టుటచే తనచుట్టును రక్షవైచికొన్నాడు నన్నయ. ఏదేని లోపము వాటిల్లి "ఇంతచేతకానివాడ వూరకుండక వోతివా? ఏల చెప్పితివయ్యా" అని యెవ్వరేని ప్రశ్నించిరా,"నాదే మున్నది వారు బలవంతపెట్టిరి. చిన్నవాడను. మరి కాదందునా?" అనుట కీ యెత్తు. నిజమేమరి ఇంత గురుతరకార్యభారము నెత్తిన వైచికొన్నవాడెన్ని కట్టుదిట్టములు లేనిది బరిమీదకు వచ్చును? ఇన్ని కాపులు పెట్టుకొన్నను ఇంకొక శ్రీరామరక్ష, "నా నేర్చువిధంబున నిక్కావ్యము రచించెద" ననుట. ఉభయ భాషా కావ్యరచనాభిశోభితునకు, విపులశబ్ద శాసనునకు, సంహితాభ్యాసునకు నీ వినయ మేలనయ్యా తీవిగ జెప్పుకొనక" యనిపించును మనకు. కాని యీవిధమగు నాయనపోకడయే పండితమానసములలో సుముఖత నింపి, వారిని తనవైపునకు త్రిప్పినది. తాను కావించిన ప్రయోజనమును సఫలము జేసినది.

ఇక పూర్వ కవిస్తుతులు. తెలుగున కవులు లేరుగాన నన్నపార్యుని సుత్తికిపాత్రు లెవ్వరును గాకపోయిరి. ఇక మిగిలినది సంస్కృతము.

అందరి కవులలో నన్నయ పరాశరాత్మజుని బొగడు వైఖరి చింతనీయము. ఆయన "భారతభారతీ శుభ గభస్తిచయంబులజేసి ఘోరసంసారవికార సంతమసజాల విజృంభము" బాపినవాడట "అంతపని ఆయన సాధించుట భారత రచన వలన, మరి యాంధ్రీకర్తను నేనుగూడ దాని నుద్దేశించియే ఈ పనిని మొదలు బెట్టినానయ్యా, దేశీమార్గమువజెప్పిననేమి. మార్గకవితారీతుల నుడివిననేమి దాని ఫలమెటులైన మనకు దక్కునుగదా మాణిక్యమును మసిపాత గట్టితిమని మీరను కొన్నను, అది కాంతిహీనము గాదే" అని హెచ్చరించెను ప్రజలను. అంత నిగూఢ ప్రయోజనమున్న దావ్యాసస్తుతి వెనుక. ఇట్టిజాగ్రత్తల కన్నిటికిని మకుటప్రాయము పండితసభల ప్రశంస. పండిత మానసములను తనవైపునకు ద్రిప్పుకొనుట కిది యొక ప్రయత్నము. కాననే ఆ సభలకు తన యవతారికయందంత ప్రాముఖ్య మిచ్చినాడు. అవి వివేకసౌరభము వెదజల్లు సరసీవనంబులు. సద్గుణపుంజవారి తోత్కర రుచిరములు. మనోహరసుచరిత్ర పావన పయఃపరిపూర్ణములు, సకల గమ్య సుతీర్థములు. ఇటులే, ప్రతి పర్వమును సభల ప్రశంసల గనినదని పలికినాడు. "సభలే ఆమోదించినఇక మనకేమి అభ్యంతరమయ్యా" అని ప్రతి పాఠకుడు జదువునని యాయనయూహ నిజమున కానాటిపండితసభల కంతపలుకుబడి యుండెడిది ప్రజలలో. అదియే నన్నయచేత నన్నిసారులు పండిత సభాప్రశంసలను జేయించినది.

ఈ తతంగమంతయు ముగిసినవెనుక తన యాప్తులవైపునకు. దిరిగినాడా సుజనుడు. తన మిత్రుడు నారాయణభట్టెంత శ్రమపడెను తనకొరకు. అటు పండితుల వాగ్వాదముల యుక్తియుక్తముగ ఖండించుటకేనా, ఇటు కన్నడించిన భారతపు తెన్నులు తెలియజెప్పుటకేనా, ఒక టేమిటి. అన్ని విధముల నాతడు చేయూతనిచ్చి మిత్రుడనిపించుకొన్నాడు. అట్టివానికి తానేమిచ్చును. కృతజ్ఞతా పూరితమగు హృదయముదక్క? అయినను కవిగాన ఆ సంయమి పద్య మొక్కటి జెప్పినాడు. ఆ నారాయణుని పేరాకల్పాంతము నిలుచు నేర్పాటులు జూపినాడు ఈ సహాయ మీవిధమైయుండదు. బహుశః నారాయణభట్టు నన్నయతోబాటు భారతరచన సాగించెనేమో! యని కొందరి మతము. మనస్ఫూర్తిగ తనమిత్రుని

నారాయణుని జేయగలిగిన నిర్లిప్తుడు తనతోపాటు నారాయణభట్టు రచనయే సాగించిన నాతని పేరు గలుపక ఆశ్వాసాంత గద్యను రచించెననుట నమ్మకము నకు దూరము. అయిననిందలి సత్యాసత్యములతో మనకు పనియేమి? ఝుంఝూ మారుతము లిన్నిటి నెమరునిలిచి, ఏటికిన్ని యెదురీత లీది, అందరిచే చివర కౌననిపించుకొని, యప్పుడు.

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్న కథాకవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు
లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి
నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితారచన
బంధురుడయ్యె జగద్ధితంబుగన్".

ఇప్పటికొక్కదాని కథ ముగిసినది. ఇక రెండవదాని బరిశీలింతము దీని కిని విశిష్టత యేమైన నున్నదా, లేక అన్ని గ్రంథముల యవతారికవంటిదేనా యిది? ఒకవేళ ఏమైన విశేషమున్న నది నన్నయ యవతారిక బోయిన త్రోవల బోవునా, లేక దీనితెన్ను దీనిదియు, దాని త్రోవ దానిదియునా?

అక్కరమునేర్చిన ఆంధ్రప్రాణి కన్నుల కలువపూవు తిక్కన. అష్ట కష్టములపాలై పండిత జలదముల అనుగ్రహమునకు వేచి తెలుగు సాహిత్య క్షేత్రమును భారత సస్యయుక్తము గావించినాడు నన్నయ. శివకవుల చేతిలో క్షతి నందనున్న ఆ నన్నయచే స్థాపింపబడిన వ్యవస్థను తనశక్తికొలది యుద్ధరించి పూర్వపు రూపునకు దెచ్చినాడు తిక్కన.

"శ్రీయన గౌరినా బరగు
చెల్వకు జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహ
రంబగు రూపముదాల్చి విష్ణు రూ

పాయ నమశ్శివాయ యని
పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పర
తత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్

ఇది తిక్కన్న గారు తన కృతికి జేసిన మంగళాచరణపు వైఖరి. ఇది తన పూర్వుడు నన్నయ ననుకరించుటకు జేసెనా? లేక ఆయన వలె ప్రయోజనాకాంక్షియై రచించెనా? ఒకవేళ కాంక్షితమున్న అదియేది!

తిక్కనార్యుడు కనుదెరచు నాటికే తెలుగుదేశ మల్లకల్లోలముగ నున్నది. రాజకీయ పరిస్థితులను జూచిన నటు పాండ్యాదుల యుద్ధృతము తెలుగు టెల్లలపై యుప్పెనపొంగు. దాని నాకట్టు కాకతీయాంధ్రుల సంరంభము చిల్లర రాజ్యముల కంఠములపై కత్తి పెట్టినట్లు. అట్టి ఇరకాటములో బడిన యొక భూఖండము మనుమ సిద్ధి పరిపాలిత క్షితి. దానిని గాచుకొను శక్తిలేని యారాజు అటులటులే నెట్టుకొని వచ్చుచున్నాడు కాలమును. విద్యావిషయమున జూతునూ, నన్నయచేత వ్యవస్థితమైన యాంధ్రభాషోద్యానము శివకవి ఝంఝూ ప్రభంజనము పాలై యూరకున్నది. అయన యనువాద పద్ధతికి వీరి మణిప్రవాళశైలి యెదురుచుక్క. ఆయన చంపువులను వీరి ద్విపదలు నొసలు విరిచి వెక్కిరించును. ఇక సాంఘిక ముగా పరిశీలించిన, మతమే ప్రధానముగ రేగిన కలతలుపండి సంభవించిన పల్నాటి యుద్ధము పదునొకండువేల వీరుల నాహుతిగొన్న దుర్లిప్తలు వారి కన్నులముందు గడచినవే. కాననే శైవులన్న వైష్ణవులకు గన్నెఱ్ఱ. వైష్ణవు లన్న శైవులకు చేదు మాత్ర. వైష్ణవులపేరు విననగునేమో యని సంకూది గంట వాయింతురు శైవులు. శైవులమోము జూడవలయునేమో యని విసనకఱ్ఱ చాటున ముఖము చేరవేయుదురు వైష్ణవులు. తప్పిదారి యొకరితో నొకరు మాటలాడ వలసెనా ఆ విధియంతయు తేనెపూతనాలుక. విసపుపూత మనస్సు, 'నీచేత పూలు నాచేత రాళ్లు నీవు నన్నురువ్వు నేను నిన్ను రువ్వెద" నను వైఖరి.

ఈ విధపు టల్లకల్లోలము లేవియు మొదట మొదట తిక్కనకు కాబట్టలేదు. పిల్లతనపు టుత్సాహము మాత్రము నింపుకొన్న అతడొక్క కవీశ్వరుడు మాత్రమే. ఆతని కప్పుడున్నది గ్రథనాకౌశలమేకావి, గ్రంథకర్త

బాధ్యతాస్ఫురణగాదు. కాననే అందరు పోవు పోకలనే తానును బోయినాడు. కుకవినింద యన్నాడు. సుకవిస్తుతియన్నాడు. "అనులోదాత్తమనీషనే నుభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగుడనన్నాడు. నిర్వచనోత్తర రామాయణ మును జెప్పినాడు. వానియందు సామాన్యజీవితపు సరళవైఖరియే చిత్రితముగాని ఆనాటిప్రజల దుర్విధి ప్రస్ఫుటముగాలేదు. రామాయణము చెప్పినటుల నదియు రామకథనే చెప్పినదిగాని నాడున్న క్లిష్ట సమస్యలనెదుర్కొను మెలకువలు జెప్పనేలేదు.

తరువాత కాలము గడచినది. వయస్సు మళ్ళినది. అనుభవముచే గడించు కొన్న విజ్ఞతకు యజ్ఞము చేసి సోమయాజియైన పవిత్రత తోడైనది. సకల శాస్త్రపారముల జూచిన యాతని పరిపక్వహృదయమున కప్పటికి ఆనాటి పరిస్థి తులు కొట్టిరాగా భయవిస్మయోద్రేకముల విస్ఫారితనేత్రుడై సర్వము నవగాహన మొనరించుకొన్నాడు. ఇంతలో శక్తి యుడిగిన మనుమసిద్ధి రాచరికపు ముచ్చటకు నీళ్లు వచ్చునట్లున్నది. అయిననేమాయె, ప్రజ్ఞామూర్తి తిక్కనార్యుని ప్రతిభా నలమున కవి యాహుతి.

ఇక, సర్వవిధముల భ్రష్టులై యల్లాడు తనతోటి వారి నుద్ధరించుటెట్లు? వీనినన్నిటిని చక్కదిద్దవలయునన్న తాజేయవలసిన దేమి! అహోరాత్రము లాలోచించిన యాతని మేధస్సున నొక తటిత్తు భారతాంధ్రీకరణస్ఫురణ. నిజమే! ఐతిహాసికములలో రత్నములు భారత రామాయణములు. అవి రెండును నాటి కసంపూర్ణములే. కాగా, బుద్ధిపూర్వకముగనో, కాకనో, రామాయణమును తానే పూరించినాడు. ఇక మిగిలినది భారతమే. తన యూహలు కొనసాగుట కొక పెరటి కల్పకమును భారతమే.

కాని యేమన సత్త్వము గలవారి కావిధి స్ఫురించునటుల తాను రచింప గలడా భారతమును! ఆనాటి కాత డుభయభాషాప్రౌఢి బాటించు శిల్పమున బార గుడ' ననునది మరచినాదేమో? 'బాలస్వభావు'డట! "నేర్చినభంగి" దాని జెప్పి

భక్తకోటికి వరణీయు డగుటయే తన యభిలాష యట. – "కి మస్థిమాలాం కిము కౌస్తుభమ్" అను తత్త్వముతో పూర్తిగ నిండిపోయినాడామూర్తి. అంత నిర్లిప్తత కాలవశత నేర్పడినదే యనవలయును. అట్లని తన బాధ్యతను మఱువలేదాయన తామరపాకుపై నీటిబిందువువలె అంటియు నంట నటులున్న తన హృదిలో వేరులపాతిన కార్యనిర్వహణాశక్తిని తాను మఱవలేదు. ఎటులైనసరే తనచుట్టు నున్న వారిని సర్వవిధముల బాగుచేసియే తీరవలయును. అది తనవిధి. తనకు ఏ దేవ మానవులును శాసింపని యాజ్ఞ. విద్యావిషయకముగ నన్నయ యేర్పరచిన వ్యవస్థను పునఃస్థాపించునే పో, సాంఘికముగ నెటుల మార్పులు దెచ్చునో అన్న మన యనుమానమునకు విస్పృతి యాయన మంగళాచరణమును, ఆయనకృతి కన్యకా భర్తృవిషయమును.

హరిహరాత్మకమగు నా పరతత్త్వము తిక్కనార్యుని యూహలలో నిలచిన మతవిషయకమగు సువ్యవస్థకు పునాది. అది యిట్టిదట్టిది గాదు: నీవు శ్రీపతియనుము, గౌరీపతి యనుము, మురారీ యనుము, త్రిపురారీ యనుము, దానికి కాలుష్యముండదు. అమర్షముండదు. పైదు మిక్కిలి యట్టి వైదిక ధ్యాయిత కిచ్చమెచ్చును. తిక్కన యుందిమిడ్చిన సూక్ష్మమేమి? మత వైషమ్యములు కూడదయ్యా యనుట. శివకేశవు లకభేదమయ్యా యనుట, నిష్కారణముగ నీవునొచ్చి యితరుల నొప్పింతువేల యని మందలించుట. ఇట్టి తనయూహను, ఆదర్శమును, భారత పండితు లందరాదరించి యాచరింతురని యా పుణ్యమూర్తి నమ్మకము, అయిన నితడూహించిన ప్రయోజనము పాఠకులకు చప్పున స్ఫురించునా? కృతిపతిని దెలిసికొనునంత యుత్సుకత ప్రతిపాఠకున కుండునా? మరి వాని హృదయము నాకర్షించు నటుల యా కృతిపతి నచట నిలువబెట్టవలయును. అట్లు జేసిననే యందల నిగూఢత, ప్రయోజకత, వానికి దెలిసివచ్చునది. ఇదంతయు యోజించియే క్రొత్తపుంత ద్రొక్కినాడు తిక్కనార్యుడు.

తాను "ప్రబంధమండలి కధినాథునిగా నే పురుషుని బేర్కొనువాడనో యను తలంపుగూడిన మదితో" ఇంచుక "నిద్రించు సమయమున" తన తండ్రి

గుంటూరి విభుడు, కొమ్మన దండనాథుడు, స్వప్నమున గాన్పించినట్లు, హరిహర నాథుని యాదేశము తనకు వినిపింప వచ్చినటుల జెప్పినాడు. తరువాత నా పరతత్త్వము సాక్షాత్కరించుటయు నాయన-

పారాశర్యుని కృతి యయి
భారతమను పేర బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు త
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్.

తెలుగుబాస వినిర్మింప దివురుటరయ
భవ్యపురుషార్థ తరుపక్వ ఫలముగాదె
దీనికెడ నియ్యకొని వేడ్కనూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితి దిక్కశర్మ.

అని యర్థించుటయు దెల్పినాడు. ఈ యుదంతమునందు సత్యముండు ననుకొనవచ్చును. లేదా, కవి చాతుర్యఘటిత మనుకొనవచ్చును. ఎట్లైనగాని, నూతనమైన యీ పోకడ తిక్కనార్యుడు బుద్ధిపూర్వకముగనే ప్రయోజనాకాంక్షి యైయే పోయెనేమో యనిపించును.

ఇక ప్రజలలో ధర్మోత్తీష్ఠ గల్పించుటకై నెన్నుకొన్న భారతము,

"వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్."

మరియు "ధర్మార్థకామమోక్షస్థితి" కిని "మూదల యైనది. అట్టిభారతము మును దెనిగించు తాను.

"వైదికమార్గనిష్ఠమగు
వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి మతి
నిర్మలవృత్తిగ జేయుచుండు

హరిహరాత్మకమగు పరతత్త్వపు, "పాదనిరంతర స్మరణ తత్పరభావము కల్మి నాత్మసమ్మోదము" బొందువాడు. ఇట్లు సంస్కృతమున "కృష్ణ ద్వైపాయను డర్థిలోక హితనిష్ఠంబూని' భారతమును జెప్పగా, తాను తన కామ్య సిద్ధికై దానిని తెలుగు సేసినాడు. ఆ కార్య మవిఘ్నముగ కొనసాగినది. విరాట పర్వాదిని కలము మోపిన తిక్కన స్వర్గారోహణ పర్వాంతము సాగిపోయినాడు. ఇక పాడవలసినది మంగళము. అదియే ఫలశ్రుతి.

ఇక దీని ప్రాముఖ్యమెట్టిది?

సర్వ ధర్మముల నొక కథలో నిమిడ్చి విసు వనకుండ జెప్పినారు. అవి కొందరికి రుచింపవచ్చును. మరికొందరికి రుచింపక పోవచ్చును. కొందరు వాని నాదరింప వచ్చును. మరికొందరు చిన్నచూపు చూడవచ్చును. ఇట్లు వైముఖ్యము గలవారికి లంచములు పెట్టుట వంటివి ఫలశ్రుతులు. వీనివలన పలువురా గ్రంథమును జదువునటుల మభ్యపెట్టవచ్చును. వాని ఫలములు పఠితల కందనీ, అందకపోనీ, పెద్దలు చెప్పిరికాదా అట్లగునని! ఆ నమ్మకము వేళ్లుపారినది గాదా హైందవహృదయములలో! కాననే వారు చదువుదురు. మనస్సులలో అవ్యక్తమైన తృప్తిని నింపుకొందురు.

అదియే భారత ఫలశ్రుతి యుద్దేశ్యము గూడను. ఏ విధముగనైననేమి ప్రజలు భారత ప్రతిపాదిత ధర్మములను నిత్యజీవితమున జీర్ణించుకొనుటగదా కావలసినది. కాననే ఏరకపు మనుజుల కనుకూలములగునట్లు ఆ ఫలములు గలుగు నిర్ణయములును గలవి ఫలశ్రుతిలో. జనులందరికిని జెప్పిన సామాన ఫలము అఘములు వ్రాయుట: ముక్తి సిద్ధించుట. నాకలోకము గలుగుఁ పాతకులు వినిరా బ్రహ్మహత్యాది పాతకములైన బాయును. పండుగ పబ్బముఁ నే ఫలము కాంక్షించి నిర్వహింతుమో, పితృకార్యముల నే యాశిషముల నర్థించి నిర్వర్తింతుమో, అవియన్నియు నాయారోజుల భారత పఠనమాత్రమున గలిగి తీరును. బ్రహ్మ క్షత్రియులు దీని వినుటచే శత్రుల జయింపగల్గుదురు. కన్య పఠించిన సద్వరుగాంచును. గర్భిణి చదివి సుపుత్రవతి యగును. కోర్కెలు గలవారి కోరిన కోర్కెలు దీరును. అర్థితో విన్నను, భక్తితో పఠించినను శ్రీయు,

వాయువు, భూరియశంబు, ప్రమదమును, దృఢ విద్యయు గల్గును. ఇది పంచమ వేదమగు భారతసంహితకు ఫలశ్రుతి.

ఈ విధముగ నన్నయ తిక్కనల భారతావతారికలు రెండును రెండు తెన్నుల బోవును. నన్నపార్యుని విషయమున, నా యవతారిక యందాయన పడ్డ పాట్లు, ఆ కష్టములను గట్టెక్కుట కామోదించిన పండితసభల పొగడికలు, తనకు చేయూతనిచ్చి కంటికి రెప్పవోలె గాచికొనుచు వచ్చిన తన మిత్రుని ప్రశంసలు ఇవి గాన్పించును.

ఇక తిక్కనగారి యవతారికలో నాయన యంటీ యంటనితనము, తన కున్న బాధ్యతను నిర్వర్తింపుకొనుటలో, తన నెత్తిపైగల బరు వితరులకు దెలియకుండ దింపుకొనుటలో గల యొడుపరితనము ఇవి యెదురగును.

వీనినన్నిటిని సమాలోచించి యేర్పరించుకొన్న వారిరువురి మూర్తులును రెండు విధములు. నన్నయ యొకఋషి. అయినను పసిపాపవలె నాతడతి స్నిగ్ధుడు. తిక్కన యొక కర్మవీరుడు. ప్రపంచమును కాచి వడపోసిన శతవృద్ధునకు వలె నాతడతి గంభీరుడు. మానవుని ఆద్యంతదశల నీవిధిని రూపొందించుకున్న వీరిరువురును ధ్రువప్రాయులు. పూర్వపు టౌన్నత్యమును మరచి యైకమత్యము లేక కొట్లాడుకొను నేటి యాంధ్రులకు గర్వకారణములు.

మార్చి 1949 - భారతి

# 2. ప్రబంధకాలపు ప్రజలు

దైవప్రసాదితమైన మానవుని మెదడునందెన్నో యూహలు పుట్టును. అవి దైనందిన జీవితమున పరిభ్రమించునవి కావచ్చును; లేక మనుష్యాతీతములగు సత్యములు కావచ్చును; వాని నన్నిటిని వెల్లడించుట కాతని హృదయము తొందరించును. కావ్యసంస్కారమే వానికి కలదేని భాష నాధారముగ జేసికొని యా యూహాలు వెలికురుకును. ఆ యురుకుట యటునిటుగాదు. సర్వకాలముల యందు, సర్వజనుల మధ్య నిలచిపోవు నట్లురుకుట యది. అట్లొక రూపమును బొందిన యాతని యూహయే కావ్యమగును. అది శబ్దార్థ సహిత మగుట సాహిత్యమున జేరగలదు.

సాహిత్యబీజములు వేదములలో మొలకెత్తినవి. తిన్నగ తీగసాగినవి. కుసుమితమైనవి. కాని యింకను పూవు ప్రఫుల్లము గాలేదు. వెన్నెల నిగ్గులను వెదజల్లలేదు. జ్ఞానమహావట మింతలో పెల్లుపెరిగి యుపనిషత్తులను నూడల కిరవైనది. ఆ యూడలనడుమ వాడిపోవుచున్న కావ్యలతా మతల్లిని జూచినాడు వాల్మీకి. కరుణతో నాయనహృదయ ముప్పొంగినది. దానికి ప్రోదిచేసి ప్రాణము పోసినాడు. సంస్కృతమున వాల్మీకి యెటులో ఆంధ్రమున నన్నపార్యుడటుల. ఆయనను మొదలుకొనిన యా మహాకార్యనిర్వహణము నేటివరకు పరంపరగ సాగివచ్చుచునే యున్నది - అయిన దీని ఫలమేమి? కావ్యములు, కావ్యరాజములు మన దైనందిన జీవితమున నుపయోగపడగలవా? తమ కాలము నాటి వింతలను విశేషములను మనతో నోరువిప్పి చెప్పగలవా? అట్లులని అవి మనకు జ్ఞానదాయకములగునా, లేక యుబుసు పోకకు చదివి యానందించుటకే యగునా.

నేటి ప్రపంచము మన కవగాహ్యమే. అందలి యాచారాదికములకు మనము సుపరిచితులము. ఇవి యెంత అసందర్భముగ నున్నను క్లిష్టములుగ నున్నను మనకెబ్బెట్టుగ దోచదు. మీదుమిక్కిలి వాని నభినందించి పురస్కార మిచ్చుట మనకు పరిపాటియైపోయినది. అయిన, ఈ యాచారాదికములే, ఇట్టి

దైనందిన జీవితములే మనకు పూర్వమునగూడ నుండెడివా, లేక అందేమైన మార్పులుండెడివా? ఎట్లు తెలియు నీ పురాతనచరిత్ర? దేశచరిత్రలను జదువ వలయునందురా! విసుగును పుట్టించు సత్యముల పట్టికవలెనున్న ఆ రసహీన గ్రంథములను జదువుట కెవరయ్యా యిచ్చగింమనది?

సాహిత్యము లోకవృత్త ప్రదర్శకమే యనుకొందుము. అయిన మనకు గావలసినది పురాణయుగ వాఙ్మయమా, 'పబంధయుగ సాహిత్యమా యనునది ప్రశ్న. పురాణయుగము వారందరు నతి సరళ వర్తనులు వారి జీవితములు అతిశ యించిన రసప్లావితములుగావు, సుఖదుఃఖముల సమముగా ననుభవించిన వారు. భారతమున్నది. అది దాయాదుల మధ్య జరిగిన కలహకథా కలితమే. అయినను దానిని జదువుచున్నంతసేపు ధర్మాధర్మముల మధ్య సంఘర్షణమను స్ఫురణయే మనయందుండును గాని అన్నదమ్ముల కలహ మనిపించదు. ఆనాటి క్షత్రియులు మానధనులు. వారికి రాజ్యముల ముందు, ధనధాన్యాదికముల ముందు మానమే యధికము. ఏతత్ప్రదక్షణమునకై రాజ్యము గావలసి కోరిరేగాని నిజముగ నైహికవాంఛలు లేని నిస్పృహులువారు. ఎన్నికష్టములు వచ్చినను, సత్య వాక్పాలనాదక్షత యన్నది వారి సొమ్ము. తమ గమ్యమును చేరుట కా సత్యసంధత యెన్ని యడ్డంకులైన గల్పింపనీ వారు దానిని విడువరు, అచటనే యున్నది. వారి నైతికశక్తి; మన హృదయముల నాచికొను నమోఘశక్తి:- ఇంక నానాటి విప్రుడాతడు మానవుడు కాదు. మానవాతీతమైన యొకానొక యపూర్వశక్తిని నరనరముల జీర్ణించుకొని ప్రాచీనహైందవ సంస్కృతికి "జీవగఱ్ఱ" యై నిలచిన యమరుడుగాని. అతని హృదయము సకల మనుష్య హితవాంఛా పూరితము. అతని నడకలో అధర్మములేదు. చేతలలో కాఠిన్యములేదు. పలుకులలో వక్రతలేదు, నిలువెల్ల నమృతమూర్తి ఆతడు; ఏనాటికిని నాశము జెందని అమరుడు:

అట్లే పురాణయుగమున చిత్రితమైన ఏ కులమును తీసికొన్న ఆ కులము మహోత్తమైన దనిపించును.

ఇక ప్రబంధయుగము. ఇందలి పాత్రలును, మనమును ఒక్క రేకులోని వారము. ప్రబంధములోని నాయికా నాయకులు అలౌకికులైనను, వారిలోకవు

సరిహద్దులను దాటలేదు. వారి జీవితచిత్రణమునందు సత్యమున్నది అసత్యమున్నది. అసలు సాహిత్యోపాసకులకే సత్యములేని అసత్యముగాని అసత్యము లేని సత్యముగాని యింపుగూర్పదేమో!

ఈ యుగ మాంధ్రవాఙ్మయమున స్వర్ణయుగము. కవిజనావర్తితుడు కృష్ణరాయలు, అష్టదిగ్గజాలంకృతమైన అతని సభాస్థలి, నూహించుకొన్ననే చాలును హృదయము కృతజ్ఞతా ప్లావితమగును. ఆనాటి పెద్దన తిమ్మనాదుల కృతులే ప్రబంధవాఙ్మయమునకు వెన్నెముక.

ఇక కథలోనికి దిగుదము - అల్లసాని పెద్దనార్యుని ప్రవరు డున్నాడు. ఆనాటి బ్రాహ్మణుని గాఢశీలము, ఆచారాదికము లాయనయందు ప్రస్ఫుటములు ఆతడు యౌవనుడు; యజ్వ! ధనాఢ్యుడు:- "కమనీయకౌతుక శ్రీవిధి కూకటుల్ గాలిచి చేసిన కూరిమిసోమిదమ్మ సౌఖ్యావహయై' చేయు భజింపు లందుకొను భాగ్యశాలి. అట్టివానికిని తలిదండ్రుల క్రింద నణగియుండుట యిచ్చగింపు. కాననే "దేవియు దేవరవోలె" వారిరువురు నిలుదీర్పగా తన కేమియు పట్టనటుల చేతులు కడిగికొని కూర్చొనినాడు. ఆతని కాస్థితియందు కష్టములేదు. మీదు మిక్కిలి అట్టిజీవన మాతనికి ఇష్టము.

ఇక నాతని దినచర్య పరికింతమా, "వరణాంతరగిణీ దరవికస్వర నూత్న కమల కషాయ గంధము వహించి ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ వామనస్తుతి పరత్వమున" లేచును. లేచి, "సచ్ఛాత్రు డగుచు నిచ్చలు నేగి యయ్యేట నఘమర్షణ స్నాన మాచరించు"ను. అది ముగిసిన వెనుక "సాంధ్య కృత్యము దీర్చి సావిత్రి జపియించి సైకతస్థలి కర్మసాక్షి కెఱగి" యింటిత్రోవ బట్టును. అ వచ్చుటయు నెట్లు? ఒక ప్రక్కన సమిత్కుశ కుసుమాది బహుపదార్థ తతియు, మఱియొక ప్రక్క నుదికిన మడుగు దోవతులును గొని బ్రహ్మచారులగు శిష్యులు వెంటరాగా; ఈ దృశ్యమును ప్రజలందరును మెచ్చిచూతురట! ఎందుల కా మెచ్చికోలు? అప్పటి విప్రున కంత వైశిష్ట్యమా? దానిని పెంపొందించు కొనునంతటి పూతచరిత్రుడా ఆనాటి ఆతడు?

అతిథిమర్యాద! ఆనాడు "బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావధూత కాపాలికా ద్యనాథు"లకు గృహమేధి యనువాడు కడలేని యమృతంపు నడబావి. దొడ్డిపెట్టిన వేల్పుగిడ్డి. మఱియు పండిన పెరటి కల్పకము. అంకస్థితార్థపేటియును, ప్రవరాఖ్యునే తీసుకొందుము. అతడు తీర్థ సంవాసు లేతెంచినారని వినెనా, ఎంతదవ్వైన నెదురుగా నేగును. ఏగి తత్పద ముల కెఱగి యింటికి దెచ్చును. తెచ్చి యాతిథ్యమిచ్చును. ఆ యిచ్చుటయు నెట్లు? "పోనిమ్ము తినిపోవును. మనకు పుణ్యము, అతనికి తృప్తి" యనిగాదు. "సద్భక్తి"తో నిచ్చుట యది. ఇట్టి యీసత్కార ముఖసుపోకకు జేయునదిగదు. ఆనాడది విధాయకకృత్యము. కాననే :-

"అతిథి కడు నల్పుడైన యత్యధికుడైన
నింటి కేతేర ప్రియమందు నెవ్వడేని
వాని గౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకార గౌరవంబు"

అను శాసనము శ్రీనాథుని వాక్కునుండి వెలువడినది. ప్రవరు డొక్కడే కాదు. ప్రబంధములలోని ప్రతిగృహస్థు ఈ శాసనము నక్షరముల పాలించిన వాడే. విష్ణుచిత్తుడున్నాడు. ఆయన అతిథి కార్య నిర్వాహణము నందు ప్రవరని కంటె ఏడాకులెక్కువ చదివినాడు. ప్రవరాఖ్యుని పని అతిథుల ఇష్టాన్న సంతృప్తులుగ జేయుటవఱకే. ఈ వైష్ణవు డటులకాదు. భోజనమునకు ముందు స్నానము చేయించుట దగ్గరనుండి శ్రద్ధాకలితుడు. అతిథు లొడలు తోము కొనుట కిప్పపూ ముద్దలను, అరటిదొన్నెలతో నూనెయు "సరఫరా" చేయు నీ భాగ్యశాలి. తరువాత భోజనము. ఈ విషయమున భోక్తల కెక్కుడలేని సౌఖ్యము. శీతకాలములో వారికి పెట్టు భోజనము వేఱు; వేసవియందు భోజనము వేఱు.

సీ. తెలి నులివెచ్చయోగిరము
తియ్యని చారులు తిమ్మనంబులున్
పలుచని యంబళు ల్చెఱకు

హా లెడసీళ్ల రసావళు ల్పలం
బులును సుగంధిశీత జల
ము ల్వడబిందెలు నీరుచల్లయున్-"
వెలసెడి భోజనము వేసవియందు.

పునుగుందావి నవోదనంబు మిరియం
పుం బొళ్ళతో జట్టిచు
య్యాను నాదాఱని కూరగుంపు ముకు మం
బై యేర్చునావం జిగు
క్కాను పచ్చళ్లను పాయసాన్నములు నూ
రుంగాయలున్ చేసుఱు
క్కాను నేయుం......"

ఇది శీతకాలపు భోజనముయొక్క "సరంజామా". ఇట్లానాటి యతిథుల పని స్వర్గమునకు బెత్తె డెడముగ నుండెడి దన్నమాట!

ఇక బ్రాహ్మణుల నియమ కృత్యముల బరికించగలిగిన, ప్రవరు డున్నాడు. అతనికి హిమాచల సీమలనుండి యింటికి మఱలుటకు దారియు తెన్నును గాన రాలేదు. అతని వంత చూడవయు నప్పుడు. ఆచింత యేకాకి నైతినే యని కాదు. ఇల్లు వదలి వచ్చితినేయని యంతకంటెగాదు. సకాలమున నిల్లు చేరకపోతినే, విధాయక కృత్య నిర్వహణకు లోటు కలుగునేయని! అగ్నిహోత్రములూ, అతిథి సంతర్పణములును ఏమయ్యెనో యని; హవ్యవాహనార్చనకు ముందితర సుఖము లాతనికి మీసాలపై దేనియలు. అగ్నులు. అరణులు, దర్భలు ప్రియమైనటు లా బ్రాహ్మణున కింకొకటి ప్రియము కాజాలవు.

అయిన నందఱు నట్టివారేనా? ఆనాడు దుష్పథగాములు లేనే లేరో యందము.

వెనువెంటనే తెనాలివారి నిగమశర్మ మన కన్నులయెదుట నిలువకతీరదు.

అతడు "ప్రాసగు విత్తువంటి నెఱపాటుకోలంబున" బుట్టినవాడు. అతని తండ్రి "వేదములు వ్రాసినగాదె." "శాస్త్రములకు పుట్టినయిల్లు." "కళా కలాపములు డాసిన రచ్చ." నిగమశర్మయు కొంచెపువాడు గాదు. ఒకప్పుడు "భూజనసన్మాన్యవిశుద్ధవర్తనుడే" ఆతడును. "అనూచానసంతతి నవతరిలిన" యుత్తముడు. "సకలనిగమశాఖా రహస్యముల" గనినవాడు. రూపముననో "సమగ్ర కాంతి మహిమయందు చంద్రునకు పెన్నుద్ది" అయిన నేమాయె? ఇన్ని మంచిగుణముల కొక్క టే మజ్జిగచుక్క; అతడు "వాచాలత నుత్కోచు" డట! మనస్సును "తార్తీయ పురుషార్థమునకె దార్చినవా" డట:

ఇక చూడవలయును వాని వేషాదికములు. తలగడు గంగమర్దనము, ధౌతపటావరణము, సంస్కృతోజ్జ్వల కలమాన్నము, చందనచర్చలు, ప్రసూన దామకములు, కవురంపు వీడ్యములు భూషణపంక్తులు – ఇవన్నియు నాతని కేపూట కాపూట యమర వలసినవే: అట్టి రసికుడగుట నా బ్రాహ్మణుడు 'ఉఫ్'న హోమాగ్ని యూదడు. సంధ్యకు ప్రార్థనాంజలి ఘటింపడు. ఆగమ వాదము లౌగా దనడు. కంబుభృత్పాదోదకములు గ్రోలడు. పుణ్యచిహ్నము లపఘనంబున ఘటింప నేరడు. కాని విటజనులకు దగిన పనులన్నియు జేయును. తాతముత్తాతలు చీమలవలె గూడబెట్టిన విత్తమును కర్చుచేయును. 'దినవెచ్చము నకై తన మేనగల సొమ్ములును, తన తల్లి వద్దనున్న పసిండిని కుదువబెట్టును. తండ్రికడనున్న పత్రములు మ్రుచ్చిలి వచ్చినంత ఋణమునే రాబట్టుకొన బూనును ఇవియేవియు సాగనినా డు,

"వలువకు గూటికినై నీ
చుల వేడం బోడ చొరవ జొచ్చు నతడు పూ
వుల ముడిచిన యంగళ్ళనె
కలకల వీడెల్ల నవ్వ కట్టెలు'

మోయును. అట్టి యా దుర్విదగ్ధుడు "పదను విడచిన కస్తూరి.' ప్రాచీ యలరు, పాయబారినకూడు, సీర్వట్టు నుడుగు, ఇంకను "గళితమణియగుసొమ్ము ఇంతియేనా అతడుచేసినది? తనవారిని నమ్మించి యున్నటులుండి యింటగల

సర్వమును దోచికొన్నాడు. తరువాత తన ప్రాణదాత, తన కాశ్రయమిచ్చి సాకినవాడునైన కాపుబిడ్డకు మిత్రద్రోహ మాచరించినాడు.

ఇక క్షత్రియులు: ఆనాటి వసుంధర యేకచ్ఛత్ర పాలితముగాదు. శక్తి గలిగిన ప్రతిక్షత్రియుడును ఇంతో అంతో భూఖండము గలిగినవాడే. దాని కాతడు కిరీటమున్నను లేకున్నను రాజు. దానిపై సర్వాధికారము లాతనివి. ఆ యధికారములకు గాని, తన రాజసమునకు గాని గోరంత కొఱత వాటిల్లినా ఆనాటి పౌరుష ధనుడు రక్తపుటేరులు పారించును. ఆ యుద్రేకము ముందు, ఆ యావేశము ముందు అతనికి ప్రజాసామాన్యపు కడగండ్లు స్ఫురింపవు. మీదు మిక్కిలి యట్లుచేయుట పాపావహ మనియు నాతడను కొనడు. అది యాతని విధాయకకృత్యము. దానినుండి వెనుదీసెనా ఇహపరములకు దూరమగును. తోడివారు నవ్వుదురు. అట్టి మనస్తత్వ మానాటి క్షత్రియునిది. అంతటి పౌరుష ధనుడు వాడు.

మూర్ధాభిషిక్తుడగు నొక రాజన్యుని దినచర్యను తెలిసికొన నుత్స హింతుమా, దాని సన్నాహ మొక యశ్వమేధము జేసినంత. రాజుగారు మేల్కొనుట వైతాళిక కృత గీతములతో, ఇక స్నానాదికముల నిర్వహణ ముండును. అది సులువుగా దెగునది కాదు. ఒక్క తరళేక్షణ హస్తము కేల నూదవలయును. కంచుకి సముచయంబు "సముఖా" యనవలయును. అప్పుడే అతడు గద్దియ డిగ్గును. అంతనొక భామామణి పసిడ పావలు దొడుగును. తరువాత,

> "కేళిగతిమీర మజ్జనశాల కరిగి
> శాతమన్యవ మణిమయాసనము నందు"

విభూషణోత్కరములెల్ల నొయ్యనొయ్యన సడలించు నన్నమాట.

అంత తనూవిలాసలీల జూపుచు నొక చంద్రనిభానన సంపెంగనూనె యంటును. మఱియొక యంగన కోమలలీల "తెలిగొజ్జగి నీరెడ చల్లిచల్లి గంధా మలకంబు" వెట్టును. తక్కిన చెలులు హేమకుంభములతో చేతికి జలమందీయ

నొక్కులతాంగి "వినిర్మల బాహుమూల రుమ త్వేలి బొలయంగ" జలక మార్చును. ఇది స్నానఘట్టము. ఇక నలంకరణ. "చంద్రికపూవన్నె జిలుగు దువ్వలువను తడి యొత్తెడి కాంతాలలామ యొకతె. "కొనగోళ్ల నెఱులు సిక్కులు వోమెలపున శిరసార్చెడి చిగురుబోడి" యొకతె. "వెన్నెల నిగ్గులు వెదజల్లెడి మడుంగు లందిచ్చు పూర్ణేందువదన" యొకతె. "నవరత్నమయ భూషణ వ్రజంబులు మేన గీలించు కీరవాణి" మఱియొకతె. ఇంకను విరుల సరులిచ్చెడి వారు, చందన మలందు వారు, కపురంపు సురటి విసురువారు, నిలువుటద్దము నెదుట నిలిపెడివారు. ఓ ఒకరేమి. అతని పని మూడు పూవులును అరుకాయ లును: ఈ రంగమున కంతయు మంగళము బాడుదురు, "మౌక్తిక విచిత్ర నీరాజనము లిచ్చి" మఱికొందఱు నెలంతలు. తరువాత భోజనము గారుత్మత రత్నపాత్రికలలో. సాధారణముగ నాత డొంటరిగనే భుజించును. తిక్క తిరిగెనా బంధుమిత్ర పరివ్రాజ సమేతుడును కావచ్చును. బహుభక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య పానీయములున్న గాని విస్తరి లేవదు. అంతయునైన తరువాత చేతులు కడిగికొనుట. అందును గూడ విశిష్టతయే.

> "వామనేత్రా కరాంచ లావర్జ్యమాన
> కనక భృంగార కర్కరికా ముఖాగ్ర
> గళిత గంధోదకములతో గడిగి."

కొనునాతడు. పిమ్మట "నడపంపు తొయ్యలి మడిచియిచ్చు తెలనాకు చీలికల" నందుకొని "పలు తెరంగుల పట్టు తలగడబిళ్ళలు, మవ్వంపు కుంకుమ పువ్వు పఱుపు గలిగి మెఱుగులు దిక్కులు గడలుకొనగ నట్టిటు లూగుచుండను అప్పుడు "సభాగృహ సమాగమనార్థులు కొల్వుసేతకై యెప్పటియట్ల యందఱు బహిస్థితులై" యెఱిగించి పంపుదురు. ఇక నాపాటున రాజుగారు సభాప్రవేశ మొనరించు నన్నమాట. ఆ సమయమున వందిమాగధుల జయకీర్తనలు సెలగ వలయును. మంగళనాదములు బోరన మ్రోగవలయును. మధ్యమధ్య నట్టువరాంద్ర నృత్యములు, గాయక గణికా వచస్సీధు రసములు అన్నియు నమర వలసినదే. ఇట్టి దానాటి రాజుల దైనందిన చర్య. ఇది నిజమా యనిన,

అంత యసామాన్యత ప్రతిరాజునకు వచ్చునా యని సందేహింప వలయునే కాని, పేరు మోసిన రాయలవంటివారికది దుస్సాధ్యము కానేరదు.

ఇక నా కాలపు స్త్రీలు: వారికి స్వాతంత్ర్యమున్నది. అస్వాతంత్ర్యమున్నది.

పారిజాతాపహరణ నాయిక సత్యభామ. ఆమెది రాజసప్రవృత్తి. పతి యామెకు దైవమగునో కాదోగాని ప్రాణములకన్న ప్రియముగూర్చు చెలికాడను నది స్పష్టము. ఆతని వియోగమును, విశ్లేషమును నుంతమైన నోర్చుకొన లేదామె మనస్సు. అట్టియాత డవమానమే చేసెనో, ఇక చెప్పవలయు నామెస్థితి! "పతి కడు మేర దప్పెనే కులకాంతల కిక నేమి గతి" యని వాపోయినది. శ్రీకృష్ణుడు క్షమార్పణ గోరుచు "తత్పద ద్వయీ పాటలకాంతి మౌళిమణి పంక్తికి" వన్నె పెట్టు నటుల మ్రొక్క నా లతాంతాయుధు కన్నతండ్రి శిరమును తొలగద్రోసినది ఆ త్రోయుటము వామపాదమున. ఇది యుచితమా, అనుచితమా యని ఆలోచింప నీయ లేదామె రాజసము. మీదు మిక్కిలి –

"మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిల స
న్మానములకు మూలంబగు
మానరహితమైన బ్రతుకు మానిని కేలా?"

అని మనచే నౌ ననిపించుచున్నది. ఎంత గడసరి ఆనాటి స్త్రీమూర్తి: ఆ గడుసుదనములోని స్వాతంత్ర్యచ్ఛాయలైనను ఎంత స్నిగ్ధములు:– అప్పటి స్త్రీ లందఱును సత్యవలె సత్రాజిన్నందినులు కాకపోవచ్చును. విష్ణురూపుడగు శ్రీకృష్ణుని పతిగ పడయకపోవచ్చును. కాని వారును పతిప్రాణైకజీవులై యుందురు. ఆతని నుండి కించిదవమానమును సహింపలేని యసహనలై యుందురు. తాము పట్టినపట్టు విడవక సాధించు ప్రౌఢలై యుందురు. తన్ని ర్వహణమున నేమైన నడ్డంకులు కలిగిన సత్యవలె సరసముగ సమాధానము జెప్పునంతటి యుదాత్తలై యుందురు వారు.

ఇట్లే యింకొక యద్భుతవ్యక్తి "నిగమశర్మ అక్కగారు." అమరమైన యిట్టి శీల చిత్రణమున ధన్యత గాంచినాడు రామకృష్ణుడు ఈమె సత్యవలె రాజ వంశోద్భూత గాదు. ఆమెకున్న రాజసము లీమెకు లేవు. ప్రాసగు విత్తువంటి నెలపాటుకొలంబున జన్మించిన బ్రాహ్మణి యీమె. గృహకార్యములందు దక్ష. ఏ పని యెప్పుడెటుల చేయవలయునో యెఱిగినప్రౌఢ. ఎవ్వరి మనస్తత్త్వము లెట్టివో తెలియగలుగు నేర్పరి. ఈయమను నిగమశర్మ అక్కగారుగ నూహించిన దానికంటె, ఆనాటి బ్రాహ్మణ యువతీ ప్రతినిధిగ, రూపుదాల్చిన చాతుర్య నిధిగ మన హృదయముల నిలచిపోవును. అత్తయింటినుండి వచ్చిన దా బ్రాహ్మణి. ఆ వచ్చుట దుశ్శీలుడగు తమ్ముని శిక్షించుటకు అంతకు ముందు ఆమె చేసిన పని "కొడుకు చెడునడవడికి నడలు కడలింబడి సుడివడియెడి తలిదండ్రుల దీంద్రగల వచన రచనాచమత్కారముల నుదారముదారోపణకరణోపచారంబుల" కొంత వంత తొలగించుట. తరువాత అతిథి సంతర్పణాదికముల నేర్పున బచరింపించినది. పుస్తక భాండాగారమును చోరాగ్నియాచకాది ప్రమాదముల నుండి రక్షించినది. తరువాత విగళిత సన్నాహంబగు గేహంబు యథాపూర్వ నిర్వహణ మనోహరముగ ననుసంధించి చదువు సంత సాగించి నడిపించినది - ఇక తమ్మునికడ నామె ప్రవర్తనము. ఈనాటి. వారేయైన అట్టి దుష్ప్రవర్తనుడు కన్నుల బడినంతనే తలవాయ చీవాట్లు పెట్టియుండెడివారు. ఉచితజ్ఞ ఆమె యట్లు చేయలేదు. సరిగదా ఒక్క కరుకు పలుకైన ఆడలేదు. ఆదరమున భోజనముపెట్టి తాను తిని, 'ఇంతలు నంతలు నగు తన సంతానము చంట వెంట సందడి సేయగా' వచ్చి కుశలాశయయైనది. ఎన్నాళ్లనుండియో సరిగ దువ్వక చీదబట్టిన తమ్ముని తలను శుభ్రపరచినది. మెదమన్నునలచి యలకలు ముడిచినది. నిజపాణిపద్మములు గరగరగా గడిగికొన్నది. ఈ పని యంతయు తమ్మునితో నేమియు పలుకకయే చేయుచున్న దన్నమాట! ఆతని భావములు తన యెడ నింక స్నేహార్ద్రములై యుండునన్న నమ్మకము గుదిరిన తరువాత మొదలు బెట్టనది మందలింపు. చెప్పిచెప్పి చివరకు, "మామక బుద్ధిపద్ధతి నడువుము నీకు గావలెసినా హరికౌస్తుభమైన దెచ్చెద" అని ధీరయై పలికినది. అహో! ఎట్టి ఆత్మవిశ్వాస మామెది.

భారతీయస్త్రీ జీవనపథమున కాంతులు జిమ్ము అట్టి పవిత్రచరిత్ర లెందరో ఆ నాడు ?

ఇంతవరకును స్త్రీల కెక్కడను కట్టుబాట్లులేవు. వారికి సంఘ మడ్డు కమ్ములు బిగించలేదు. స్వతంత్రలే వారు.

ఇక పరికింతము శ్రీనాథుని కాశీఖండమును. అచ్చటి స్త్రీ కక్కరకు మాలిన నియమములు. కేవలమామె పురుషునిచేతి కీలుబొమ్మ. అట్లు తయారుచేయుట వారి యుద్దేశ్యము గూడను. ఆమె "పతి. పిల్వబంచిన పనియేమి యని వచ్చి చెప్పిన యుడిగంబు సేయవలయును," "ప్రకృతి బంధునకైన భర్త యానతి లేకయే పదార్థంబును నీగి" చెట్ట. జీవితేశ్వరుడు డించిన యోగిరమును గుత్స సేయక భుక్తిగొనవలయును. అనుష్ఠాన భంగముల దక్క సుఖసుప్తుడైన నిజేశుని ప్రబోధించరాదు. ఒంటి నెచ్చెలి కరుగుట యుక్తిగాదు. తడుపుగట్టక నీరాడ తగవు గాదు. కడప మీదను మరి సన్నికంటిమీద జక్కిమీదను గూర్చుండ జాదగాదు. ఇంకను

> "కాంతుడు సంతోషించిన
> సంతోషింపగ వలయు సతి కత డాత్మన్
> సంతాపించిన పట్టున
> సంతాపింపంగ వలయు జలజేక్షణకున్."

ఓహోహో: ఏమి ధర్మబోధనమయ్యా యిది: పతియందనురక్తయైన యే సతికైనను బొట్టును కాటుకయు బెట్టి యీ ధర్మములు నేర్పవలయునా? అనురక్తలు కానివారి కందురా, అట్లు కానివారికి నేర్పిన పట్టుబడునా! భర్తకు ప్రియము గూర్చు భార్యయే యైన భర్త సంతాపించిన నీమె సంతాపింపక సంతోషించునా? లేదు, సంతోషించునే యనుడు. అప్పుడు "బొల్లి బొల్లి యేడుపైన నేడువ వలయునే తల్లీ" యని చెప్పుటయా యిది?

ఇక విధవలు "యుప్పిండియుపవాస" మున్నను నిష్ఠా జప పరాయణ లైనను, సద్భక్తి దేవతార్చనాదికముల నిర్వర్తించినను మగనాలికి సరిపోలరట. నిజమే, ఎటుల సరిపోలుదురు లెమ్మని యూరకొందము. పోనీ, అంతటితోనైన యాగినదా ఆ నిర్భాగ్యజీవిపై సాము.

"జీవము తోడ బాసి యశుచిత్వము నందిన మేన గంధతో
యావభృధా భిషేకము సహస్ర ఘటంబుల నాచరించినం
బావన మౌనె యట్ల పతిబాసి వితంతుత నందినట్టి రా
జీవదళాయతాక్షి యశుచిత్వము పాయదు వేయి భంగులన్"

అని ఆమెను ప్రాణమెడలిన కళేబరముతో బోల్చినారు. "మరి యానైచ్య స్థితి నుండి యామెకు విముక్తి?" అని యే దయార్ద్రహృదయులైన ప్రశ్నించి తిరా, ఒకటే జవాబు. అది సహగమనము. ఆ సహగమించుట యెట్లట! నిండు చంద్రుని చంద్రికవోలె, తొలుకరి మొగులును విద్యుల్లేఖయునుబోలె. "నిప్పులలో బడి మ్రగ్గుట బాధాకరము గాదటయ్యా" అని యే వెఱ్ఱిమనిషైని ప్రశ్నించెనా, ఓసి పిచ్చికోమలీ,

"పిరికికండ యొకింత లేకఱయ వేడ్క-
చిచ్చుఱక బోవు వికచ రాజీవనేత్ర
కశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగు."

అని చెప్పి, అప్పటికిని నమ్మదేమో యని "పద పదమ్మున కిదె వేదభాషి తమ్ము" అని ధ్రువపరచును. అప్పటికి ఆమె వెనుదీయునా

"ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాక భువనంబునం దాత్మనాథు గూడి
వెఱపొ కింతయు లేక చిచ్చుఱికెనేని

అని యాళపెట్టును, అట్టివ కాబోలు నప్పటి విధవల దురవస్థలు.

ఇక స్త్రీల పోట్లాటల చిత్రింపు. ఆనాటి స్త్రీలు పోట్లాటలకు దిగిరా ఇక చెప్పవలయును. నేటిమన వారికంటె వారిదే పైచేయి. 'ఓసి పోవే యన్న ఓసి పోవే" యనుచు బుగ్గలుపొడుచుకొనుచు, మెటికలు విఱుచుకొనుచు, రంగమునకు దిగుదురు ఈ సత్యమును మనోజ్ఞముగ చిత్రించిన అనుభవశాలి పింగళి సూరన. నలకూబరు నెక్కడ ఎగురవైచికొని పోవునో యని కలభాషిణి గుండె కొట్టుకొనుచునే యున్నది. సొత్తు తనది కాకపోయినను ఎటుబోయి ఎటు వచ్చునోయని "ఎక్కడి దిక్కుమాలిన పిశాచివో" యని తానే మొదలు పెట్టినది. దానిమీద అసలు రంభ ఎత్తుకొన్నది, "అంత మదింపకువే" యని. కలభాషిణి కేమనవలయునో తోచదు. తప్పు తనదిగదా! కల్మషహృదయులెట్లు సవాలు పలుకగలరు? ఊరకున్న తన గుట్టు బయటపడునేమో: ఏ దిక్కును తోచక రంభయన్న మాటలనే ఏకరువు పెట్టసాగినది.

"అంత మదింపకువే యని పలికిన
అంత మదింపకువే యనుచున్
రంతుల నేమి ఫలంబని పల్కిన
రంతుల నేమి ఫలం బనుచున్
పంతము చూడగదే యని పల్కిన
పంతము చూడగదే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన
గంతు లడంచెద లెమ్మనుచున్."

అంత మనోజ్ఞముగ బోట్లాడుకొందురు వారు.

ఇక స్త్రీలు తమ భర్తల నాదరించు వైఖరి ప్రశంసాపాత్రము. వారు తమ పతులయందు నిత్యము ననురక్తలు. "దూరము వోయి యెండవడి దూపిలి వచ్చిన ప్రాణనాధునిన్ ద్వార కవాట దేహళుల దాక నెదుర్కొని తీర్థ" మార్తురు. ఆహారమును బెట్టుదురు. విహారశయ్య నూరువు లొత్తి చిత్తమున కుబ్బొనరింతురు. ఇంకను తమ పతులు నిత్యము శోభనపురస్సరులు గావలయునని వాంఛించి-

"పసుపుం గుంకుమ కజ్జలంబు నును గూ
ర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబరీభరంబు చెవియా
కుల్ మంగళాలంకృతుల్
విను వాక్కాంతయు-

లేక "దాల్తురు. మఱియు భర్తల కాయు రభివృద్ధి కరంబు భూషల నేమరక దాల్చుట" యని వారి విశ్వాసము. ఈ నమ్మకమును విడువకయే యేమెఱుగని గోల సూరనార్యుని సుగాత్రి పాప మన్నిపాట్లు పడినది.

ఇట్లే పతులు గూడ సతులం దత్యంతప్రియము గలిగినవారు. సత్యభామా విధేయుడు శ్రీకృష్ణుడు, రంభామనోహరుడు నలకూబరుడు నిందులకు సాక్షి. అంత యెందులకు? ఆముక్తమాల్యద యందలివిష్ణుచిత్తుడు మన్మథ వికారమెఱుంగని వైష్ణవుడు. అయినను తన భార్య కష్టపడునే యని ఆమె కన్నులకు పొగ తగుల కుండ నుండుటకై వానకాలమునకు నారికేళవు తొక్కలు సేకరించి యెండబెట్టినాడు.

ఆనాటి ప్రజలందరును ఉద్రిక్తస్వభావులు. చాల వఱకు రసికులు. అల్పత్వమున కసలు వారి భావమున చోటులేదు. అట్లనినంత మాత్రమున మానవ సహజములైన యీర్ష్యాదికములకు వారు లొంగకపోలేదు. - శ్రీనాథుని కాశీఖండ మున వింధ్యుని నోట నీ మాట లనిపించును కవి.

"తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపడేని
జ్ఞాతిజయ మంద దేని తజ్జనుడు జనుడె"

అనిన, పట్టు సాధించు కార్యదీక్ష, అన్నమాట నెఱవేర్చుకొను పంతము నుండెడివి. ఇక పగబట్టిరా, "జిహ్వకున్ వంటక మిందదు, ఇతరవైభవములు పదివేలును మానసము నంటవు" - తనకంటె గొప్పవాడుండెనా "నాకంటెతాను ఘనుడె" అని యాక్రోశించును వారి మనస్సు.

ఇక వివాహాది కార్యకలాపములు. అవి యీనాడెట్లో ఆనాడును అట్లే. మధు పర్కముల నిచ్చుట, కన్యాదానము, వరుని యూరేగింపు, తెఱ యొత్తిగింతలు,

తలంబ్రాలు పోయుట, మంగళసూత్రధారణము, చెఱగులు ముడివెట్టుట, ధ్రువవీక్షణ ఇవన్నియు పాత పాటలే. పెద్దనార్యుని స్వరోచి వీని నన్నిటిని బాటించినవాడే. ఈ తతంగమంతయు ముగిసిన వెనుక చదివింపుల గోలయు లేక పోలేదు.

ఆనాటి ప్రజలందఱును రసికులు. తదనుగుణము వేషాదికముల సమకూర్చుకొనెడివారు. వారి వస్త్రములు సామాన్యముగ చెంగావిరంగు గలవి. పసిడియంచుల మిసిమితో చెఱలాటలాడు కావిరంగు బట్టను ప్రవరుడు ధరించినాడు. అతని నలయించిన వరూధిని శశికాంత మణిపీఠిక కంగదట్టపు కావిరంగుచే నారుణ్యమాపాదించినది. తెలుపా నాడు కోపసూచకమో ఏమో! మూతిబిగించుకొన్న సత్యను చూచి 'తెలుపేటికి గట్టితి' వని శంకించినాడు గోపాలచక్రవర్తి.

సర్వసామాన్యముగ స్త్రీల కాభరణాదులం దాస్థ మెండు. నిగమశర్మ అక్కగారంతటి అనుభవశాలి - మూర్తిత్వము దాల్చిన గాంభీర్యము- తమ్ముడు తన ముక్కుఱ దొంగిలగా "క్రొత్తగా జేయించుకొన్న ముక్కుఱయే" యని యడలినదట! ఆ అడలుటయు నెట్లు? దుర్వారముగ. అట్లే కాటికి కాళ్లు చాచిన మూడు కాళ్ల ముదుసలి నిగమశర్మతల్లి, తన అత్తగారిచ్చిన 'హరిసుదర్శనపు పేరు పోయెనయ్యో' అని వనట బొందినది. ఈ విషయమున పురుషులును తక్కువవారు గారు. వారికిని నగలయందు మోజు గలదు. తమ తమ జాతిసొమ్ములను ఇచ్ఛావిలసనముగ ధరించు రసికులు వారు.

కేశసంపద ఆడువారికి వలె మగవారికిని ప్రీతిపాత్రమే. మనుచరిత్రకారుని ప్రవరునకు తెగబారెడు వెంట్రుకలు. విజయవిలాసకర్త, అర్జునుని కేశసంపదచే నాక్రమితమైన గంగానది యమునతో గూడిన దానివలె శోభిల్లినదని వర్ణించెను. నిడుద వెన్నెఱిగుంపు జడగట్టగా తపము గైకొన్నాడు సగరు ముమ్మనుమడు. ఇట్టి కేశపాశాభివృద్ధికి కారణ మభ్యంజనము.

ఆనాటి ప్రజల స్నానము లభ్యంజన స్నానములే. దాని సుగుణముల వర్ణించుట కాయుర్వేదమునకు వాక్కు చాలదు.

సుగంధ ద్రవ్యముల ఉపయోగము లా ప్రజల కెక్కుడు. వాని ననేకములను కలిపి కలపములు తయారు చేయుటయం దానాటి ఆంధ్రుడు సిద్ధహస్తుడు.

శ్రీనాథుని కృతిభర్త అవచితిప్పయ రెడ్డిరాజు కుమారగిరికై విదేశముల నుండి పరిమళద్రవ్యముల గొని వచ్చెడి వాడట.

వారికి గల పుష్పప్రీతియు నెక్కుడే. ప్రతి గృహము వెనుక నొక్కొక యారామము. దానిలో కలకల నవ్వు విరులు. ఈ పుష్పముల నమ్మెడివారు పుష్పలావికలు. శృంగార రసాధిదేవత లన నొప్పును వారిని. ఇంకొక వింత- అకాలపు చెంగలువలకు సువాసన యుండెడిదో, లేక ఇదియు కవిసమయమో గాని, వానిని సుగంధయుతము గావించి రామణీయకము గల్పింతురు.

ఇక భోజనాదికములు: అమృతము ద్రాగి ఆకలి బెడంద తప్పించుకొన్న దేవతలుగూడ 'జిహ్వాత్రుప్పల నడంచుకొనుట' కీ యామెతలను వాంఛింతురట. ఎవరి జాతియన్నము వారికి రుచి. ఆనాటి ఆ ప్రజలు కాల నియమానుసారముగ గాని, మొగమోటమికై గాని తినినట్లులేదు. ఆకలి వేసినప్పు డారగించు మన స్తత్వము వారిది. భోగపరులైన పురుషులు "మామిడికాయలు వండిన నూనెలో గమ్మను నటుల దిరుగబోసిన చేపలతో" భోజనము చేసి త్రేపులు విడువగ, నవి కసటుగ నుండును గాన నా కసరు గట్టువడుటకుగా, శృంగారవనముల యందలి యిసుకలో స్థాపించి యుండుటవలన శీతలములగు టెంకాయ నీళ్లను సంధ్యాకాలము లందు త్రాగుదురు. తాము తిను ఆహార పదార్థముల వలన జ్ఞానాభివృద్ధి కలుగునో, లేదో వారికి తెలియును. యామునాచార్యులు రాజయిన తరువాత వైష్ణవధర్మ సర్వస్వ మును విస్మరించుట జేసి అతని శిష్యుడు తన గురువును ముండ్లముస్తె కూర దినుమనినాడు. దానివలన జ్ఞానము కలుగు నని అతని భావన కాబోలు.

ఇక మిగిలినది తాంబూలము. సుగంధ ద్రవ్యములతో గూడిన తాంబూల మజీర్తిహ రమట. ఇట్టి తాంబూల మానాటి ప్రజలకు మిక్కిలి ప్రియము. అల్లసాని పెద్దన ప్రియదూతికాంగన తెచ్చియిచ్చు కపురపు విడె మున్న గాని కవనమే రాదనినాడు. మనుచరిత్రమున, హిమనగముపై మంచి మలయమారుతము పర్వు వేళ, సుగంధముల విసరు చందనవృక్షము లూగు చున్నను, ఆ గంధముల నన్నిటిని తలదన్ని వరూధిని నోటి తాంబూల పరిమళము ప్రవరాఖ్యుని పిల్చినదట.

అప్పటి శయ్య లన్నియు హంసతూలికాల్పములు, లేక చివురాకు సెజ్జలు. ఇది ప్రాబంధికనుగు వర్ణనయే గాని, మానవజీవితమున గాన్పించు విషయము కాదేమో! ఈ చివురాకు సెజ్జలు విరహిణులైన నాయికలు హాయిగా మూర్ఛ పోవుటకు మాత్రమే పనికి వచ్చును.

ఇట్టి దానాటి ప్రజల చరిత్ర:- ఇవి వారి దైనందిన జీవిత పరిభ్రమణమున మన మనో నేత్రములకు గోచరించు మెఱుగులు. దీనినిబట్టి వారు మనకంటె విశిష్టులా? అల్పులా? హెచ్చా? లొచ్చా? అని నిర్ణయించు బాధ్యత మనది. అట్టి మహా కార్యనిర్వహణ కుపయోగించు సాహిత్యము మాత్రము లోకారాధ్యము.

డిసెంబర్ 1949 భారతి.

# కల్పవృక్షము - కైకేయి

సప్తసంతానములందు ప్రశస్తిగాంచినది కృతి. అట్టి కృతిశత నిర్మాత శ్రీ విశ్వనాథ. ఆయన పరమ భక్తాగ్రగణ్యుడు. స్వప్న సుషుప్తులందు కూడ నాయన మానస జిహ్వలు రామనామ గ్రహణము చేయును. రామ కథా ప్రగ్రహము బిగించి లాగు ధాటికి సంశ్లథమై ధురావశమై చను నాయన మనో శ్వమునకు రామకథ సర్వమును తెలిసిన ఉగ్రుడు చోదకుడు. పగ్గముల పట్టు సడల్చి దిద్దు ఆ దేవుని అనుమతిని బడియే కవి రఘు దేవుని సాధు కథా ప్రపంచమును నిర్మించెను.

ఈనాడు మరల నీ రామాయణ మేల యని యెవ్వరైన నందురు. అట్టి సంశయాళువులకు కవి సమాధాన మిచ్చెను. ఈ ప్రపంచ మెల్లవేళల తినుచున్న అన్నమే తినుచున్నది. చేసిన సంసారమే చేయుచున్నది. ఒక్కరి రచి మరొక్కరికి రాదు. ఒక్కరి బ్రదుకు లింకొక్కరు బ్రదుకరు. అట్లే యీయన తలచిన రామునే తలచి రచనలో మలచును. ఈ తలపులు మరొక్కరు తలచ లేరు. ఈరచన యింకొకరికి రాదు.

ఇంతకు నీకవి వాల్మీకి రామాయణము నాంధ్రీకరింతు ననలేదు. రామ కథ చెప్పెద ననెను. ఆ చెప్పుట తన రుచికి వచ్చునట్లు చెప్పుట. ఆ కథా విషయమున తన మనః ప్రాణములు సర్వమును ఓహోయనునట్లు చెప్పుట. వాల్మీకిరాముడు మహేతిహాస నాయకుడు వేదాంతర్గత విధి నిషేధములను మిత్ర సమ్మితములు చేసి తన చరిత్ర నుదాహరణగా చూపి ప్రబోధించు ధర్మవీరుడు. వాల్మీకి తన రాముని ధర్మ పరిరక్షకునిగా చెప్పెను. ఏకపత్నీ మహావ్రతునిగా చెప్పెను. పితృవాక్య పరిపాలనా దక్షునిగా చెప్పెను. సాధుజన పరిత్రాణుని వలె, శత్రుజన నిస్త్రాణ కారకుని వలె చెప్పెను. అతడు బ్రహ్మాది జనసంఘమువలన, మహర్షి వ్రాతము వలన ప్రార్థితుడై పుడమి నవతరించిన దశరథాపత్యము. ఈ స్ఫురణ వాల్మీకి రాముని యందాద్యంత

మున్నది. అందువలన, ఆ పాత్ర యందలి సద్గుణ పుంజములను విని సభక్తికముగ నమస్కరించి గౌరవింప గలము కాని, మన మధ్య శరీర ప్రాణములతో మనగల వ్యక్తిగా తలచి యానందించి మన్నింపలేము.

రంగనాథుడేమి, భాస్కరుడేమి, ఈ కాలపు వారు ఆంధ్ర వాల్మీకి, కావ్య తీర్థులేమి, అందరును రామాయణ మహేతిహాసమును తెలుగులోనికి దించిరి. వారెవ్వరును కథా కథనమున కిచ్చిన ప్రాముఖ్యము తత్కథాగత పాత్ర చిత్రణ మున కీయలేదు. అసలు వారిదృష్టియందన్ని పాత్రలును పాత్రలే కావు. ఒక్క రాముడే ఆద్యంతమును కవి గమనింప దగిన పాత్ర. ఈ రామునిచుట్టును కథ శరవేగమున తిరుగును తద్వేగాతిశయమున బడి సుడిగాలికి దిరుగు శుష్క పత్రములవలె మిగిలిన పాత్రలు తేలిపోవును. ఈలోపము ఆయాకవుల ప్రతిభా లోపము వలన కలిగినది కాదు. వారు రామాయణమును ధర్మప్రధాన కావ్యముగా జెప్పిరి. కాని సరస ప్రబంధముగా జెప్పలేదు. అట్లు విశ్వనాథ చెప్పెను, ఇదియే యీాయన రామకథ చెప్పుటలో వేరైన గుణము. ఇదియే యీాయనపాత్ర చిత్రణ మందు చూపిన సునిశిత శ్రద్ధాళుత్వము.

ప్రతికావ్యమునందలి పాత్రలను రెండు విధములుగా విభజింప వచ్చును. అవి ప్రధానపాత్రలు. అప్రధానపాత్రలు. ప్రధానపాత్రలు కథ కుపకారములై కథను నడుపునవి అప్రధానపాత్రలు ప్రసంగవశమున వచ్చి, కథకు పుష్టిని చేకూర్చునని. కవికి రెండువిధముల పాత్రలయందును సమదృష్టి యుండవలెను. అప్పుడే కథా సౌందర్య మినుమడించును. విశ్వనాథ యట్లు చేసెను. ఈయన రామాయణ కథా నాయకు నెంత యవధానముతో చిత్రించెనో రామ వనవాసగమన ప్రథను కారణ మంథర నట్లు చిత్రించెను. సీతావియోగ దుఃఖాపాదిని శూర్పణఖ నట్లు చిత్రించెను కౌసల్య, సుమిత్ర, అహల్య, కైకేయి, సీత, అరుంధతి, ఒకరేమి ప్రతిప్రధానా ప్రధానపాత్రయు నాయన ప్రతిభాదత్త మహా మూర్తిగా విలసిల్లినవి. ఈ పాత్ర లన్నియు విశ్వనాథవే. ఇందు మరొక్క కవికి స్వత్వబుద్ధి కలుగుటకు వీలులేదు తను సృజించిన పాత్రలు తనవే యనుబుద్ధి పఠితలకు గూడ కల్పింపగలుగు కవికి కథా నవ్యత్వ మక్కరలేదు. పాత కథను మలచి సరికొత్త రూపులు దిద్ది రసగ్రహణ పారీణులగు విజ్ఞుల యాదృతిని పొందగలడు. విశ్వనాథ యట్లు

చేసెను. ఈయన కల్పవృక్షము క్రొత్త తొడవులు తొడుగుకొను పురాణభూజము. దానికి నిత్యమును నవ్యత్వమే.

కల్పవృక్షమునందు కైకేయి యపూర్వసృష్టి. దీనికిని వాల్మీకి కైకేయికిని పోలికలులేవు. వాల్మీకి కైకయి రామానురక్తులకు కన్నెఱ్ఱ. సకల గుణాభిరాముని రాముని రాజ్య నిష్కాసితుని చేసిన కుటిల. వానిని పదునాలుగేండ్లడవిలో పలు సిలుగుల పాలు చేసి ప్రియా విరహ దోదూయమాన మానసుని చేసిన పాపిని. నిజపుత్రుని రాజ్యప్రాప్తికై భర్తృ వియోగమునైన సమ్మతించిన దిట్టరి ఇది వాల్మీకి కైకయీ స్వరూపము. వాల్మీకికి కైకయి యందు సానుభూతి లేదు. రామదేవుని సద్గుణరాశిని ప్రకాశింపజేసిన మూలరూపమను కృతజ్ఞత లేదు. ఇక్ష్వాకువును, సత్యవ్రత దీక్షాతత్పర మతియు నగు దశరథేశ్వరుని ప్రేమాస్పద యన్న స్పృహలేదు. వాల్మీకమందు కైకయి రామాభిషేక కాలమున ప్రవేశించును రాముని అడవికి పంపి నిష్క్రమించును. ఆ పని సాగుటకై యాపాత్రి జనించి తదుపరి నశించినట్లు మనకు తెల్లమగును. కాని వాల్మీకియు, కైకయికి రామునియందు భరతునకంటె ప్రీతి కలదనియే చెప్పెను. ఆ ప్రీతి సపత్నీ మాత్సర్యము ముందు నిలువలేదు. ఇందుకు మంథర ప్రోద్బల మిచ్చినది. కౌసల్య పట్టమహిషి మును పే యయి, రామ పట్టాభిషేకానంతరము రాజమాత యగును. ఆమెకు తా నూడిగము చేయ వలయును. ఈ విషయమే మంథర నొక్కి చెప్పినది. వాల్మీకి కైకేయి యా మాటలకు లొంగిపోయినది. లొంగకుండ నిలుచు స్థైర్యము కైకయికి లేదు. అంత గాంభీర్యమును లేదు కేవలము, మనశ్చాంచల్యమునకు లోనై సపత్నీ మాత్సర్యము కారణముగా, స్వపుత్రాభ్యుదయ పరంపరయే లక్ష్యముగా తామస గుణము ప్రకోపించిన దుష్టస్త్రీ వలె రాము నరణ్యమునకు తోలినది.

విశ్వనాథ కైకయి క్రొత్త కైకయి. ఏ కవికైనను నూత్నత్వమును సృజించుటకు హక్కున్నది. విశ్వనాథ ఆ హక్కు నుపయోగించు కొనెను. "అద్యసత్కథలు వావిరిపుట్టు రత్నములు. కల్పనాకథలు కృత్రిమ రత్నములు. ఈనాటి ఈ సత్యకవి ఆద్య సత్కథ నొక దానిని గొని స్వకపోల కల్పనా దుష్టము చేసెను. ఆదికవి ప్రాచేతస కృత పాత్రకు వింతరూపు కల్పించి రంగులు మార్చెను" అని ఒక్క రనవచ్చును. వాల్మీకి కైకయి నేల మార్చెను? ఆద్య

సత్కథలందు స్వకల్పనలేల చేసెను? వినూత్న కథాకల్పనా తత్పరుడు కారాదా?" యని మరొక్క రనవచ్చును. ఎవ్వరేమన్నను విశ్వనాథ వాల్మీకి కైకయిని పాడుచేయలేదు. బాగు చేసెను. శిల చిత్రణమే లేక వెలాతెల బోవు కైకయీ సామాన్య స్వరూపమును దశరథేశ్వరుని ప్రియ భార్యారత్నముగా తీర్చి దిద్దెను. ఆమె రామకృత సర్వరాక్షస సంహనన ప్రథమ కారణము. రాముడన్న మనః ప్రాణములచే వాత్సల్యము కురిపించు మాతృమూర్తి. అట్టి పుత్రుని వాంఛా పరిపూర్తికై లేని తుట్రలు నెత్తిన వైచుకొని వానిని చివరిదాక రక్షించిన స్వార్థత్యాగిని. ఈ కైకయి మనచే నోహో యని తలయూపించును. మన మనస్సులందున్న భక్తిగౌరవమైన విస్మయము నాచు కొనును.

ఎందరేని అంగనలు కల దశరథునకు ముప్పురే ప్రియాంగనలు. వారు మువ్వురుమ గుణగణాఢ్యులు. అందు మూడవది కైకయి మధుసామగానమూర్తి. అరువది వేలయేండ్ల వయసు మీరిన రాజుకంటికి కడాని రేకుల తళతళ కాటుక. ఈమె జన్మతో కేవల సాత్త్విక మూర్తియగు కేకయ రాజదుహిత. తండ్రి రక్తమామె నాడులలో ప్రవహించుచునే యుండును. ఆమె మనస్సునందు భావమున కందనిచోట మూలసత్త్వం గంధావలితములై, పరిణతములై, భద్రములయిన యూహలు జనించుచునే యుండును. కాని తల్లి నెరుగని కైకయి సరియగు పెంపకము లేని రాచసంతానము. ఆమె కెంత నెగ్గడితనమో, గరువమో, అంత పట్టుదల. ఆ గుణములే దశరథుని కౌసల్యాభిముఖుని గానీక తనవైపు ద్రిప్పినవి వనవాస గమనమునకు భంగము వాటిల్లనీయక రాముని రక్షించినవి.

కైకయీ పాత్ర నత్యుజ్జ్వలముగా తీర్చుటలో కవి పోషకముగా గైకొనిన మరొకపాత్ర మంథర. అది కైకయిని చిన్ననాటినుండి చేతులనెత్తి పెంచి అరణముగా కోసలేశ్వరుని యింటికి వచ్చిన ముది జంత. వాల్మీకమందు కైకేయికే ప్రాధాన్యము లేదు. అమె దాసి మంథరకు నుండదు. భారతమున నొక్కచోట మాత్రము మంథర కారణజన్మగా చెప్పబడెను. అది దుందుభి యను గంధర్వకాంత. దేవ కార్యమగు రావణ నిధనమును జరిపించుటకై మనుష్య

జన్మమెత్తి కైకయీ దాసియై రామ వనవాస గమనమును ప్రోత్సహించినదని యచటి కథ. విశ్వనాథ మంథరకీ కారణ జన్మము లేదు. దాని కాయన చేసిన రూపకల్పనమును, ఇచ్చిన స్థానమును వేరు. రాముని అరణ్యమున కంపుటలో దానికున్న కారణమొక్కటే. అది, రాముడు కౌసల్యాసుతుడని; పట్టమహిషీ గర్భమైన వాడు రాజ్యపదవి నందునని; తాను పెంచిన భరతున కన్యాయము జరుగునని; రామమూర్తి యన్నదానికి గల ద్వేషమును, రాముని బాల్యము నుండి, రాజ్య నిష్కాసితుడగు వరకు కవి అచ్చటచ్చట చెప్పుచునే యుండును. దీనికి తోడు మంథరకు కైకపై నొక విధమగు నధికార మున్నది. అది తల్లికి కూతురుపై గల యధికారము వంటిది కన్న తల్లిని చూడని మమకారమెల్ల కైక దీనిపై నొలుక పోయును. ఇది పుట్టినింటి దాసి. రాజు బహుభార్యాప్రియుడు. అందును పట్టమహిషియన్న కైకకు సపత్నీ మాత్సర్యము. ఏ కాలము పతి తన కడకు రాకపోయిన కైకకు మంథరతోడనే ప్రొద్దు పోవును. ఈ చనువే మంథర కామెపై నధికారము సంపాదించి పెట్టినది. అడగడుగున కా యధికారము ప్రదర్శించి, దానిని స్థిరము చేసికొనుట మంథర కొకమోజు. అయినను కైకయు దాని కెప్పుడును విధేయ కాదు. ఎప్పుడో ఒక్కొక్కసారి ఆమె దాని కెదురు తిరుగును. అప్పుడప్పుడు పేక్షించి యూరకుండును. ఒక్కొక్కసారి దానిమాటల కభిముఖ మగును. ఇది ఆమె మనస్సహజ దౌర్బల్యము. తన్ను చేతులనెత్తి పెంచినదే యను కృతజ్ఞతా పరిణామము. ఈ విషయమును విశ్వనాథ స్పష్టము చేయును.

ముప్వురు రాణులును రఘువంశ రత్నదీపములను నాల్గింటిని వెలిగించిరి. కైకయి భరతుని నోమినట్లును, వాని యాటపాటలతో మురిసినట్లును వాల్మీకి చెప్పలేదు. విశ్వనాథయు చెప్పలేదు. కాని వాల్మీకి చెప్పని క్రొత్తది మరొక్కటి విశ్వనాథ చెప్పెను. కైక కెంతసేపటికి తన సవతికొడుకు రామచంద్రుని తోడనే సరిపోవును. కౌసల్యయన్న నామెకున్న మత్సరత ఆమె సంతానముపై లేదు. రామ జననానంతర మా కౌసల్యపై గూడ నామెకు మత్సరత లేనట్లుగా కవి సూచించును. పైపెచ్చు కైకకామె యన్న రామచంద్ర గర్భామృత వీచిగా నొక పూజ్యభావము. అట్టి రామునికొరకు నిద్రమేల్కొన్నదిగ కేకయాత్మజాత

చూచును. వాడును కాళ్లు వచ్చిన దాది పినతల్లి కొరకే పరుగులెత్తును. రాము డామెపై కురుకగా, కైకేయి వానిని కౌగిట క్రుచ్చుకొనును. ఆస్యమున ముద్దులిడును. కడుపుపై మూర్ధముంచి కిలకిలార నవ్వించు కొనును. రాముడు కైక వద్దనున్న ఎవ్వరు పిలిచినను పోడు. అట్టి రామ ప్రవృత్తాంతరంగ కైకయికి భరతునిపై దృష్టిలేదు. భరతునకు తల్లిదగ్గర మచ్చికలేదు. శత్రుఘ్న సహితు డైనవాడు మంథరచేతి యందు బడెను. ఆ వృద్ధదాసి తీర్చు తీర్పులును, పెర పరిచారికల సేవలును వానిని పెంచెను.

శ్రీ రామచంద్రుడును పెరిగెను. లక్ష్మణ ద్వితీయుడై లోకాద్భుత శౌర్య ప్రదర్శనమును పంద్రెండేండ్లయిన నిండని పసినాట చేసెను. తన శౌర్యమును రాముడు తల్లికి తెలియనీయడు. కాని పినతల్లికి కాన్పించుకొనును. ఆ సమయము లందు కైక సంతోష కుల్యా తరంగక డోలాగమన. ఆమె నేత్రములానంద బాష్ప కదంబ కలితోద్యానములు. ఆమె రాముని మెచ్చి, బహుమురిపెముగా చూచిచూచి చూచుచునే బాబుకు దిష్టితగులునేమో యని బెగ్గడిల్లును. నేలమన్నద్ది యా చేతితో వీపు చమురును.

కాని కైకయీ హృదయగతమైన యింత ప్రేమయు ఆటంకములు లేని సరళ ప్రవాహిక కాదు. మంథర ఆ ప్రవాహమున కడ్డు తగిలి చెదరగొట్టు బండరాయి. అది చూచుచుండెనేని రామమూర్తిపై పినతల్లి ఆ ప్రేమను కురిపింపదు. ఊరక కన్నులతో పలుకరించును.

రఘుకుమారుల ఉపనయన సంస్కారమైనది. తనకు మ్రొక్కిన కుమారులకు కౌసల్య హేమభూషణ వితానములును, ఆశీస్సులును ఇచ్చెను. వేదాంతిని సుమిత్ర కేవలాశీస్సులను మాత్రము ఇచ్చెను. కైక మిగిలిన వారి కేమి యిచ్చెనో గాని రామునకు మాత్రము మణులు కుట్టిన పట్టుదట్టి యిచ్చెను. పిడిని మరకతమ్ము దొడిగిన చురకత్తి యిచ్చెను. వజ్రపుంఖితమైన వాలుటమ్ము నిచ్చెను. వానిని చూచుకుని రాముడు మొగమున నింతయై మురిసిపోగా కైక కన్నులం దిగము మరింతయై యేరులు వారెను. ఆమె అంతరాంతర స్థగితమైన

రఘూద్వహుని సచ్ఛిశు మూర్తికి జగములు పట్టరాని ఒకసాహన దీక్ష తనుత్వ మొప్పెను. ఆ సమయమున కైక ధీరామోద ప్రవిచలాంతరామోఘు. ప్రేమో ల్బణ మోదపీచీ ధారాగ్రామిత దృగ్రేఖ.

ఈ కైకేయి సామాన్య రాజకాంత కాదు. వింట చిక్కని మర్మము లెరిగిన ధనుర్విద్యావిధానము. సారథికికూడ చేతగాని కౌశలము చూపి రథమును మెలపున కొనిపోవు నేర్పరి. పుత్రవాంఛా పరిపూర్తి కా విక్రమస్ఫురణమును, ఆ మెలపును మూల సాధనములైనవి. అట్టి ప్రజ్ఞానిధి రఘుబాలుని ధనుర్విద్యాభ్యసన వేళ నిత్యమును వచ్చి చూచెడిది. "ఓయి తండ్రీ ఈ బాణమిట్లు, ఆబాణ మట్లు" అని చిత్రదూరములైన లక్ష్యముల నెట్లు విదారింపవలయునో చెప్పి చేయించెడిది. తన విల్లే గతి పట్టవలయునో అమ్మెట్లు సంధింపవలయునో రామచంద్రునకు కైకయీ శాసనమే శాసనము. తన మాటవిని లక్ష్యభేదము చేసి తనను చూచి చిన్నారి సిగ్గు దొంతర నవ్వుల వెదజల్లు రాముడు కైకయీ ప్రాణము వానికిది వేళ ఇది హాళ యనిలేదు. ఎప్పుడు చూచినను వాడు కార్ముక సహితుడై కైకయీ సౌధమున నుండును. ఆ సౌధములును, తత్సమీప వృక్ష నివహములును వాని లక్ష్యములు. మరుగుజ్జు మంథరకు వాని పొడగిట్టదు. అది వాని ధనుర్విక్రమ కళావైభవమును అటు పోయివచ్చి చూచును. ఇటు పోయివచ్చి చూచును. చూచి చూచి భయభ్రాంతయై సివాలాడును. రాముడు మంథరయెడ పరిహాసశీలి. వాడు దానిని తాకునట్లుగా బాణములను వేయును. అది భయభ్రాంతయై హాహాకరించిన కొలది వాడు గగ్గోలుగా హాస్యోద్ధృత మూర్తి యగును. అట్లు సర్వరాక్షసకులాటవీ దావానల కల్పుడు రాముడు కైకకడ అస్త్రవిద్యకు నాంది పాడెను. ఆమె రామదేవుని ప్రథమ అస్త్రవిద్యాగురువు.

రామునియందు వలె సీతయందును బద్ధానురాగ కైకయి. తద్దివ్యలావణ్య లహరిలో మున్కలువైచు సౌందర్యపిపాసిని. రామునికంటె సీత అందగత్తె. సీతకన్న రాముడందగాడు. ఒకరిని చూచినపుడు మరొక్కరిపై కైకయి కాభావము కలిగెడిది. తన హృదయస్పందియగు నా దంపతుల శోభను చెప్పవలెనని యామె సీతకడకేగి. నా తండ్రి రాముడందగాడు. నీవు కావనును. రాముని వద్దచేరి సీతయే అందగత్తె నీవు కావనును.

అట్టి కైకయి, తానై రాముని వనములకు తోలుటకు మంథరాబోధ మొక్కటి చాలదు. మంథరపై మమకార మెంతయున్నను దానికి లోబడి తన ప్రాణములకు ప్రాణమైన బిడ్డ నడవికి పంపిన కైకకు వ్యక్తిత్వముండదు. ఇంతగా చిత్రించి కైకను మంథర చేతియందలి మైనపు బొమ్మగా నిముడ్చుట కవి యుద్దేశ్యము కాదు. కైకను కారణ జన్మగా తీర్చవలెనన్న కవి తహతహ కల్పవృక్షమున ప్రస్ఫుటము. పురాణగాథల యందీ కారణ జన్మత్వము మంథర కున్నది కాని కైకయికి లేదు. ఈ పరిస్థితులలో కవి స్వకపోల కల్పనల నాశ్రయింపక తప్పలేదు. ఇట్లు చేయుట కీ విశ్వనాథయే మొదటివాడు కాడు. నాటక కర్త భాసుడును తన ప్రతిమయందు, కైకయీ పాత్ర చిత్రణావసరమున నింత జిజ్ఞాసపడి, ఇంత సానుభూతితో ఆ పాత్రను కొంత మార్చెను. ఆమార్పు, కైకయి యన్నస్వార్థము, మాత్సర్యము కలిసిన సామాన్య వనితా స్వరూపమను భావము మనలో కలుగనీయదేగాని, ఆకైకయిని. మహోత్కృష్ట నిస్స్వార్థ, వీరకాంతను చేసి మనముందు పెట్టి వెలుగులను చిమ్మింపదు. అందుకు కారణమా పాత్ర చిత్రణమునందు భాసుడు చివరవరకు శ్రద్ధ చూపింపకపోవుట. ఈ లోపము విశ్వనాథయందు లేదు. కావుననే ఈ కైకేయి నిర్దుష్టయై, దివ్యప్రభల చిమ్ము రత్నదీపమైనది.

ఇంతకును విశ్వనాథ దేవకార్యనిర్వహణ భారమును కైకయిపైననే పెట్టెను. మంథరను కేవలము స్వార్థ చింతనాపరయగు దుష్టస్త్రీని చేసెను. ఇది సాగించుట కాయన మనోహరములగు రెండు కల్పనలను చేసెను. అందొకటి రామకల్యాణానంతరము, పట్టాభిషేకాత్పూర్వము, శ్రీరామచంద్రుని, ప్రాణమ్ములందుదయించిన వైరాగ్యరేఖ. రెండవది పట్టాభిషేక శుభదిన పూర్వరాత్రమున వాడు పినతల్లితో రాజ్యము చేయనని చెప్పుకొనుట.

ఈకవి వర్ణనలను కేవలము వర్ణనలకుగా చేయడు. వానివలన కథ కుపకారమును పుష్టియు చేకూరవలె నను ప్రాకులాట యీయనది. శ్రీరామ వివాహానంతరము కవి ఋతు వర్ణనము చేసెను. ఒక ఋతువును వర్ణించి మరొక్కదానిని చెప్పులోపల ఒక్క సంవత్సర కాలము తిరిగినట్లు చెప్పెను. అనగా నారు ఋతువులను వర్ణించు లోపల నారు సంవత్సరముల కాలములో

శ్రీరామ చంద్రుని మనోభావ వికారము లన్నియు చెప్పెను. సీతారామ ప్రణయ పాత్రమైన తొలివసంతము హాయిగా గడచెను. అట్లోకయేడు చనగా నరుదెంచిన గ్రీష్మర్తువేళ ప్రకృతియంతయు నొక్క వైరాగ్యకేళి నెరపినది. రాముడు వైరాగ్యభావ తాడితమైన చిత్తముతోడ నిర్వేదక్షోభము లనుభవించెను. ఆయనకు ప్రాణముకంటె ప్రాణమైన ధరాజాతా ముఖాంభోజమే ఏమోగా కనిపించెను. సనుస్త్రావనీ స్వామిత్వాదిక భావన లో యెడదలో నింకిపోయెను. బ్రహ్మచారి సుతుడు విరాగియైన, తండ్రి వానిని గృహస్థుని చేయును. గృహస్థుడగు రాజ సుతుడు విరాగియైన తండ్రి వానిని రాజ్యాభిషిక్తుని చేయును. దశరథుడదియే సంకల్పించెను. రాముడు సుబాహు తాటకా ప్రాణహర్త. రాముడు వశిష్ఠ పద సమారాధకుడు. అట్టి రాముడు నృప భావ యోగ్య స్థానమని పరిషజ్జనులు నిర్ణయిం చిరి. రాముడు తండ్రిపనుపున తల్లులు ముప్వురికిని నమస్కరించి, వారి యాశీస్సు లను గొని, మరునాడు జరుగబోవు నభిషేకోత్సవమున కానాడు నిష్ఠాపరుడై యుపవాసియై, మౌనవ్రతధారి యయ్యెను. కాని వానికి సమాధి నిలువలేదు. వాని యూహలే దేవతలయి వచ్చి వానిని ప్రబోధించినవి. రాముడు దైవతలోక కార్య చరితవ్రతుడు. దేవావలి కంటకాపనయనుడు. పంక్తికంధరుని మాట మరచి రాజకార్య నిమగ్ను డగుటకు వానికి వీలులేదు. ఒక్కొక్కడొక్కొక్క పని తలపె ట్టును. ఆ పని తుదివరకు నాగుటకు మరొక్కరి సహాయము కావలసి యుండును. లేకున్న నెచటి యూహ లచటనే ఆచరణ సాధ్యములు కాక నిలిచిపోవును. రాముడు తాను రాజ్యము చేయకూడ దనుకొనెను. అందుకు తండ్రి ఒప్పుకొనడు. ఏమియును తోచక రాముడు పినతల్లి మేడలవైపు చనెను.

రేపు ప్రొద్దున అభిషేకము పెట్టుకొని యిట్లేల వచ్చితివని కైక వానిని మందలించినది. కుబ్జని సద్వ్రత భంగకారిణినని నన్ను లోకులాడి పోసికొందురు. ఏదో ముంచుకొని పోయినట్లీ రాక యేమని ప్రశ్నించినది.దేవతలు నన్ను రాజ్యము చేయ వద్దనిరి. నాకును రాజ్యకాంక్ష లేదనగా నిప్పు డట్లే యుండును. రేపు జానకి అంకస్థయై సింహాసన సీమ నున్నప్పుడు మరొకవిధముగా నుండునని మారు పలికినది. ఆ మాటలకు రాముని నేత్రములందొక తీవ్రకళ తోచెను. "నీవు మున్ను వ్రేత్తున నేర్పిన కోదండకళా విచిత్ర గమనశ్రీ యేమగును? ఈ ధనువున

నున్న చిక్కని సుతారములన్నియు నేను రాజ్యపాలనకు పూనుకొన్న నెందులకు?" అని తీక్ష్ణముగా పలికి, "అదికాదమ్మా తల్లీ! నేను రాజ్యము చేయుట వేల్పుల కిష్టము లేదని ప్రతిమాలుకొనెను. ఆ ధోరణిని, వానికన్నుల తరతరను చూచి కైక మరొక్క మాటాడక లోనికేగెను. ఇది కల్పవృక్షమున కైకయీ విషయమున విశ్వనాథ చేసిన కల్పన. ఈ కల్పన కైక మంథరకు లొంగుటకు బలము నిచ్చును. మంథరా బోధనలను పటిష్ఠములు చేసి, ఈ అతిసూక్ష్మ విషయమును దానికి పోషకము చేసి కైకను కవి మంథరకు లొంగించును. తెరవెనుకనున్న సూత్రధారుని ప్రముఖత రంగస్థలమందు నటించు పాత్రలతో కాన్పించినట్లు, మంథర మాటలకు క్రమశః మార్పు చెందుచున్న కైక చిత్తవృత్తిలో నీ కల్పన యొక్క పటిష్ఠత, ప్రాబల్యము, కొట్టవచ్చినట్లు కానబడును కేవలము దీని ప్రాముఖ్యము పైననే మనసునుంచి కవి మంథర కన్యాయము చేయలేదు. ఆది చెప్పగలిగినంత చెప్పి, చేయగలిగినంత చేసియే కైక మనస్సు తిప్పినదని పించును. మంథరయే అంతగా కైక చెవులలో నూరిపోయకున్న, చత్తునని బెదిరింపకున్న రాముని మాటలను పసిపలుకులుగా పెడచెవినబెట్టి రామాభిషేకమును సమ్మోదాంతరంగయై చూచియుండెడిది.

అభిషేకవార్త విని మంథర కైకకడకు వచ్చెను. రామాభిషేకవార్త చెప్పి, "రాముడు రాజైన నీకు కూడుండదు. సవతి, పంతాల పాతర తీయు" నని బెదిరించెను. అభిషేకవార్తవిన్న కైక ప్రమోదానన. ఆమెకు గతరాత్రి సంఘటన చెడుకలవలె తోచెను. అభిషేకమున కంగీకారమును చూపిన సమస్త శుభ మూర్తిని రాముని చూచిరావలెనని తత్తరపడెను. ఈ ధోరణి చూచిన మంథర వ్రేటువడ్డ పసరంబు పగిది కుంచుకొనిపోయి తెప్పరిలి "రామునకు మొగంబున నవ్వు. గుండె మూతపెట్టిన త్రాచుపాము కరణి. అట్టి రాముడు రాజైన నీవు పరిచారికాధమ విషాద మహార్ణవ మీదెదవు సుమా యనెను. కైక దానికి అర్ధతిరస్కృత మందహాసయై "రాజే పాము. వాడు భరతుడు కానీ రాముడుకానీ. రాముడు భ్రాజచ్చాపకళా విలాసవిధి. ఆ రాముడు రాజై అంప వాదర సముద్రాంభస్సు లింకించును. రాజై నీ భరతుడును, నా భరతుడును స్వర్గములు రాదీయునా?" యని మందలించినది. మంథర భయకోప వివశయై అయో అయో యని యేడ్చి మొత్తుకొనగా, కైక, ఒక్కింత చలించి, ప్రసన్నయై

"ఇదేమి దుఃఖమే! ఆ పెద్ద శ్రీరాముడు సర్వాసుప్రాంగణ ముగ్ధ దీపిక, వాడెల్ల జీవులకును దీక్షాధర్మ పారంపరీ వ్యాసంగుడు. అతడు రాజైన నీకును నాకును ఎగ్గా? నిజమునకు వాడొక యోగి. దితిజోగ్రవారి మార్తాండుడు. అని ప్రశంసించు మాటలు మంథరకు నచ్చినవి. ఈ యవకాశమును జారవిడచుకొనుట కిష్టము లేక చెప్పిన "అవునమ్మా రాముడు యోగియంటివి. మరి వానికి రాజ్యవాంఛలేల? అతడు మహాదనుజోగ్రాంబుపతంగుడంటివి. దనుజు లయోధ్యా వీధి యందుం డిరా" యన్నది. భరతుడు నీకు రాముని పాటి చేయక పోవచ్చును అయినను వాడు నీ కడుపున బుట్టిన బిడ్డ. వాని కన్యాయము చేయకున్నది నిన్ను చేజేతుల పెంచినందుకు నాకు లభించిన ఫలసర్వస్వమును తొత్తుక్రింద బడితొత్తునై "యెత్తులు ఒత్తుదే" నా యన్నది. అన్ని నిష్ఠురములాడిన మంథరకు కైక ప్రతివాద శూన్య. ఆమె మనస్సునందు రాముని ప్రార్థనా పరిదీన వదనము పరవళ్లు త్రొక్కుచున్నది. అయినను, నవనీతముకంటె మెత్తనై సంధ్యా చంద్ర రేఖా సముద్భవ చాంద్రీ సుకుమారమౌ నెద పరిపాకము కల రాముని యెడ మంథరయేల మాత్సర్యము పాటించునో అవగతము కాలేదు. అన్ని వాదములు నైపోయినవి. కైకేయుని లొంచుటకా ముదివగ్గున కేదారియు మిగులలేదు. కట్టి కడపటి పన్నికముగా నది కైకను తీక్షణముగా చూచి, శోకావేగమున చీరయంచు చించి సన్నని యురిపోసికొన గడగినది. ఆ పని చేయు నొడుపులో కైక కంతయు యాథార్థ్యమే తోచి దాని నాపి, "ఏమే నిజముగా చత్తువా?" యన్నది. ఆవి తన యందలి కృతజ్ఞతచే కైక మనస్సు దుర్బలమగుచున్న ఘడియలని గ్రహించిన మంథర మరింత ఉద్ధృతముగా "అవును నిజమే, నీమీద నొట్టు" అన్నది. కొంతసేపు మనస్సు ఒరిపిడి చెందిన తదుపరి కైకయి దానిని చంపుటకో తాను చచ్చుటకో యన్నంత ఉరవడిగాలేచి, "ఈ ఎల్లధర నా కుమారుడేలును. నీవు పొమ్మన్న నామాట శిరః కల్హార మాలాకృతిగా ధరించి రాముడు వనముల కేగును కాని ధాత్రీశుడు దీని కంగీకారమేల చూపు" ననగా, మంథర, "వీకిష్ట మేని యుపాయమే లేదా" యన్నది. అందుకు కైకమండిపడి, "నాకిష్టమని ఎవ్వరు చెప్పిరి. నీయుపాయమేదో చెప్పు" మని గర్జించిన గర్జనయందు ప్రాతి కూల్యాను కూల్యములు సగము తోచి మంథర దశరథ దత్తవరములను జ్ఞప్తికి తెచ్చినది. ఆవేశపడుచున్న కైకను శాంతింపజేయుటకుగా, నీరాముడు వన్యసీమల

దిరుగుచు దైత్యసంహనన దీక్ష పూనునులే" యన్నది. ఆ మాటలలో, రాముని పరాక్రమమును అవహేళన చేయుచున్నట్లుగాతోచి, కైక ఉగ్రురాలై, "రామమూర్తి కఠిన రాక్షస కీటకాళిని కాలిక్రిందరాచును; ఏమనుకుంటివో" యనగా, మంథర సర్దుకుని, "నేనును ఔననియే, చెప్పుచుంటిని గదమ్మా అంతకోపమెందుకు? కుమారు భరతుడు క్షేమముగనుండిన ఆ రాముడెంతయో ఆదైత్యులెంతలో నాకెందు" కన్నది. ఇచట కైకయి మనఃప్రవృత్తిని కవి మన కన్నుల యెదుట కట్టినట్లు చిత్రించెను. ఒక వ్యక్తి కొకపని చేయుట యిష్టముండదు. అట్లు చేసిన అప్పులు కష్టముల పాలగుదురు. లోకు లాడి పోయుదురు. అయినను ఆపని చేయక తప్పదు. చుట్టుకొన్న పరిస్థితులనెడ ఉచ్చులంతగా బిగిసిపోవును. ఈ ద్వంద్వము మధ్య చిక్కిన ప్రాణియెంతగా ఆవటిల్లి యెట్లుభాధపడునో విశ్వనాథ కైకయి మనకు చెప్పును. ఆవిడ కేది చేయుటకును, మానుటకును, తోచలేదు. ఎదుట నున్న మంథర తన ప్రాణముల గ్రసించు రాక్షసివలె తోచగా, ఉవ్వెత్తున దానిపై విరుచుకొనిపడి, "నీవు చెప్పినది చేసెదను. నీవో నేనో చావకముం దిక్కడ నుండి పొమ్మ"ని తరిమివైచెను.తానాయేకాంతమున మందుతిన్న పులివలె గుడుసుళ్లుపడెను. మనోలోభమో, ధాత్రీవచో దానమో, దైవత్వమగు ప్రేరణయో, తెలియరాని యావేశ మొకటి ఆమెను నిలువనీయలేదు. దశరథుని తాను వరము లిమ్మని యడుగగా నాతడిచ్చుట జరుగవలయును. ఆయనకు ముదిమి పైబడ్డను చేతఃకామము చావలేదు. వాని బ్రతుకెల్ల కైకయను ఆకురా కరకు వాదరరాచిన రాపు. అట్టిరాజు తనమాట వినక మనలేడు. ఈ స్ఫురణతో కైక నిలువెల్ల శోకమూర్తియై కోపగృహమున కేగెను.

రాజు, పుత్త్రిప్రణయాంభోరాశియైన పినతల్లికి అభిషేకవార్త తానై చెప్పదమని వచ్చెను. కాని ఆమె కోపగృహమందున్నది. ఇది మబ్బులేని వాన. రాజు మదమలు త్రొక్కుకొనుచు లోనికేగి కైకేయి ముసుగెదలించెను. కోపమూర్తి యనుకొన్న కైకేయి శోకాధి దేవత. నీకు కోపమే యనుకొంటిని. అంత శోకమువహించితి వంచెరుగననగా, తానెక్కడ దొరికిపోదునో, తన హృదయమెక్కడ దిగజారి పోవునో యను భయమున, కైకయి, "ఆహా వంచన ప్రక్రియ.

నాకు నిజముగ కోపమేవచ్చినది. ఇది శోకము గాద"ని బూకరించెను, రాజు ఏపాటి కోరికలు కోరుకొందువో కానిమ్మనెను. కైకకు తానడుగక తప్పదు. రాజి వ్వనన్న అదియొకదారి. రాజిత్తుననెను. సూర్యవంశస్థుడు దశరథు డాడితప్పడు ఆ పలుకు ప్రాణాంతకమై కైకకు కోపశోకములు పెల్లై ఉబికినవి. రాజిది యంతయు తాను వరదానము చేయకపోవుట వలననే యనుకొనెను. బిత్తరకత్తె నామువ్వ ఇదుగో వాంఛింపుము నేనిత్తునని రెట్టించెను. కైక ఆక్రోశపడి ఇత్తు నిత్తునంటివి ఇత్తుననుట చులకన. ఇచ్చుట మాత్రము కాదనెను. దానికి రాజభి మానపడెను. ఆయన కన్నులు కెంపులై, మా కులము నేలెడి చిన్నారి వెల్గు రాముడు, వాని మీద నొట్టు. నీ వరములు నా ప్రాణములకు గండకత్తెరలైన నిత్తుననెను. కైక పూర్తిగా నోడిపోయెను. అవిడ కోర్కెలు విని రాజు హృది యందలి నెత్తురు వాకలు వెనుకకు నడిచినవి. అరువదివేల యేండ్లగా వాని మన స్సున ముద్రితమైన కైకయీ సుస్వరూపమే మారి వికృతమై పోయినది. ఈ కైక వ్యక్తి. తినుటకు పట్టుకొన్న కుందేలు పిల్లతో తినబోవునంతలో ఆడినట్లే ఈ తోడేలును రామునితో నాడినది. ఈ కైక ఈర్ష్యానులిప్తదెహ. ప్రతీకార కైతవ రజస్సు. ఆ ఈర్ష్య సపత్ని రాజమాత యగునని. ఆ ప్రతీకారము తద్గర్భము ఆరణ్యముల నవియవలెనని.

సర్వాయోధ్యయు కైక రాము నడవులకు పంపుటకు కారణమిదే యను కొనెను. అది కాదని యామె చెప్పలేదు. ఉత్త నిందలపాలగుచున్న తన బ్రదుకు భారమును తేల్చి వేసుకొనలేదు. ఒకప్రక్క తన అంతరాంతర ప్రాణమగు బిడ్డ మనోవాంఛాపూర్తి. మరొక ప్రక్క వాని యెడబాటును సహించలేని సర్వాయో ధ్యయు. ఈ రెంటి మధ్య నామె నలిగిపోయెను. ఇది చెప్పుటకు, ఇది చేయుటకు స్పృహలేక నిశ్చలయై పోయెను. వరదాన మడిగిన క్షణమునుండి రాముడు, అరణ్యమునకేగుచు, తన కాళ్లకి నమస్కరించువరకు ఆమెకు మాటయు పలుకును లేదు. ఆమె మనస్సు కల్లోలితమగు నయోధ్యయందు అతి దుఃఖియగు దశరథుని యెదుట, కైకయీ శరీరమందు, లేనే లేదు.

ఇట్టి కైకయిని దశరథుడు చెడదిట్టెను. ఇవి చేతులు కావు కాళ్లేయని ప్రతిమాలెను. నీకు గుడి కట్టించి రఘుకులముచే నిన్ను తరతరముల కొలిపింతు

నని ప్రార్థించెను. అంతేకాని తానావరము నీయలేదనడు. రాముడరణ్యములకు పోనక్కరలేదనడు. ముదిరేడు వాచాలుడై కైకను తిట్టి తన్ను దూరుకొని, తన భాగ్యమును నిందించుకొని మూర్ఛితుడై పోయెను. మాటిమాటికిని పతి వచస్సుల కనుగుణముగా పోదలచు కైక ఆత్మ నేదో నిలువరించెను దశరథుడు దుఃఖమున నెంతవాచాలుడయ్యెనో కైక దుఃఖమున నంత నిస్తబ్ధయయ్యెను.

కబురుపోగా రాముడు వచ్చెను. తన్ను చూచి పలుకులేని తండ్రిని కని, "నాతండ్రి నాకు ప్రత్యక్ష మురారి. ఆయన చెప్పిన ఏ విషపుదాకుస్వివన్ను గండాంతరాస్థినైన నిద్రించెద. నన్నేల రమ్మంటిరి తల్లీ" యని కైక మొగము వంక చూచెను. కైక మనస్సుడికిపోయినది. ఈ పుత్త్రుడే తన నడ్డము పెట్టుకొని తండ్రిచే వరదానము చేయించుకొనెను. తనకు నిందను, ప్రతివారికిని తనపై ప్రాణాంతకమగు కోపమును మిగిల్చెను. ఈ ఊహతో ఆవిడ కన్ను లాపాటున నిప్పులు చెఱిగినవి. రాముడది గ్రహించి, "నీకును నామీద కోపమా తల్లీ! ఇందు నేనై చేసిన దేమి యున్నద"నెను. అట్లనుటలో అంతయు దేవతల ప్రబోధమని ధ్వనించెను. కైకకు కోపమంతయు దుఃఖమైనది. ఆ దుఃఖము ఆ కంఠమ్ముగా వచ్చు దుఃఖము దాని నామె నేత్ర రేఖాకోణమున అతి ప్రయత్నమున నదిమి చిక్కబట్టినది. మునివంట అమె నొక్కిన క్రింది పెదవి నెత్తురు చిమ్మినది.

చిట్ట చివరి మాటగా రాముడొక్కటి చెప్పెను. తనకు సేవ్యమైన ధర్మ మును చేయ సాయపడిన సాధువు పినతల్లి. ఆమెను పట్టుకొని, సాధింపులు, కోపములు బెదిరింపులు కొనసాగించిన తన ప్రాణము దుఃఖపడును. వానిని మానుమనెను. కైకయా పదములకు ప్రణమిల్లి పుత్రునివలన కలుగు బాధలను తల్లిగాక మరెవ్వరు సైరింతురు, బాధపడకు మనెను.

అంతవరకు నిశ్చలయై యున్న కైకయికి రాముని కాల్తాకువలన స్పృహ కలిగినది. తన కాలియందు జనించిన పులకులు మైత్రకాలగా రామునెత్తి గుచ్చి కౌగలించుకొన్నది. మూర్ధ మాఘ్రాణించినది. రాముడామె యాశీస్సు లివ్వనిదే వనికి బోననెను. మూర్తి దాల్చిన ధనుష్కళా పాండిత్యము. వానికి తన యాశీస్సులక్కరలేదు. వాని బాహాధనుః క్రూర మార్గణములు చేయు నుపద్రవ

మున మహాకాంతారములు మోషిల్లును. తన యాశీస్సులన్నియు రాముని వలె నాటకుగా తను కన్న భరతున కన్నది. ఆమాటల లోతులు తెలియక అంద రును ఛీఛీ యనిరి. రాముడు మాత్రము తన్ను తల్లి చివరిదాక రక్షించినదని సంతసించెను. కాని తనను ప్రాణముకంటె మిన్నగా ప్రేమించిన సవతితల్లిని తానె శపించి సవతి తల్లిగనే లోకమునకు చూపినట్లాయెను.

ఇంతవరకును కవి చిత్రించిన కైకయీ రూప మొక యెత్తు. దశరథ మరణానంతర మా కల్పన మరియొక యెత్తు. దశరథుని మృత కళేబరము పైబడి కౌసల్య యేడ్చుచుండెను. వరదానమైన గడియనుండి దశరథుడు కైకయి మొగము చూడలేదు. భర్తృ మరణవార్త విని యామె కౌసల్యా యంతఃపురమున కెట్లో వచ్చినది. ఆ కైక అసంస్కృత శిరోజాత. సితసిచయధారిణి. నిరంతర స్రవద్బాష్ప విదూషితారుణలోచన. ప్రాణసహితయయ్యు ప్రాణరహితవలె కన్పట్టెడి తన్వి. ముఖమునందు కుంకుమబొట్టు మాత్రము కల సాధ్వి. ఇచట కవి యామెను కైకయీదేవి యనును. ఈ ఘట్టము కడ తాను చేయు కైకయీ పరిదీన స్వరూప వర్ణన మింత పరాకాష్ఠ నందునప్పటికి కవికే ఆ పాత్రయందు పాత్ర యనెడి బుద్ధిపోయి దేవీ స్వరూపమను పూజ్యభావము పరివ్యాపించినది. అట్టి స్ఫురణ ఆ ఘట్టమును చదువు ప్రతి పాఠకునకు కలుగును. అట్టి కైకయీదేవి రాజును రాణిని దగ్గరుటకు భయపడుచునే ఆ సమీపమున తారట్లాడుచుండెను. భర్తృ మరణదుఃఖిత కౌసల్య తలయెత్తి కైకను చూచి యాక్రోశపడినది. ఆమె దుఃఖము కట్టలు తెగివచ్చినది. అది యుక్తాయుక్తముల నెరుగని దుఃఖము. భర్తృహీన మగు సర్వాశాప్రపంచమును నీవే బావుకొనుము. నాకేమి? నే పతి చితిపైబడి మ్రగ్గెదను. అటు మిథిలయందును. ఇటు అయోధ్యయందును అందరు నీవు చేసిన జోగులన్నది. అక్కడికిని ఆమె యావేశ మాగలేదు. కక్కసవడి నిన్ను సవతిగా గొనుటచే నేను దానవవంశజాతనైతి నన్నది. ఈ కైకయి వెనుకటి గరువతనముకల కైకయి కాదు. ఈవిడ నిరభిమాన, నిర్లజ్జ, సర్వసన్యాసిని. కావుననే సవతి మాటలకు బిగ్గనేడ్చుచు పోయి కౌసల్య పాదములు పట్టు కొన్నది. ఆ యేడ్చుట కౌసల్య తన్నన్ని మాట లన్నదని కాదు. తన యభి మానము దెబ్బ తిన్నదని కాదు. తన ప్రియవల్లభుడు మరణించినాడని. ఆ

మరణమునకు తానే కారణమని, తన ప్రియపుత్రు డడవులు పట్టినాడని. ఆ పని నాతడు తనచేతనే చేయించుకొన్నాడని. కైకేయీ దేవి సంతప్తమతివిధాన మట్టిది. అది యొక్క రామప్రభునకే తెలియును.

భరతుడు వచ్చి, బావురు మనుచున్న రాజప్రాసాదమును చూచెను. ఎవ్వరును వానికది యట్లేలయుండెనో చెప్పలేదు. తల్లికడకు వచ్చి యామె యడుగు దమ్ములంటి వావిడిచి యేడ్చెను. విశీర్ణహృదంతర కైక స్పృహ తెచ్చుకొన్నది. భరతుడు గాఢశీలి. వాని కీరాజ్య మక్కరలేదు. వాని కన్నయందు భక్తి యున్నది. వాడన్నియు త్యజించి అన్నవలె అరణ్యములబట్టునేని నేల యేల్పడి తొలివలె సాగదు. రాజ్యమరాజకమగును. అప్పుడు తాను దశరథ మరణమునకు కారణమైనట్లుగానే కోసల రాజ్యవిచ్ఛిత్తికిని కారణమగును. కాననే ఆమె తన హృదయమును చిక్క బట్టుకున్నది. భరతుని కొరకుగా తనలో లేని తైక్ష్ణ్యమును తెచ్చిపెట్టుకొన్నది ఆమె కన్నులయందు కనలును, దేహమున కంపమును, తమకు తామై వచ్చినవి - జఘన్యుడు, బలయుతుడునైన రాచబిడ్డదే రాజ్య పాలనము. వాడు లోభవిహ్వలమతి కావలయును. వానికిలపై నెవ్వరును లేరు. మెత్తని యెదకల రాచసిసువులకు ధారుణి సహస్రయోజనముల దూరమున నుండును. రామచంద్రుడు దోర్వ్వలయ మహా ప్రతాప శిఖి. శ్రీ ప్రభుడు. హేలా ధనుశ్శ్రీ కళాపారావారుడు. అట్టి వానిని కత్తితో గెలువరాదు. వానిని నీవు నీ తల్లి నీతిచే గెలిచితివన్నది. ఈ ధరయంతయు నీకైచేసి పెట్టితిని నీవు చేకొన్న రామచంద్రు డిసుమంతయు పట్టించుకోడు. నీధైర్యమంతయు రాజ్యలక్ష్మీ రంహః పరికృష్టి సంలీఢముగా చేయుమన్నది.

ఇది విని, భరతుడు కలవరపడి యింత గాలి మూట నా పేరున నేల కట్టితి వనెను. నేను రాముడనైన నన్నడవికి తోలియుందువా యనెను. అందుకు కైక నవ్వి, "తగునురా అన్నా, నీవు కాంతారమేగి యేమి చేయుదువు? రామచంద్రుడు ప్రధ్మాంశు తేజో వినూతన నారాయణమూర్తి. శాసిత సమస్త ప్రాణి. నీవేగుట, అతడేగుట, ఒక్కటా?" అన్నది- ఆ మాటలు తల్లి తనను విడువలేని ప్రేమాతిశయమునసే అనుచున్నదని భరతుడనుకొనెను. సవతి మాత్సర్యముననే ఆమె ఈ కార్య మిట్లు నెరవేర్చినదనుకొనెను. తల్లిని తిట్టి, జననివగుట నిన్ను

చంపరాదు. లేకున్న నేమి చేసెడి వాడనోయనెను. కైక దీనికేమియు ననలేదు. భరతుడు రామప్రభుని తెచ్చెదననగా, ఆమె కన్నుల కాంతి ప్రాలంబముక్తా చ్ఛవియై పుత్రుని క్రమ్మెను. భరతునకు తాననుకున్నట్లే రాజ్యకాంక్ష లేదు. పదునాలుగేండ్ల గడువు పిదప వాడు రామమూర్తికి మనఃపూర్తిగ రాజ్యమప్పగించును.

కాని యీ పదునాలుగేండ్లును వాడు రాజ్యభార నిర్వహణమునందు విరక్తుడు కారాదు. తాను చేయవలసినదది. "మహీ రాజ్యమందు వైరాగ్యమేచిన నీకు పదిలము. రాముడు వన్యసీమలందుండు నివాసము కొంగున తానై ముడికట్టుకొని చనెను. నీవు పిలిచిన వచ్చునా చూచెద" నన్నది. ఆ అనుట, యెట్లువచ్చును వచ్చిన తిప్పి పంపనాయన్నట్లు భరతునకు ధ్వనించినది. అందుకు వాడు మండిపడి యింత సూడుకొనిన రక్కసితనముకంటె చావు మేలు. నన్నందరును కాంతాదుష్టసంకల్ప రీథా కూటస్థునిగా నందురు. నీ మాతృత్వము నకును, నీకును వేయి దండములని యట నుండి విసురుగా వెడలిపోయెను. పుత్త్రికృత ఈతాదృశావమానమునకు పాత్రయైన నిరపరాధ జనని కైకేయి. కాని ఆమె ఈ ఘట్టనకు క్షోభ చెందలేదు. ఆమె అహంకార మమకారములు లేని సర్వసన్న్యాసిని. ఒక సత్కార్య నిర్వహణమున సహాయకురాలుగా వట్టి తుత్రటలు నెత్తిన వైచుకున్న త్యాగమూర్తి.

రాముని తెచ్చుటకుగా భరతుడు సర్వాయోధ్యను తన వెంట కదిలించెను. అందు ముగ్గురు తల్లులుండిరి. భరతుడడుగడుగునకు రామచంద్ర వనవాస చింతనా దీనబుద్ధి నతివిహ్వలుడు. అన్న తన వెంట పురికి వచ్చునో రాడోయను కొని, అన్నస్థితి తలచుకొని, తనదశచూచుకొని, భావమందు కష్టపడుచునే వచ్చుచుండెను. గుహునివలన రామకథను విన్న వెనుక వాని మనస్సు మరింత దీనమయ్యెను. నిలువనేరక మూర్ఛనొందెను. రామ వన గమనానంతరము భరతునే రామునిగ చూచుకొను కౌసల్య గుండెలలో గుండెలు లేవు.

కైకకీ విధమగు భరతుని ప్రవర్తన నచ్చలేదు. వాడింత బేలయైన రాముని తేలేడు. రామచంద్రుని బుద్ధి పరమధర్మతర్కపటువు. అట్టి వాని

దెచ్చుట కెక్కడలేని గాంభీర్యము కావలయును. ఈ సంగతి చెప్పుటకు కైక ఒక్క యేకాంతమున పుత్రుని ప్రబోధించెను. "నీవు భావమందింత కష్టపడు చుంటివన్నను రామునకు లెక్కలేదు. వాద ప్రతివాదముల వానిని ఒప్పింతు ననుకొన్న వాడన్నిటి కన్ని చెప్పి పంపును. వృధా ఖిన్న మనస్కుడవైన నీవు వాని కేవల వాదములముందు నిలువలేవు. ఏనాటికైన వాని నింటికి దెచ్చుట కొక్కటే మార్గము. నీ బుద్ధిని ప్రయోగింపకుము. దానిని హృదయమందు దాచుము. అతడే రాజు. నీవు రాజువు కావు, నీకు రాజ్యమే అక్కరలేదన్న బిగువుతో నీ వుండినచో ధీబంధురుడైన వాడు కొంత దిగివచ్చును. రాజ్యము నీదియని నీరాజ్యము వాని కిచ్చుచుంటివని నీ వన దలచినచో మొదటికే మోసము. నీ కింత దుఃఖమున్న నీవు దిట్టరివి కాలేవు. దానిని దిగద్రొక్కుకొమ్మన్నది. భరతుడీ మాటలువిని విస్తుపడెను. ఉన్నవాడున్నట్లు కన్ను విప్పి తల్లిని చూచెను. ఆమె యింత చెప్పినను ఏదియో దాచియే చెప్పెను. సముద్రమంత యర్థ మామాటలలో దాగి వాని యూహల కందకయే పోయెను. కాని వాని కొక్కటి తెలిసినది. తనతల్లిచాతుర్యమేవాని నడవులకు బంపినది. ఆ చాతుర్యమే వాని నయోధ్యకు రప్పింపగలదు. అన్నవెట్లైన పురికి రప్పింపుమని భరతుడు తల్లిని వేడుకొనెను.

అందరును భరద్వాజర్షి యాశ్రమము చేరిరి. ఇచట కైకయీ పాత్ర చిత్రణమును పరాకాష్ఠనందించుటకు కవి మరియొక కల్పనచేసెను. ముగురు రాణులును ఋషి యాశీస్సులు పడయుటకు సన్నిధికి వచ్చిరి. భరతుడు వారిని పరిచయము చేయవలసి వచ్చెను. అతడు కౌసల్యను రామచంద్ర గర్భామృత వీచిగా చెప్పెను. సుమిత్రను కోసలాధిపుని యిండ్ల కష్టముల నందర నాదుకొను శాంతాత్మగ చెప్పెను. తన తల్లిని గూర్చి యేమి చెప్పవలయునోవానికి పలుకు సాగలేదు. సర్వాయోధ్య యెదుట తానామె పుత్రుడ ననుట తనకవమతి. కాని అంతకుముందామె చేసిన యుపదేశములోని సముద్రపు లోతులుహృదయమున తెరలి ఆమెను గూర్చి మరొక విధముగా చెప్పనీయలేదు. ఏమియును చేయలేక భరతుడు కైకయీ ముఖాబ్జమునందు చూచి, చూపునుమరలించి, చూడనట్లు చూడకుండ నూరుకొనెను.

భరద్వాజుడు సర్వవేత్త. అతడొక్క నవ్వునవ్వి భరతుడు చెప్పకున్నను ఆమె ఎవరో తనకు తెలియు ననెను. ఆమె అమర సాహాయ్యార్థము రక్కసుల

నెదిర్చిన దశరథ భూపాలుని సారథి. క్ష్మానీతి సంక్లిశ్యమానార్థములందు వాని రహస్యమంత్రిణి. శ్రీ రఘురాముని చిత్రధనుఃకళాదృతిహేతు నూత్న గాధి ఋషి. మరియు సర్వదైవత ఋషిసంతాన కార్య సంఘాత శ్రీ సంధాన కర్త్రి. తనను పెంచిన ఋణము తీర్పను, తన హృదంతరాంతర ప్రాణమగు బిడ్డ నడవి కంపిన త్యాగమూర్తి. అట్టి కైకయి గౌరవార్హురాలని ఋషి భరతునితో చెప్పెను.

ఈ ఘట్టము చదివి స్పందించని హృదయముండదు. ఆర్ద్రములు కాని కన్నులుండవు. కైకయీ పాత్ర ఒక అమర సృష్టియై, కల్పవృక్షము, స్మరణకు వచ్చినపుడెల్ల, మనస్సుల నమృతము చిల్కునంత పటిష్ఠముగా కవి దానిని తీర్చి దిద్దెను. వజ్రాయుధమునకు గల వేయి యంచులవలె లోక సాక్షికి గల వేయి కిరణములవలె, రాముని యెడల పుత్రప్రేమయు వాని కోరిక నెరవేర్చుట కై స్వధర్మ నిర్వహణా పటిష్ఠతయు తీక్షణములై, తేజః కలితములై, కైకయీ పాత్రయందు పూర్ణముగా భాసించుచున్నవి, ఇట్టి పాత్రను సృజించి యిచ్చిన కవి ధన్యుడు.

ఫిబ్రవరి 1957 భారతి.

# కాలాతీత వ్యక్తులు

బి. యే. జూనియర్ చదువుతూ మానేసింది. టైపూ షార్టుహేండూ నేర్చుకుని ఉద్యోగం చేస్తోంది. వాళ్లది అనకాపల్లి దగ్గర ఏదో ఊరు. ఆ అమ్మాయి పేరు ఇందిర. కళ్లజోడూ, రెండు జడలూ - బలంగా, అందంగా ఉండి, తరుణ వాంఛలు మిలమిలలాడే శరీరం. వ్యక్తిత్వ ఉట్టిపడే ముఖం. కాలాతీత వ్యక్తుల్లో ఒక కాలాతీత వ్యక్తి ఇందిరను రచయిత్రి మనకు పరిచయం చేసిన వైనం ఇది-

డాక్టరు శ్రీదేవి గారు రచించిన ఈ నవలలో, కథ ఇందిర చుట్టూ గిరగిరా తిరుగుతుంది. - నేటి సమాజానికి, కాలానికి, అందరికీ, అలవాటయి పోయిన జీవన వైఖరికీ, విలక్షణంగా బ్రతకడం అలవాటయిన అద్భుతపాత్ర ఇందిర. ఇందిరవంటి మనుష్యులను నిత్య జీవితంలో మనం ఎక్కడా చూడమని చెప్పలేము గాని, అరుదుగా చూస్తాం - నవల మొదలుపెట్టడంలో ఇందిరను గురించి పరిచయం చేస్తూ మొదలుపెట్టి, చివరకు ఆ పాత్ర చేతనే ఉద్రేకోద్వేగాలతో ఉపన్యాసం ఇప్పించి మరీ, కథను సుఖాంతం చేస్తుంది రచయిత్రి. దీన్ని బట్టి, నవలలో ఆపాత్రకున్న ప్రాముఖ్యమే కాక, రచయిత్రికి కూడా ఆ పాత్ర మీద ఉండేమక్కువ వెల్లడి అవుతుంది. ఆవిడ చేసే చిన్న ఉద్యోగంలో తన మీద ఆధారపడ్డ తండ్రిని పోషించే భారంకూడా ఆమెదే. తండ్రిఆనందరావు బాధ్యతలూ బరువులూ మర్చిపోయి సుఖంగా బ్రతకడం అలవాటు చేసుకున్నవాడు. నిన్న అన్నది నేడై, నేడు ఈ క్షణమైతే తప్ప, దాన్ని గురించి అతడు ఆలోచింపడు- అతడిది మొదటినుండీ ఆషామాషీ బ్రతుకే. జీవితంతో జూదం ఆడేవాడు. భార్య రోగిష్ఠి. ఇందిర చిన్నప్పుడు తల్లి లాలన ఎరగదు. రాత్రుళ్లు తండ్రి గుండెలమీద పడుకుని నిద్రపోయేది. ఆ నిద్ర మైకంలో తండ్రి పెదాల నుండి వచ్చే మాటయిన ద్రావకపు వాసనలు పీలుస్తూ పెరిగింది. ఆ పిల్లకు చిన్నతనంనుంచీ అన్నీ అనుభవాలే. అతడు చేసిన అపస్మారపు పనులకు తండ్రి జైలుకు వెళ్లాడు. తల్లి చచ్చిపోయింది. అయినా ప్రకృతి ఇచ్చిన చురుకైన మెదడూ, గట్టి శరీరమూ

ఉంది. కనుక, ఇందిరకు ఎన్ని కష్టాలు వచ్చినా, తట్టుకోగలిగింది. నిరర్థకుడైన తండ్రివల్ల పెద్ద చదువులు సాగక, డ్రైవూ షార్టుహాండూ నేర్చుకుని కేవలం తన పలుకుబడివల్లనే ఉద్యోగం సంపాదించుకుంది - జీవితం కసిగా, భూతంలా ఆవిడను మింగేయాలని చూస్తుంటే, భూతంలా మీదబడి దాన్ని దక్కి, పీకి పాతం పెట్టాలని నిశ్చయించుకుంది - కాని అమ్మాయి బ్రతుకు పరమార్థం ఏమిటి? ఆవిడకు తనవి అనుకునే ఇల్లూ, వాకిలి, భర్తా, పిల్లలూ లేరు. అటువంటివి అమర్చి పెట్టవలసిన తండ్రి ఆబాధ్యతలజోలికి పోడు. తానలా అవడంలో తనతప్పేముంది? తానెందుకలా అవాలి. ఈ కసి ఎలా తీరుతుంది? ఎవరిమీద తీర్చుకోవడం. - అందుకే ఇందిరకు లోకం భూతంలా కనిపించేది. మగవాళ్లు త్రాచుపాముల్లా కనిపించేవాళ్లు. తన అపజయాన్నీ, నైరాశ్యాన్నీ వెలిబుచ్చుకోవడం ఇష్టంలేక, కచ్చకొద్దీ మగవాళ్లను ఆకర్షిస్తూ, కవ్విస్తూ, వాళ్లను చులకనచేస్తూ, జీవితంతో ఆటలాడేది - వేటి కోసమూ బెంగపెట్టుకోకుండా హాయిగా, ఎక్కడి కక్కడ సదుపాయంగా బ్రతకడం ఆ అమ్మాయి ఆశయం. అలా బ్రతుకుతున్నట్లే ఎదుటి వాళ్లకు కనిపించేది ఇందిర-

ఇటువంటి ఇందిర ఆకర్షణల సుడిగుండంలో ఆకు ముక్కల్లా గిరగిరా తిరిగినవాళ్లు ముఖ్యంగా ఇద్దరు. అందులో ఒకడు ప్రకాశం. రెండోవాడు కృష్ణ మూర్తి. ప్రకాశం ఫైనల్ ఇయర్ ఎం. బి. బి. యస్. చదివే విద్యార్థి. ఇందిర అద్దెకున్న ఇంటిపైభాగంలో అద్దెకుండేవాడు. ప్రకాశం మెత్తనివాడు. సాటి విద్యార్థులతన్ని "చవటపురా" అని వేళాకోళం పట్టించేవారు. బొత్తిగా చేవలేని వాడవు ఎలా బ్రతుకుతావో అని వాళ్లమ్మ నిట్టూర్చేది - సాయంత్రం పూట చక్కగా ముస్తాబై ఇందిర తన గదికి వస్తే ప్రకాశానికి భయం - సినిమాకు రమ్మంటుందేమోనని - సినిమాకు వెళ్తే చదువు సాగదు, డబ్బు ఖర్చు. ఆ అమ్మాయిని వెంటేసుకు తిరగడం ఏ ప్రొఫెసర్ అయినా చూస్తే కొంప మునిగి పోతుంది. ఇలాంటివీ ప్రకాశం భయాలు - ప్రకాశం పుట్టిన మూడేళ్లకే నాన్న పోయాడు. తల్లి పుట్టింట చేరగా, ఉన్న కాస్త ఆస్తితో మేనమామ ఆధ్వర్యం కిందనే పెరిగాడు. ప్రకాశం మేనమామ శేషావతారం చండశాసనుడు. అప్పుడె

క్లైల్స్. మేనల్లుణ్ణి చేరదీయడంలో ఇతనికి స్వార్థముంది-అడుగడుక్కీ "నీ ఆస్తి నీ చదువుకి చాలదు. ఇక చదువు ఆపెయ్ అని బెదిరిస్తూ ఉండేవాడు - ఈ బెదిరింపుల మధ్య, పరాయి పంచన పెరిగిన, ప్రకాశానికి జీవితంలో మిగిలింది పిరికితనమే. దేనిమీదా అతనికి ఖచ్చితమైన అభిప్రాయం లేదు. గాలివాటు ఎటు బలంగా ఉంటే అటు ఎండుటాకులా కొట్టుకుపోయేరకం - ఇటువంటి చంచల మనస్కుడు స్వతహాగా బుద్ధి ఉపయోగించి, మనసా, ముందు కళ్యాణిని ఆవిడ కష్టాల్లో, సానుభూతిని చూపిస్తూ, నేనున్నాను లెమ్మని అనేంతవరకూ చొరవ తీసుకున్నాడు -

కల్యాణి బీదయింటిపిల్ల, కష్టాలలో పెరిగింది. కష్టాలను సహించడం నేర్చుకుంది తండ్రి బడిపంతులు. కల్యాణి పుట్టగానే తల్లి ఈ లోకంనుంచి నిష్క్రమించింది. ఎక్కడా దిక్కూ మొక్కూలేని ఓ దూరపు బంధువే కల్యాణికి సర్వమూ అయి పెంచింది. బీదరికం మధ్యా, నిరాశల మధ్యా, తల్లిలేని కల్యాణి పెరిగిన పెంపకం ఆవిడకు జీవితమంటే పెద్ద ఆశాకరమైన దృక్పధాన్ని ఏమీ ఇవ్వలేదు. ఐదేళ్ల కల్యాణి నాన్నతోపాటు బడికి వెళ్ళేది, ఎనిమిదేళ్ల కల్యాణి పిన్నితోపాటు గుడికి వెళ్ళేది. పదిహేనేళ్ల కల్యాణి స్కూల్ ఫైనల్ పాసయింది. పదిహేడేళ్ల కల్యాణి ఆనర్సులో చేరింది. కాని, ఏనాటికానాడు ఆవిడకన్నీ ఇబ్బందులే. హాస్టలులో సరిగాలేక ఇందిరతో స్నేహంకలిపి, ఇందిరఉన్న ఇంటికే తనబస మార్చేసింది. అక్కడే ఆవిడకు ప్రకాశరావుతో స్నేహం కలిసింది. ఇందిర తత్త్వమూ కళ్యాణి తత్త్వమూ ఒకటికాదు. ఇందిర తనకెన్ని అడ్డంకులూ, ఆపదలూ, ఎదురయినా ఏమీలేదనుకుంటూ లోకంమీద కసిగా బతికేస్తుంది. కళ్యాణికి జీవితంమీద కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. తాను చదువు పూర్తిచేసుకొని, తనకాళ్లమీద నిలబడగలగడమే ఏకైకలక్ష్యం అందుకు ఎన్నో అవాంతరాలు వచ్చాయి. తండ్రికి హఠాత్తుగా జబ్బుచేసింది. డబ్బులేక చదువు ఆగిపోయే పరిస్థితి వచ్చింది. ఉన్నఒక్క ఇల్లూ తాకట్టు క్రింది మహాకరి అకట్టులోఉంది. అయినా కల్యాణి చలించలేదు. అంతకు ముందే ఏర్పడిన ప్రకాశంతో స్నేహంవల్ల అతడు తనకు అండగా జీవితాంతం ఉంటా

దనుకున్నది. తండ్రి దగ్గరకు వెళ్ళిపోతూ, ప్రకాశంమీద కొంతంత ఆశ పెట్టుకుని వెళ్ళింది.

ఇందిర తానే కల్యాణిని తీసుకొచ్చి దగ్గర ఉంచుకొని ఆదరించినా ప్రకాశం ఆవిడపై సానుభూతి చూపించడం సహించలేకపోయింది- "ఏడ్చే వాళ్లంటే నా కసహ్యం. దౌర్బల్యానిచూచి బాధపడడమే ఒక దౌర్బల్యం" అంటూ పెటుకు మాటలు విసురుతూ ప్రకాశాన్ని నిలువనిచ్చేది కాదు. చపలచిత్తుడూ, అస్వతంత్రుడూ, అయిన ప్రకాశం ఇందిర సాగించిన గాలిదుమారానికి నిలువలేక పోయాడు. "నేనున్నాను నీకేం భయం. అని కొంతంత ధైర్యంచెప్పి వాళ్ళఊరికి రైలెక్కించిన కల్యాణికి ఏమి చెయ్యలేకపోయాడు. తండ్రి చనిపోయిన విషమ పరిస్థితులలో,నేనన్ని విధాలా నష్టపోయాను. ఒక్కసారి రా అని ఉత్తరం వ్రాసిన కల్యాణికి, ఇందిర ధాటికి భయపడి, మారు సమాధానం ఇవ్వకుండా ఊరు కున్నాడు, అతడలా అవడానికి కారణం, అతని పిరికితనం, చంచలతా, నిస్సహా యత్వం. మీదు మిక్కిలి తప్పించుకోడానికి వీల్లేని పరిస్థితిలోని ఇందిరఆకర్షణ.

ఇందిర ఆకర్షణకు లొంగిపోయిన మరొకపాత్ర కృష్ణమూర్తి, కృష్ణమూర్తి గొప్పింటి బిడ్డ. జీవితానుభవాలేమీ ఎరగనివాడు చదువుకోవడానికి వచ్చాడు. పట్నం జీవితంలోని వ్యామోహానికి లొంగిపోయాడు. చదువు అబ్బలేదు. రకరకాల స్నేహితులు చుట్టూచేరి అతని డబ్బునూ మంచితనాన్ని వాడుకున్నారు. చదివి పరీక్షలు ప్యాసుకాకపోతే గడవదనే బెంగలేదు. స్వతహాగా అలాంటి గొప్పతనాలేవో సాధిద్దామనే ఆసక్తే లేదు. అందుచేత అలా అలా కాలక్షేపంచేస్తూ బ్రతికేవాడు. ఇందిర లోకంమీద కసితో అషామాషీగా బ్రతకడం అలవాటు చేసుకుంటే, కృష్ణమూర్తి లోకమేమిటో లోతయిన అభిప్రాయం లేకపోవడంచేత అషామాషీగా బ్రతికేవాడు. అందువల్ల ఇందిరా కృష్ణమూర్తుల జీవన పద్ధతులు ఒక్కటే. కల్యాణికి వచ్చిన కష్టంవల్లా, ఆవిడమీద కసిపూనిన ఇందిర దౌష్ట్యం వల్లా, అతడు మొదట మొదట కల్యాణికి దగ్గరగావచ్చాడు. తన ఊళ్లో తండ్రిని మట్టిచేసి, అన్ని వ్యవహారాలూ వగదెంచుకొని, మళ్లీ విశాఖపట్నం చేరుకున్న

కల్యాణికి, దారీ తెన్నూ కనిపించలేదు. తనకిద్దరు మంచి స్నేహితులున్నారు, ఫరవాలేదని ఎవర్ని గురించి అనుకుందో, ఆ ప్రకాశమూ, ఇందిరా, ఇద్దరూ తనకు కానివాళ్లయిపోయారు. అందులో ఇందిర అంటే పెద్ద కోపతాపాలు కలగకపోయినా ప్రకాశంమీద అంతులేని అసహ్యం కలిగింది. అతణ్ణి తనజీవితంలో కల్యాణి ఎప్పుడూ క్షమించలేకపోయింది. వెనక దమ్మిడీ వచ్చే మార్గంలేదు. ఆప్తులనుకున్నవాళ్లు దూరమయ్యారు. చదువు సాగేదారిలేదు. బండెడు కష్టాలు మీద వేసుకుని వసుంధర అనే మరో స్నేహితురాలి ఆదరంతో, జీవించడానికి దారులు వెతుక్కుంటూ, తరతరలాడుతున్న కల్యాణి స్థితి కృష్ణమూర్తిని బాధపెట్టింది. ఆ అమ్మాయి చదువు తాను సాగిస్తానన్నాడు. కష్టాలలో ఉన్నవాళ్లకు సహాయపడడమే ఆప్తలక్షణమన్నాడు. కాని ఆత్మాభిమానంకల కల్యాణి అందుకు ఒప్పుకోలేదు. ఇతరుల దయాధర్మాలమీద తన చదువు సాగించుకోదలచుకోలేదు ఏదో ఒకచిన్న ఉద్యోగంతో తనపొట్ట తాను పోషించుకోవాలనుకుంది. కల్యాణిలో కొట్టవచ్చినట్లు కనిపించిన ఈ ఆత్మాభిమానమే కృష్ణమూర్తికి కనువిప్పు కలిగించి అతనిలో నిద్రాణంగాఉన్న బాధ్యతల్నీ, విలువల్నీ పైకితీసింది. సరిగ్గా ఆసమయంలోనే కృష్ణమూర్తి జీవితాన్నే పూర్తిగా మార్చి ఇందిరకు అర్పణమయ్యేట్లుగా చేసే మరోసంఘటన జరిగింది. ఆ సంఘటనకు కారణం వసుంధర. ఆవిడ తెచ్చిపెట్టిన చలనమే అతడి జీవనమార్గాన్ని అనుకోని విధంగా మార్చేసింది.

వసుంధర గొప్పింటిపిల్ల. చదువుకోవడానికి విశాఖవచ్చి పిన్నితో కాపురం పెట్టింది. తల్లీ, తండ్రీ, అన్నలూ ఆఖరుకు వదినెలూ అంతా ఆవిణ్ణి మురిపెంగా చూచేవారే. ఏ సమస్యలూ లేకపోవడమే ఆవిడ జీవితానికి పెద్ద సమస్య. రిజర్వుడు క్లాసులో కూర్చుని సినిమాలో పాత్రల కష్టనష్టాలు చూచి కన్నీళ్లు కార్చే ప్రేక్షకురాలిలా, ఆవిడ కల్యాణిలాంటివాళ్ల కష్టాలను కొలవాలని ప్రయత్నించింది. కాని కల్యాణి చూపించిన నిబ్బరం, జీవితంమీద ఆవిడకున్న అచంచల విశ్వాసము, వసుంధర మస్తిష్కపు టూహల కందలేదు. ఆవిడలోనూ చలనం కలిగింది. అదేసమయాన, వసుంధర పిన్ని కల్యాణిని అవమానించడమూ, కల్యాణిమీద సానుభూతి చూపించడానికి అడపాదడపా వచ్చే కృష్ణమూర్తిని తాను ఆదరించగా, అనుమానించడమూ, వసుంధరకు నచ్చలేదు.

ఆదిపెద్ద నేరంగా చూడడంతో ఆవిడ అభిమానం దెబ్బతిని వాళ్లని బెదిరించ డానికి ప్రయత్నించింది. అంచేత ఆవిడకు కృష్ణమూర్తి మరింత ఆత్మీయుడుగా కనపడ్డాడు. ఆడవి ప్రేరణ ఆ విధంగా సహజమైంది కాదు. కాని కృష్ణమూర్తి ఇది గ్రహించాడు. తన అంతస్థువేరు ఆవిడ అంతస్థువేరు. అతని అంచనాలో ఆవిడ అతని తాహతుకు మించిన అణిముత్యం. కృష్ణమూర్తి జీవితాన్ని ఎంత చులకనగా తీసుకుని, దానితో ఆటలాడినా, అటువంటిఆటలో, తనతోపాటు పాల్గోవలసింది, ఇందిరవంటి వారేకాని, వసుంధరవంటివారు కాదని గ్రహించ గలిగాడు. ఆగ్రహణమే అతనికి లేక, కొంత స్వార్థంతో కృష్ణమూర్తి ప్రవర్తించి ఉంటే, వసుంధర జీవితమే తారుమారయ్యేది. జీవితాంతం, ఆ అనుభవ శూన్యు రాలు బాధపడి ఉండేది. స్వార్థంకోసం ఆ అమ్మాయిని రెచ్చగొట్టడం సులభమే అయినా, అటువంటి నీచానికి దిగజారకుండా, వసుంధర జీవితంలోనుండి పారి పోయిన ఉదారుడు కృష్ణమూర్తి.

తన జీవితంలో, ఇంతహటాత్తుగా ఒక అమ్మాయి ప్రవేశించగా, ఆ బారి నుండి ఆ అమ్మాయిని తప్పించాలనే ఆతురతలో వసుంధరనుండి దూరంగా పారిపోయి ఇందిర ఆకర్షణలో చిక్కుకున్నాడు కృష్ణమూర్తి. ఇందిర తన స్థాయిలో మనిషి. ఒకరి దౌర్బల్యాలు ఒకరికి తెలుసు. జీవితాంతం ఒకటయిన అటువంటి అమ్మాయితో స్వర్గానికో నరకానికో ప్రయాణం సులభం. అతని జీవితంలో అతనికి కావలసింది వేరు, దొరుకుతున్నది వేరు. అంచేత ఇందిరను దక్కించుకోవడమే అతడు చేయవలసిన పనిగా భావించాడు. ఏ బాధ్యతలు అక్కరలేకుండా గట్టు మీద కూర్చుని నిశ్చింతగా తమాషా చూద్దామనుకుంటే, సంఘటనల ప్రాబల్యం అతణ్ణి నీట్లోకి తోసేసింది. పడిపోయాడు. ఈదక తప్పదుకదా! జీవితాంతం, ఇక ఇందిరతోనే కలసి ఈదుతాను అని నిర్ధారించు కున్నాడు కృష్ణమూర్తి. ఆ రకంగా పశ్చాత్తాప పడేట్లు చేసిన గొప్పతనం ఇందిరదే.

కృష్ణమూర్తి దృష్టిలో ఇందిర అద్భుతమైనవ్యక్తి. ఆ అమ్మాయి ధైర్య వంతురాలు. వ్యక్తిత్వం ఉన్నమనిషి. "నిన్నుచూస్తే సంతోషం వేస్తుంది ఇందిరా సెబాష్" అనుకునేవాడు లోపల్లోపల. అలా ఇందిర కృష్ణమూర్తిని ఆకర్షించింది

కల్యాణి ప్రలోభంలో పడకుండా ప్రకాశం మనస్సు విరిచినా, అతణ్ణి దక్కించుకునే ప్రయత్నం చెయ్యలేదుఇందిర. ప్రకాశం అరిపేద. మేనమామకు భయపడేవాడు. ఆస్తిపాస్తుల విషయంలో మేనమామతో తెగతెంపులు చేసుకో లేనివాడు. "నేనున్నాను! నీకెందుకు! నామీద ఆధారపడి హాయిగా దిగుళ్లూ చింతలూ లేకుండా బ్రతికెయ్" అనే మగధీరుడికోసం ఇందిర అన్వేషించింది. అటువంటి లక్షణమేదీ ప్రకాశంలో కనిపించలేదు. పైపెచ్చు అతని చింతలూ, బీదతనమూ, చిక్కులూ, అన్నీ తనకే సంక్రమింపగలవు. ఎంతకాలం ఇలా ఏడ్చేవారిని ఓదారుస్తూ, ఏడుపు అణచివేసుకుని కపటపు నవ్వులు నవ్వుతూ బ్రతకడం! అందుకే ఇందిర మెచ్చని ప్రకాశం, ఇందిరంటే అంతులేని కోపం తెచ్చుకున్నాడు ఆ క్షణంలో తాను కల్యాణికి చేసిన అన్యాయమైనా జ్ఞాపకం తెచ్చుకోలేక పోయాడు. ఈ ఇందిరలూ కల్యాణులూ ఎవరు? వీరంతా తన్ను మోసం చెయ్యడానికి తనచుట్టూ చేరిన సీతాకోక చిలకలు. ఎంతచెడ్డా తన మేనమామ, తనబాగు కోరేవాడు. అతడు తెచ్చిన సంబంధమే చేసుకుని, అతడి మనస్సూ, అమ్మమనస్సూ సంతోషపెట్టడంలో ఇహమూ, పరమూ ఉంది. అని మనస్సును సమాధాన పెట్టుకుని, తన్నుతాను వంచించుకొని రైలెక్కేశాడు. ఆత్మయొక్క అస్తిత్వంలేని ప్రకాశం–

కొండంత అవమానం పొంది, జీవితంలో నిలదొక్కుకునే అచంచల ప్రయత్నాలలో క్రమక్రమంగా నెగ్గుకు వస్తూ, ఒకదారి చూచుకుంటున్న కల్యాణికి, చక్రవర్తి అనే డాక్టరుతో పరిచయం అయింది. చక్రవర్తి కృష్ణమూర్తి స్నేహితుడు. అతడూ జీవితంలో మొదట దెబ్బలుతిన్నవాడే తిన్న దెబ్బలవల్ల, మరింత ఆత్మవిశ్వాసం పెంచుకొని నిబ్బరంగా బ్రతకడం అలవాటు పడ్డవాడు. అతడు కల్యాణిని, కల్యాణి అతణ్ణీ పోల్చుకున్నారు. కాని కళ్యాణికి అతనికి భయాలే. ఒకసారి దెబ్బతిన్నప్రాణి కాబట్టి ఈసారి కూడా యే మోసం జరగకూడదని అంతరాంతరాలో అమితంగా వాంఛించింది. కల్యాణి చక్రవర్తిని భర్త హోదాలో స్వీకరించడానికి అమితంగా భయపడ్డది. పెళ్లయినా, తన ఆర్థిక స్వాతంత్ర్యానికి భంగం రాకూడదని, తనకు విశ్వాసం కుదిరేవరకు అదనపు బాధ్యతలూ, బరువులూ తనపైన మోపవద్దని అర్థించింది. చక్రవర్తి ఆమెలో చిరకాలంగా తెలిసిన ఒక స్నేహితురాల్ని చూడగలిగాడు.

ఈ జంటతోపాటు ఇందిరా కృష్ణమూర్తుల జంట కూడ వివాహ బంధాలను తిరుపతి కొండమీద తగిలించుకోవడంతో నవల ముగుస్తుంది. వివాహానికి కట్టుపడ్డా ఇందిరలో వ్యక్తిత్వం చావలేదు. కృష్ణమూర్తితో అలిగినా, పోట్లాడినా అతడి మాటవిన్నా, ఆ వినడంలోకూడా ఇందిర వ్యక్తిత్వమే గోచరిస్తుంది. "నేనున్నానని నాభారమంతా పైన వేసుకున్నాడు. అతడేమడిగినా ఇవ్వాల్సిందే అన్న ఉదారతతో ప్రవర్తిస్తుంది ఇందిర - పెళ్లయిన మరుక్షణమే కృష్ణమూర్తి "ఏమిటో ఇకముందు సమస్యల్ని తలచుకుంటే భయం వేస్తోంది." అన్న మాట వినగానే, ఇందిరకు ఉద్రేకం ముంచుకొచ్చింది. "బ్రతికున్న ప్రతిమనిషికీ సమస్యలుంటాయి. సమస్యలు లేనిది చచ్చిపోయినవాళ్లకి మాత్రమే. నిండుగా బ్రతుకు, నిర్భయంగా బ్రతుకు. రోజుకు పదిసార్లు చావకు, ఇంకొకళ్లని చంపకు. ఆశలూ, స్వప్నాలూ, అనురాగాలూ, అభిమానాలూ పెంచుకో. అవి అవసరం లేనప్పుడు నలుగురూ యేమంటారో అనే సంకోచం లేకుండా వాటిని నిస్సంకోచంగా తీసిపారెయ్. రేపటి సమస్యల్ని గురించి ఇవ్వాళ బెంగదేనికి? పెళ్ళి జీవితంలో ఒక భాగం. నీతో ఎంతదూరం రమ్మన్నా వస్తాను కాని, యే ఘట్టంలోనూ నా వ్యక్తిత్వం చంపుకోను. ఆ మాత్రం అర్థం చేసుకుని నా అవసరాలను గౌరవించడం నేర్చుకొని నాయిష్టంవచ్చినట్లు ఊపిరి పీల్చనిస్తావా - నువ్వూ సుఖపడతావు, నన్నూ సుఖపెట్టగలవు. లేదా ఇద్దరికీ నరకం తప్పదు. ఇద్దరం కలిసి ఒకరి కళ్లల్లో ఒకరు చూస్తూ కూచుందుకు కాదు ఇలా దగ్గరికి వచ్చింది. ఇద్దరం ఒకే లక్ష్యంవైపు చూడగలిగితేనే సార్థకత. అంతేకాని, పెళ్లి పేరుతో నేను ఇంకోరకం జైలులోకి వచ్చానని అనిపించకు" అన్న ఇందిర మాటల్లో ప్రతిధ్వనించే సత్యాన్ని గమనిస్తే జిజ్ఞాసువుల కెవరికయినా ఒళ్లు పులకరిస్తుంది స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీలహక్కులు, సమాజంలో, సంసారంలో స్త్రీల పాత్ర అని ప్రలోభ పెట్టేవారు ఇందిరమాటల్లోని అంతరార్థాన్ని అర్థం చేసుకుంటే చాలు. స్త్రీ అంటే సమస్యలమయం కానేకాదని గ్రహించగలరు.

ఇటువంటి అద్భుతపాత్ర చిత్రణం గురించి ఆవేశంతో ఎంతయినా చెప్పవచ్చు. ఇచ్చిన నవల ఒక్కటయినా, అనర్ఘరత్నాన్ని ఆంధ్రలోకానికి ప్రసాదించి వెళ్లిపోయారు డాక్టర్ శ్రీదేవి.

1961 ఉదయభాను.

# సంక్రాంతి

సంక్రాంతి ప్రతి సంవత్సరమూ జనవరి 14వ తేదీనే వస్తుంది. ఇది అన్ని పండుగల్లా కాకుండా సూర్యసంచారాన్ననుసరించి వచ్చే పండుగ కావడం వల్ల యిట్లా ఒకే తేదీన రావడం జరుగుతున్నది. దీన్నే తెలుగు మాసాలలోకి, తిథులలోకి మార్చి చూస్తే మాత్రం, ఒకసారి పుష్యమాసంలో వచ్చే సంక్రాంతి వ రోసారి మాఘమాసంలో రావచ్చును. "సంక్రాంతి" అన్న మాటకు సంక్రమించడం అనిగదా అర్థం. మేషాది రాసుల్ని, చలన క్రమంలో, ఒక్కొకనెల ఒక్కొకరాశిని, సూర్యుడు సంక్రమిస్తాడు. ఆ విధంగా మనకు ప్రతినెలా ఒక సంక్రాంతి వస్తూనే ఉంటుంది. ఇలా వచ్చే పన్నెండు సంక్రమణాల్లోనూ, ముఖ్యమైనది మకర రాశిలో సూర్యుడు సంక్రమించిన సమయం. అదే ప్రతి సంవత్సరము జనవరి 14న వచ్చే సంక్రాంతి.

సూర్యుని అయన క్రమాన్ని శాస్త్రజ్ఞులు రెండు రకాలుగా విభజించారు. కర్కాటకం నుండి ధనుస్సు వరకు ఉన్న సూర్యసంచారాన్ని దక్షిణాయనమనీ, మకరం మొదలుకొని మిథునంవరకూ ఉన్న సంచారాన్ని ఉత్తరాయణమనీ అన్నారు. ఉత్తరాయణం, హేమంతంలో మొదలై, శిశిర, వసంతాలను కలుపుకుంటుంది. దక్షిణాయనంలో గ్రీష్మ, వర్ష, శరదృతువులు మూడూ ఉంటవి. ఎండా, వానా, చలీ మూడూఉన్న దక్షిణాయన కాలంకంటే, హేమంతం ఉన్నా తర్వాత వచ్చే ఆహ్లాదకరాలయిన శిశిర, వసంతాలు కలిగిన ఉత్తరాయణమే ఆరోగ్య దృష్ట్యా మంచిది. ఎండా, వడా, ఈదరగాలి, చెమ్మా వంటి లక్షణాలు లేక, పొడియారిన వాతావరణంలో, ఆహ్లాదకరమైన ఉష్ణము, చల్లనిగాలీ, కలిగిన యీ ఉత్తరాయణకాలం జనులకు ఆరోగ్యప్రదమైనదే. ఈ అంశ మనస్సులో ఉంచుకొనే గాబోలు, పెద్దలు దక్షిణాయనాన్ని మనుష్యులకు శుభం కోరని పితృయానంగానూ, ఉత్తరాయణాన్ని, పుణ్యప్రదమైన దేవయానంగానూ

పేర్కొన్నారు. భీష్ముడంతటివాడు అంపశయ్యపై దక్షిణాయనంలో పడినా, ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు ప్రాణాలను వదలలేదనే కథకూడా ఉన్నది ఈ కథనుకూడా ఒక ఆధారంగా గ్రహించి ఆర్యులు మొదట ధ్రువప్రాంతంలో ఉండేవారని, అక్కడ దక్షిణాయనం ఆరు నెలలూ ఒకరాత్రి, ఉత్తరాయణం ఆరునెలలూ ఒక పగలూ కావటంవలన, చీకటి దినాలయిన దక్షిణాయణ దినాలను అపవిత్రంగా చూచేవారని శ్రీ తిలక్‌గారు ప్రతిపాదించారు. వెలుగు కోసం అఱ్ఱులు చాస్తూ, ఉత్తరాయణ పుణ్యకాలంలో సూర్యకిరణాలు కంటబడగానే, పండుగ చేసుకునేవారని ఆ పండుగయొక్క చిహ్నమే యీ నాటికి మనకు సంక్రాంతిగా మిగిలి పోయిందని వారు అభిప్రాయపడ్డారు. ఆ విషయాలలోనికి లోతుగా దిగి, చర్చించాలనుకుంటే, వారివైదిక నిలయమూ, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి హిందువుల పండుగలు వంటి గ్రంథాలను చూడ వచ్చును.

కాని మనకు తెలిసిన సంక్రాంతి పండుగను పండుగగా, ఆనందోత్స వాలతో గడుపుకోవడానికి ముఖ్యమైన కారణం నాకు ఒకటే కనిపిస్తున్నది. మకర సంక్రమణంనాటికి, దేశంలో వివిధ ప్రాంతాలలో పంట పండి ఇంటికి వస్తుంది. వ్యవసాయదారుని ఇల్లు ధాన్య సమృద్ధితోటీ, తన్మూలంగా ధన సమృద్ధితోటీ కలకల లాడుతూ ఉంటుంది. నెల మొదటి వారంలో వచ్చిన పండుగకీ, ఆఖరురోజుల్లో వచ్చిన పండుగకీ, నెలసరి జీతగాని దృష్టిలో ఉన్న భేదమే ఈ పండుగకీ మిగతాపండుగలకీ, మధ్య వ్యవసాయదారునికి కనిపిస్తుం దనడంలో విప్రతిపత్తి యేమీలేదు.

తమ స్వార్జితమైన పంటను, అనుభవించటానికి ముందు, తమ ఆనందాన్ని నలుగురికీ వెల్లడి చేయడమూ, ఈ ఫలాన్ని పొందడానికి సహకరించిన పని వాళ్లనూ, పాలెగాళ్లనూ సంతోషపెట్టడమూ, పశువుల్ని అలంకరించి విశ్రాంతి యిచ్చి తమ కృతజ్ఞత చూపుకోవడమూ, యీ పండుగనాడు ఆచరించే విధి విధానాలవల్ల సూచింపబడుతున్నవి.

తమిళ, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రిలలోనూ ఈ పండుగ వ్యావసాయికమైన పండుగే. దీని ప్రాముఖ్యాన్ని విస్మరించకుండా, అందరూ దీన్ని ఆచరించడం

జరుగుతుంది. కాని పండుగ జరిపేపద్ధతిలో కొన్ని కొన్ని స్వల్పమైన భేదాలు ఉన్నమాట నిజమే. స్థలభేదంవల్లా, మనుష్యులజీవన విధానంలోని భేదంవల్లా ఇటువంటి స్వల్పమైన మార్పులు కనబడటంలో అసమంజసత్వం ఏమీలేదు. ఈ దృష్టిలో వేరు వేరు ప్రదేశాలలో ఈ పండుగ చేసే పద్ధతిని గమనించడం ఆహ్లాదకరంగాఉంటుంది.

ఆంధ్ర కోస్తాజిల్లాలలో :- ఈ ప్రదేశాన్ని కంతటికీ ఇది పెద్ద పండుగ, అందుకే దీన్ని "పెద్ద పండుగ" అని కూడా విశేష నామంతో వ్యవహరిస్తారు. మకర సంక్రమణానికి నెల ముందుగా ధనుస్సులో సూర్యుడు ప్రవేశించిన నాటి నుండీ సంక్రాంతి నెలను ఈ దేశపువాళ్లు ఆరంభంచేస్తారు. దీన్నే "నెలపెట్టడం" అని అంటారు. ధనుర్మాసారంభం నుండీ హరిదాసులు, బంతిపువ్వులు చుట్టుకుని, నామాలు తీర్చిదిద్దుకొని తళతళాతోమిన రాగి చెంబులతో ఇంటింటికీహరిని కీర్తిస్తూ తిరుగుతారు. కన్నె పిల్లలు కంచెల మీదా, పెరళ్లలోనూ లభించేగుమ్మడి పువ్వుల్నీ ఆవుపేడనూ సంతరించుకొని గొబ్బిళ్లు తీరుస్తారు. సంక్రాంతి పర్వసమయానికి ముందురోజు "భోగి". ఈ పేరు వెనుకనున్న చరిత్ర యేమిటో విచారించ వలసినదే. తెల్లవారకముందే వేసిన భోగిమంట చుట్టూ ఇంటిల్లపాదీ చలికాచు కుంటుంటే, తల్లులు, పిల్లలకు తలంట్లు కానివ్వడం, కొత్త బట్టలు కట్టబెట్టడం జరుగుతుంది. ఆ రోజు పిండివంటలతో భోజనం చేస్తారు. సాయంవేళ మూడేళ్ల లోపు పిల్లలు ఇంట్లో ఉంటే వారికి భోగిపండ్లు పోస్తారు. రాగినాణెములూ, రేగుపళ్ళూ, నానబెట్టిన సెనగలూ కలిపి బిడ్డమీదనుంచి దిగబార పొయ్యడమే పండ్లు పొయ్యడం - ప్రతి ఆడపిల్లా, భోగినాడు బొమ్మలకొలువు విధిగా పెట్టు కుంటుంది. పెళ్లయిన పిల్లలు, గొబ్బిని గౌరిగా పూజించి మూడవనాడు. జల ప్రదేశానికి తీసుకపోయి నీళ్లలో వాల్లాడించి వస్తారు.

సంక్రాతినాడు తలంట్లు లేవు. ఇంటి యజమానురాలు గొబ్బిపిడకలతో దాలిచేసి దానిమీద పాలు పొంగిస్తుంది. కొత్తబియ్యం,కొత్తబెల్లం,కలిపి పొంగలి వండుతుంది. ఆ రోజు "భూకామందు" తనక్రింద పనిచేసేవాళ్లను, కానుకలచేతా, దానాలచేతా, విందు భోజనాల చేతా, తృప్తి కలిగింప ప్రయత్నిస్తారు.

మరునాడు కనుము. ఇది పశువుల పండుగ. దీన్నే తమిళంలో, "మాట్టు పొంగల్" అంటారు. పశువుల్ని రకరకాలుగా అలంకరించి రంగులుపూసి, బంతి పూలదండలు చుట్టి ఊరేగిస్తారు. ఆ రోజు రైతు పశువునుచేత చేలో పనిచేయించడు. "కనుమునాడు కాకైనా మునుగుతుంది" అనీ "కనుమునాడు కాకైనా కాలు కదపదనీ" రెండు సామెతలు వ్యవహారంలో ఉన్నవి. ఈ రోజు ప్రతివాళ్లూ తలారా ఎందుకు స్నానం చేయవలెనో, ఎందుకు ఎక్కడికి వెళ్లకూడదో, విచారించి తెలుసుకోవలసిన విషయాలు మర్నాడు ముక్కనుము. మాంసాహారుల పండుగ. ఆరోజు సామాన్యజనం బాగాతాగి, తిని, పండుగవల్ల కలిగే ఆనందాన్ని అనుభవిస్తారు. ఈ ఆచారాల్లో ఎక్కడా సూర్యసంచారభేదాన్ని గురించీ, ఉత్తర దక్షిణాయనాల మంచి చెడ్డలను గురించీ, ఎటువంటి సూచనా లేదు. కాని, ధనుర్మాసం ఆరంభించిన దగ్గరనుండీ ఇంటి యిల్లాండ్రు వాకిళ్ళలో పెద్దముగ్గులు వేస్తారు. ఆ ముగ్గులలో అన్నీ గీతలతో కూడిన ద్వారాలు, గదులూ, నాగ బంధాలూ, చక్రబంధాలూ వంటివేకాని, చుక్కల ముగ్గులు ఎక్కువగా కనిపించవు సంక్రాంతినాడు "వైకుంఠవాకిలి" అనే ముగ్గూ, రథమూ" వేస్తారు. వైకుంఠ వాకిలి"కి అన్ని వైపులా ద్వారాలు ఉంటవి. బహుశా సప్తాశ్వరథారూఢుడైన సూర్యుడు, దక్షిణాయనం పూర్తిచేసుకొని ఉత్తరాయణాభిముఖుడవుతాడనీ, అందువల్ల జనులందరికీ, ఆ పుణ్యకాలంలో వైకుంఠ ద్వారాలు తెరచుకుంటాయనీ చెప్పడం యీ ముగ్గుల ఉద్దేశ్యంకావచ్చును. ఉత్తరాయణాన్ని గురించి యీ మాత్రపు సూచనకూడా మిగిలిన ప్రజలలోని ఆచార వ్యవహారాలలో కన్పించదు సంక్రాతికీ, ముగ్గులు పరచడానికీ ఏమిటి సంబంధం అని ఆలోచిస్తే చిత్రంగానే ఉంటుంది. ఏ పండుగలోనూ లేని ప్రత్యేకత ఈ పండుగలోనే ముగ్గులకు కలిగింది. హేమంతంలో బాగా ముదిరిన సీతువలన జలుబూ, దగ్గూవంటి అనారోగ్యాలు కలగడానికి వీలుంది. అనారోగ్య కారకాలయిన సూక్ష్మజీవులను సున్నంఘాటు నాశనం చేస్తుందిగదా అనే జ్ఞానమే, ముగ్గును అలా అందంగా వాకిలిముందు పరవడంలో అంతరార్థమేమో అని నా ఉద్దేశ్యం.

రాయలసీమ ప్రాంతంలో ఈ భోగినాడు మంట వెయ్యరు. కాని పిల్లలకు భోగిపళ్లు పోస్తారు. సంక్రాంతినాడు. పొంగలికి సజ్జలుతొక్కి బెల్లంతో కలిపి

రొట్టెలు చేస్తారు. అందులోకి ఆ రోజుల్లో దొరికే అన్ని కాయకూరలూ కలగలిపి కూర చేసుకుంటారు. ధనుర్మాసారంభం నుండీ గొబ్బిళ్లుపెట్టే అచారంలేదు గాని, పండుగ రెండు రోజులూ. గోమయంతో ముద్దలు చేసి గుమ్మానికి అటూ ఇటూ ఉంచుతారు. కనుమునాడు పశువుల్ని అలంకరించే అచారం వీళ్ళకు ఉన్నట్లులేదు. ఆలగాజనం మాత్రం, ఆవేళ తిని, తాగి సంతోషపడడంకద్దు.

తెలంగాణా ఆచారాల్లో, కర్నాటక మహారాష్ట్రిల ఆచార ప్రభావం కనిపిస్తుంది. కోస్తాజిల్లాలలోని భోగిమంట గానీ, గొబ్బిళ్ళు పెట్టడంకానీ వీరికి అలవాటులేదు. కాని, భోగి, సంక్రాంతి దినాలలో, మూడుగానీ, ఐదుగానీ 'గొంతెమ్మ' లను (గొబ్బిళ్ళు)చేసి, వాటిని, పసుపూ కుంకుమా, గరికలతో అలంకరించి వాకిల్లో ఉంచుతారు. సంవత్సరంలోపు పిల్లలకు భోగినాడు సాయంత్రం పళ్ళుపోసే ఆచారాన్ని వీళ్ళు బోతపొయ్యడం అంటారు. కేవలం రేగుపళ్లూ, పైసలూ, మాత్రమేకాక, జీడిపళ్లూ, నవధాన్యాలు, కూడా వాటితో కలపడం యిక్కడి ఆచారం.కోస్తాజిల్లాలలో సంక్రాంతినాడు పొంగించే పాలను. ఇక్కడి వాళ్ళు భోగినాడే పొంగించడం కద్దు. ఆరు బయట సూర్యాభిముఖంగా పేర్చిన పొందాలికి ఎదురుగా ఒక పీటవేసి, పీటమీద రక్తచందనపు బొమ్మ (తిరుపతి చెక్కబొమ్మ) పెట్టి దానికి సువర్ణాభరణాలతో అలంకారముచేసి దాన్ని పూజిస్తారు. అక్కడ రక్తచందనపు బొమ్మకుగల ప్రాముఖ్యం విచారింప వలసినది. కాని, రథసప్తమినాడు ప్రతివాళ్లూ చేసే సూర్యపూజలో, సూర్య ప్రీతికి అర్పించే చందనం, రక్తచందనమే అయివుండాలని ఒకవాడుకఉంది. కాబట్టి సూర్యునికి, రక్తచందనానికి ఉన్న సంబంధం విచార్యం - కోస్తాజిల్లాల "పొంగలి" తోపాటు, ఈనాడు వీళ్లు, మహారాష్ట్రి కర్ణాటక దేశాచారాలవల్ల ప్రభావితులై, సజ్జలూ నువ్వులూ కలిపిన రొట్టెలు చేస్తారు. అన్ని రకాల కాయగూరలు కలగలిపి వండిన కూర చేస్తారు. వాటిలో వెన్నా, బెల్లమూ కలిపి భుజించాలనేది యిక్కడి ఆచారం. ఇక్కడి సంక్రాంతి మాంసాహారులకు, ఆ ఆహారం తప్పనిసరిగా భుజించే పండగ. కాని అదో విధిగా వీరు పప్పూ బియ్యం, కలిపి పులగం వండుకుంటారు. "కనుము" అన్నదాన్ని "కరి" అని వ్యవహరించడం కద్దు. దక్షిణాయనంలో ప్రజలకు కలిగిన పీడ పరిహారార్థమై

ఆ రోజున ప్రతివారు పసుపు పచ్చని వస్త్రాలు ధరిస్తారు. అనగా పసుపులో ముంచిన వస్త్రాలు ధరించాలని ఆ ఆచారం యొక్క ముఖ్యోద్దేశం. బహుశా కోస్తాజిల్లాలలో, ఇంటిముందు సున్నపుముగ్గు పరవడానికి, తెలంగాణాలో పసుపులో ముంచిన వస్త్రాలు ధరించడానికి కారణం ఒకటే కావచ్చునన్నది నా ఊహ. పసుపూ, ముగ్గూ రెండూ, క్రిమినాశక వస్తువులే - పల్లెటూళ్ళలో, ఆ రోజున పశువుల్ని బండ్లకు కట్టి "బండ్లు తరమడం" అనే వేడుక చేస్తారు. ఇది యించుమించు కోస్తాజిల్లాలలోని కోడి, పొట్టేలు, పందెములవంటి సరదా-

తెలుగు దేశానికి పొరుగు రాష్ట్రమైన మహారాష్ట్రంలో ఈ పండుగ చేసే పద్ధతి, మరో విధంగా ఉంటుంది. అక్కడ సూర్యుని అయనభేదాన్ని తెలిపే సూచన ఆ ఆచారాల్లో కనిపించదు. కేవలం వ్యావసాయికమైన పండుగగానే యిది జరుపబడుతుంది. భోగినాడు మంట వేసే ఆచారం ఇక్కడగానీ, కర్ణాటక తమిళ దేశాల్లోగానీ కనిపించదు ఈ పండుగనాడు, స్త్రీలు తమ సౌభాగ్యాన్ని అభివృద్ధి చేసుకోవడానికై చేసే పూజలూ, ఇచ్చే దానాలూ గమనింపవలసినవే. ప్రొద్దుటే తలంట్లు అయిన వెనుక స్త్రీలు కొత్త బట్టలతోపాటు, భోగినాడు, విధిగా కొత్త గాజులు కూడా ధరిస్తారు. స్నానం చేసేటప్పుడు నువ్వులు నీళ్ళల్లో వేసి కాచి, నువ్వుపిండీ, పసుపు కలిపి నలుగు పెట్టుకుంటారు. సాయంత్రం, నువ్వులూ, బెల్లమూ, చెఱకు ముక్కలూ, రేగుబండ్లూ, వేరుసెనగలూ, గాజర గడ్డా ఇవన్నీ కొత్తకుండలో పోసి మూతవేసి, తులసి కోట దగ్గర పూజచేసి, ముత్తైదువులకి ఇచ్చుకుంటారు.

సంక్రాంతినాడు నువ్వులూ బెల్లంతో కలిపిన "భక్ష్యాలు" చేసుకుంటారు. ఆరోజు సజ్జరొట్టె, కలగాయకూరా తప్పక తింటారు. ఈ కూరలో ఎన్ని కాయ గూరలు ఆరోజున కలపగలిగితే, వారికి అంత సంతానాభివృద్ధి కలుగుతుందనే నమ్మకం కూడ ఒకటి ఉన్నది. సంక్రాంతినాడు "లూటాయిచ్" అనే ఒక వేడుక వీరు చేసుకుంటారు. నువ్వులహల్వా, రేగుబండ్లూ, చెఱకు ముక్కలూ, వేరుసెనగలూ, కొబ్బరి ముక్కలు అన్నీ చేర్చి, వాటితోపాటు వారి వారి శక్త్యనుసారం, వెండి, ఇత్తడి, స్టీలు, కంచు పాత్రలలో ఏదైన ఒకటి పెట్టి తెలిసినవాళ్లందరికీ పంచుతారు.

బండ్లలో ఈ సామానంతా సర్దుకొని బహుదూర ప్రదేశాలకు కూడా పోయి యిచ్చిరావడం వీళ్లకొక వేడుక. ఎవరెక్కువ పంచగలిగితే వారికంత గొప్ప. కొత్తగా పెళ్లయిన పిల్లకు, వెండి గిన్నెలో నువ్వులు బెల్లం పెట్టి యిస్తారు. పెళ్లికొడుకు మెడలో, నువ్వుల నక్షత్రాలతో చేసిన హారాలు వేసి ఆనందిస్తారు. పిల్ల అత్తగారు, ఆరోజున నల్లనిచీర, లోపల నువ్వుల నక్షత్రాల వలె తెల్లగా మెరిసేచుక్కలు కలదాన్ని, తప్పక పిల్లకు ఇవ్వవలసి ఉంటుంది. ఈ రోజు ప్రతి ఒక్కరూ తమ స్నేహితులకు నువ్వులూ బెల్లం యిచ్చి "తిల్ గూడ్ గ్యా, అణ్ గోడ్ బోలా" అంటారు. అనగా, ఈ నువ్వులూ బెల్లం తీసుకుని, మధురమైన మాటలు చెప్పండి." అంటే స్నేహం మధురంగా ఎడతెగ కుండా ఉండాలని పరస్పరం జ్ఞాపకం చేసుకోవడానికి వీరు ఈ పండుగను ఎన్నుకున్నట్లు కనిపిస్తుంది. ఉత్తర హిందూదేశంలో ఇలా స్నేహాన్ని జ్ఞాపకం చేసుకునేరోజు వాళ్లకు హోలీ నాడు వస్తుంది. మహారాష్ట్రిలో "కరి"కి ప్రాముఖ్యం లేదు.

మైసూరు కన్నడిగుల ఆచారాలు కూడా ఇంచుమించు మహా రాష్ట్రా చారాలతో కలవడం జరుగుతున్నది. భోగినాడు వీరూ ముత్తైదువలకు వాయనా లిస్తారు. కాని, ఆ వాయనాలు కొత్తకుండలలో కాకుండా, చేటలలో పెట్టి యివ్వడం యిక్కడి ఆచారం, మహారాష్ట్రిలు చేసే "లూటాయిచ్" కి ప్రతిగా వీళ్లు "ఎళ్‌బీరు" అన్న వేడుకను చేస్తారు. "ఎళ్‌బీరు" అనగా నువ్వులు పంచడ. నువ్వులూ, బెల్లం, చక్కెర అచ్చులూ, వేరుసెనగ, అన్నీ కలిపి భగవన్నివేదన అయిన వెనుక, వాటిని, ఎండు కొబ్బరి చిప్పలలో ఉంచి,ప్రతి వారికీ పంచుతారు. ఈ చిప్పలపైని నల్లని పొర గీరివేసి, పైభాగంలో రకరకాల బొమ్మలూ, లతలూ చెక్కి చక్కగా తీర్చి మరీ పంచుతారు. వీరిలో శక్తికలవాళ్లు చిన్న పాత్రలను చేర్చడం కూడా కద్దు - వీళ్లకు కూడా భోగినాడు సాయంత్రం పళ్లు పొయ్యడం ఉంది. దీన్ని వీళ్లు "హళ్లిరె" అంటారు. మానికకు పసుపు, ఎఱ్ఱమన్ను, పూసి, లోపల మరమరాలు, రేగుబళ్లు, చెఱుకుముక్కలు, హరిబూట్, రాగినాణేములు కలిపి పోసి, ఆ మానికతో పిల్లల తలపై వాటిని గుమ్మరించడం వీరి ఆచారం.

తెలంగాణా ప్రాంతాలకు చెందిన కన్నడిగులు, మైసూరియన్లకంటే విభిన్నంగా భోగినాడు, సజ్జరొట్టెలూ, కలగలుపు కూరా, చెయ్యడం బహుశా మహారాష్ట్రాచారాన్ని బట్టి వచ్చి ఉండవచ్చు. వాళ్లలాగే సంక్రాంతి నాడు నువ్వులూ బెల్లం కలిపి భక్ష్యాలు చేస్తారు. "కుసురెలె (నువ్వుల నక్షత్రాలు)తో హారాలు చేసి నవ దంపతుల్ని అలంకరిస్తారు.

తమిళ దేశంలో, భోగిమంటలేదు. సంక్రాంతి రోజున, చెఱుకు మొక్కలనూ, అరటి పిలకల్నీ సూర్యకాంతిలో నిలబెట్టి పూజచేసి పొంగలివండుతారు. కనుమునాడు మూడు రకాల అన్నాలు చేసి బయట పెట్టి జంతువులకూ, పక్షులకూ ఆహారం పెడ్తారు. మున్యాశ్రమాలలో నీవారాన్న పిండతతుల్ని భూతబలిగా వాకిటి ముందుపరిచే ఆచారపు ఛాయలు ఈనాడు వీళ్లు అర్పించే యీ అన్నపు ముద్దలలో కనిపించగలవు - బ్రాహ్మణకుటుంబాలలో, సంక్రాంతినాడు. పెద్దలకు తర్పణా లిచ్చే ఆచారం కనిపిస్తుంది. ఆ రోజు కందిపప్పు వండరు. బ్రాహ్మణులకు కూష్మాండ దానం విధిగా ఇస్తారు. బ్రాహ్మణ కుటుంబాలలో స్త్రీలు భోగినాడు కలశస్థాపన చేసి గౌరీపూజ చెయ్యడం కద్దు. మూడు రోజులు పూజించిన మీదట, గౌరిని, కనుమునాడు. ఉదక ప్రదేశానికి కొనిపోయి నీళ్లల్లో వాల్లాడించడం వీళ్ల అచారం. పైన సర్వసామాన్యంగా, కనుమునాడు. జంతు ప్రీత్యర్థం పచరించే బలిక్రియను, బ్రాహ్మణ కుటుంబాలలోని స్త్రీలు కొంత పెద్ద యెత్తున జరుపుతారు. సంక్రాంతినాటి రాత్రి అన్నంవండి అందులో పాలు పోసి, తోడుపెడ్తారు కనుమునాడు సూర్యోదయానంతరం. ఇంటిముందు శుభ్రం చేసి గుమ్మడిఆకులు పరుస్తారు. ఆ ఆకుల చుట్టూ ఇంటి ఆడపడుచులైన పుణ్యస్త్రీలు చేరి ఒక్కొక్కరూ మూడేసిముద్దలు చేసి ఆకులమీద పెడ్తారు. అలా పెట్టేముందు, అందరికంటే పెద్ద ముత్తైదువ తన మంగళ సూత్రానికి పసుపు రుద్దుకుంటూ పుట్టింటికీ మెట్టింటికీ శుభం జరగాలి అంటూ ఆమాట అందరిచేతా అనిపిస్తూ ఈ ముద్దలు పెట్టిస్తుంది. వాళ్లు పెట్టిన ముద్ధలు కాకులు ముట్టుకున్నాక అందరూ వెళ్లి తలారా స్నానంచేసి నిత్యకృత్యాల్లో ప్రవేశిస్తారు. ఈ తంతు సాధారణంగా, ఆడపిల్లలు, తమ పుట్టింటిలో జరుపుతారు. తలిదండ్రులు, వాళ్లకు తప్పక బట్టలు పెట్టి తీరాలి - ఈ వేళ అన్నీ రకరకాలైన అన్నాలు. అనగా,

చిత్రాన్నం, పెరుగన్నం, పొంగలి, పులగం వంటివి వండుతారు. చారు కాయరు. ఆడపిల్లలు, ఆనాడు చారూ అన్నం తింటే. అన్నదమ్ములకు మంచిది కాదనే వాడుక ఒకటుంది. దీనివెనుక నున్న సబబేమిటో విచారించవలసిన అంశం - ఈ రకరకాల అన్నాలను, ఆవేళ సాయంత్రం పెద్దపెద్ద గిన్నెలలో సర్దుకుని, ఏటిగట్టుకో, చెరువుగట్టుకో వెళ్లి, అక్కడ అందరూ భుజించి, చీకటిపడ్డవెనుక ఇళ్లు చేరుకుంటారు. రోజూ అన్నాలు ఇంట్లో తినే అలవాటుకంటే ఆహ్లాదం కలిగించేయీ మార్పుతో నవీనకాలపు "పిక్‌నిక్"ల ఛాయలున్నవని చెప్పవచ్చు- మళయాళదేశంలో ఈ సంక్రమణం చేస్తారో చెయ్యరో తెలియరాలేదు. మనకు సంక్రాంతెలా వ్యావసాయికపుపండుగో, వాళ్లకు ఓణమ్ అటువంటిది- క్రైస్తవమత ప్రభావం ఎక్కువగా పడ్డ ఆ దేశస్థులలో, హిందువుల పండుగల స్వరూప స్వభావాలు మరొకరకంగా ఉండడానికి అవకాశం ఉంది.

ఉత్తర హిందుస్థానంలో కూడా ఈ పండుగ చేయడం కద్దు. కాని సూర్యదేవుడి ఆయన క్రమాన్ని తెలియజేసే, సూచనలు అక్కడలేవు. హోమాగ్నిని రగిల్చి. ఇంట్లో ఉన్న మగపిల్లల్ని ఆ అగ్నిచుట్టూ కూర్చుండపెట్టడం వాళ్ల ఆచారం. బహుశా మన భోగి మంటలో ఆ ఛాయలు ఉన్నవేమో! ఆడపిల్లలు సంతోష సూచకంగా, అప్పుడు పాటలు పాడి నృత్యం చేస్తారట చూడవచ్చినవారి కందరికి చెఱకుపానకం ఇచ్చి, నువ్వులతో చేసిన మిఠాయి పంచుతారట. అయితే అక్కడఉన్న వివిధ ప్రాంతాల జనులలో ఈ ఆచార వ్యవహారాలు ఎటువంటివో, గమనించిన మీదటగాని, వాళ్లు ఈ పండుగను ఏ విధంగా భావించి, జరుపుకుంటున్నారో చెప్పడం కష్టం. హోమాగ్ని వెలిగించడం, మగపిల్లలను "పెద్దచెయ్యడం," అనే యీ ఆచారాలలో మన భోగి మంటలూ, భోగిపళ్లు పోయడం వంటి ఆచారాల ఛాయలు తొంగి చూస్తున్నాయనక తప్పదు. ఇవన్నీ బహు పరిశీలన మీద చర్చించి నిర్ణయింప వలసిన విషయాలు.

ఇన్ని రకాల ఆచారాలు పరిశీలించిన మీదట "సంక్రాంతి" పండుగను గూర్చిన అంశాల నిలా సమీకరించుకోవడానికి వీలు పడు తున్నది. అవి

1. ఇది, దేశం మొత్తంమీద వ్యవసాయదారులకు ప్రధానమైన పండుగగా జరుపబడుతున్నది.

2. ఆయా ప్రాంతాలలో కొత్తగా పంట దిగి యింటికి వచ్చిన వస్తువుల్ని సంక్రాంతివేళ వినియోగించడమూ, నలుగురికీ, పంచుకోవడమూ జరుగుతున్నది ఆంధ్ర ప్రాంతాలలో కొత్త బియ్యమూ, బెల్లమూ, కన్నడ మహారాష్ట్రలలో సజ్జలూ, బెల్లమూ, నువ్వులూ ఇందువల్లనే యీ పండుగ వేళ ప్రాముఖ్యాన్ని వహిస్తున్నవి. ఇవేకాక, ఈ కాలంలో దొరికే చెఱకూ, రేగుబళ్లు, హరిబూట్, వేరుసెనగలూ, జీడిపళ్ళూ వంటి వస్తువులు గూడా యీనాడు ప్రాముఖ్యాన్ని పొందుతున్నవి. నువ్వులు బాగా పండే మహారాష్ట్రాది దేశాలలో, ఈ రోజున వాటినే ప్రధానంగా స్వీకరించి, "సంక్రాంతి"ని "తిల్ సంక్రాంతి" అని వ్యవహరించడం కూడా జరుగుతుంది. "నువ్వులు" ఉష్ణాన్ని కలిగించే ద్రవ్యవిశేషమవడంవల్ల, చలికాలంలో వచ్చే యీ పండుగనాడు వాటి ప్రాధాన్యాన్ని గుర్తించడం ఎంతైనా సమంజసం. కాని కోస్తా జిల్లాలలో 'నువ్వులు' ఒక విధంగా నిషిద్ధద్రవ్యం, నువ్వులు దానం పట్టేవాడు దొరకడం అరుదు. శ్రాద్ధ దినాలలో తర్పణం విడవడానికి పనికివచ్చే నువ్వులను పండుగల్లో వాడడానికి వాళ్లు సాహసించరు. అందుకే వాళ్ల సంక్రాంతిలో నువ్వులకు ప్రాధాన్యం ఇవ్వడం జరగలేదు. మహారాష్ట్రులు అతి ఆప్యాయంగా "తిల్ గూడ్‌గ్యా" అని యిచ్చే నువ్వుల హల్వాను, అతి చాదస్తులైన, ఆంధ్రప్రజలు ప్రీతితో స్వీకరించడానికి సంకోచిస్తారేమో అనుకొనడంలో విప్రతిపత్తి యేమీలేదు.

3. చలికాలంలో వచ్చే యీ పండుగ నాడు చలిని పారద్రోలే "మంటలు" వేసుకునే ఆచారప్రాముఖ్యం గుర్తింపదగిందే. కాని చలి ఎక్కువగా ఉండే ఉత్తర హిందూస్థానం నుండే, ఈఆచారం దక్షిణానికి దిగుమతి అయిఉండవచ్చు ననుకోవడానికి దక్షిణంలో ఈ ఆచారానికి ఉన్న వైరళ్యం ఒక కారణంగా చూపించవచ్చు.

4. ధనధాన్య సమృద్ధితో యజమాని తులతూగే రోజుల్లో వస్తున్న యీ పండుగనాడు, ఇంటి పిల్లలు పండ్లు పోసుకొని ఆనందించడమూ, ఇంటి

యిల్లాండ్రు సుమంగళ ద్రవ్యాలను తమ శక్తి కొద్దీ నలుగురికీ పంచుకోవడమూ విడ్డూరం కాదు.

5 పంట పండించి, యజమాని కొరకై శ్రమించిన పశుజాతిని మర్చిపోకుండా రైతు వాటి యెడల తన కృతజ్ఞతను చూపుకోవటమే, కనుము నాటి ఆచారంగా మారిన దనవచ్చు. కేవలం వ్యావసాయికావసరాలకు పనికివచ్చే పశువులయెడనేగాక, ప్రజాసామాన్యం, జంతుసామాన్యం మీద తమకుగల దయా విశేషాన్ని చూపించడాన్ని తమిళనాడు "కనుము" నాటి ఆచారాలలో గుర్తించవచ్చు.

ఈ రకంగా ఈ ఆచారాలన్నీ "సంక్రాంతి"ని వ్యావసాయికమైన పండుగగానే రూఢి చేయగలుగుతున్నవి. శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేసినట్లుగా అయన భేదాన్నీ, దేవయాన ప్రాశస్త్యాన్నీ గుర్తుంచుకొని యీ నాటి ప్రజలీ పండుగను చేస్తున్నారనడానికి వారి పండుగ నాటి ఆచారాలలో అటువంటి సూచనలు లేవు. ఒకప్పుడున్నా అవి ఏనాడో మఱుగున పడిపోయినాయనడానికి ఇంత చర్చించిన మీదట నేను సాహసిస్తున్నాను.

జనవరి 1965 ఆంధ్రప్రదేశ్.

# పల్లె ప్రజలు - పండుగలు

జానపదులు చేసుకునే పండుగల్ని పరిశీలిస్తే అద్భుతమైన విషయాలు ఎన్నో వెలుగులోనికి రాగలవు. సాధారణంగా ప్రతి హైందవుడూ నిర్వహించే ఉగాది, సంక్రాంతి, దసరా, దీపావళి, నాగులచవితి, వినాయక చతుర్థి వంటివి కాక, ఇవి కేవలం జానపదులకు మాత్రమే పరిమితాలై, ఒక విశిష్టతను సంత రించుకునేవిగా కనిపిస్తాయి. ఈ పండుగలకూ, వాళ్లు నమ్మి కొలిచే దేవతలకూ ఆ దేవతలపట్ల నెరిపే ఆచారాలకు, అవినాభావ సంబంధం కనిపిస్తుంది.

ఆ మాటకొస్తే ఏ పండుగా, ఏ ఉత్సవమూ, దేవతా స్పర్శలేనిదే జరగ దన్నది ఏజాతి పండుగల్ని పరిశీలించినా తెలిసేవిషయమే. వీటిల్లో ఒక దేవతను పూజించడమో, ఒక వీరుణ్ణి ఆరాధించడమో, అవతారమూర్తి అయిన వాడి ఘన కార్యాలను స్మరించడమో, పుట్టుకను గర్తుకు తెచ్చుకోవడమో, తప్పక జరిగి తీరవలసినవే. కేవలం వ్యవసాయానికి సంబంధించిన చర్యల్ని ప్రారంభించే పండగల్లో నైనా, భగవంతుణ్ణి అర్చించడమనేది అంతర్గతంగా పూసల్లో దారం మాదిరిగా కనిపిస్తూనే ఉంటుంది. దీపావళికి టపాసులు కాల్చడం, హోలీకి రంగునీళ్లు చల్లుకోవడం, శ్రీకృష్ణాష్టమికి ఉట్లు కొట్టడం, వంటి క్రీడాత్మకమైన ఆచార కాండకంటే ముఖ్యంగా దాని వెనక దాగునిఉన్న దైవారాధన పద్ధతి స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది.

జానపదుల పండుగల్లో కూడా ఈలక్షణం పరిపూర్ణంగా ఉంది. జానపదులకే పరిమితంగాఉన్న ఈ పండుగల వెనక, దేవతలను ప్రీతుల్ని చేసుకోవలసివచ్చే అవసరం స్పష్టంగాఉంది. దసరా, దీపావళి అనేవి ఒకే నిర్ణీతమైన రోజున చాంద్రమానం ప్రకారం జరిగేపండుగలు కాని జానపదుల పండగలు అలా కావు. దాదాపు సంవత్సరంలోనో, అయిదు, మూడు, ఏడు, అట్లా కొన్ని సంవత్సరాల వ్యవధానంలోనో, ఇవి జరగవచ్చు. సాధారణంగా జనుల్ని, పశువుల్ని, గాయీ, గత్తరా, పీడించినప్పుడు, ఊరికేదయనా రుగ్మ రూపమైన

అరిష్టం కలుగుతున్నదన్న శంకతోచినప్పుడు, వర్షాభావంవల్ల జనం కష్టాల పాలవుతున్నప్పుడు, ఈ పండుగల ప్రాముఖ్యం తలయెత్తుతుంది. అనగా దేవుణ్ణి పూజించి, ప్రీతుణ్ణి చేసుకోవడం, లేదా దేవత యొక్క కృపాదృష్టిని తన వైపుకు త్రిప్పుకోవడంయొక్క అవసరాన్ని అప్పుడు గుర్తించగలుగుతారు జానపదులు.

ఇటువంటి ఉద్దేశ్యంతో ప్రారంభించే వాటిల్లో జానపదులు ముఖ్యంగా గుర్తించి గౌరవించేది జాతర. దీన్నే "పరస" అనడం కూడా కనిపిస్తుంది. ఈ పరస అనే పదాన్ని పాల్కురికి సోమన, శ్రీశైలయాత్రోత్సవ పరంగా వాడడం జరిగింది.

ఎన్నో జానపద గేయాల్లో ఈ పదం, కేవలం అమ్మవారి జాతరకు మాత్రమే వాడటం జరిగింది.

"ఈదెమ్మ కథ" అనే ఒక జానపద కథా గేయంలో, పరస వర్ణన చాలా విశదంగా వివరింపబడింది. దేశదేశాలవారు, దవన పున్నమనాడు, మాహు రమ్మను కొలవడానికై పసిడి పావనాలు, ముద్రగదలు. పట్టుకుని బయలుదేరారు ఎక్కడచూచినా పటాల పందిళ్ళు వెలిశాయి. జమిడికెల్ని వాయించే బైనీండ్లు, మనస్సుకు గుబులు పుట్టించే లాగా తిరగసాగారు. పోతురాజుల ఆటోపం ఎక్కువగా కనిపించింది. కొల్లునెక్కి ఆడేవారు, దీవెలవారు, గావులవారు, బారు కటార్లు ధరించినవారు, పగ్గాలు పట్టుకున్నవారు, సిడెలెక్కి ఆడేవారు, ఎక్కడచూచినా కనిపించసాగారు. అమ్మవారి ప్రీతి కోసమై కుతికన అంపాలు జోపుకున్నవారు, గుండెల్లో గాలాన్ని దిగవేసుకున్నవారు, నాలుక మడిచి ఇనప కొక్కెలు తగిలించుకున్న ధీరులు, నడి నెత్తిన కొర్రులు తార్చిన వీరభక్తులు, నేల యీనినట్లుగా ఎక్కడబడితే అక్కడ ప్రత్యక్షం కాసాగారు. వీరికి తోడు, భేరీ ఢమామీలు, బిరుదు మద్దెలలు, బూరగొమ్ములు, ఢక్కలు, తప్పెట్లు, సింగి నాదాలు, చిటుతపీణెలు, జేగంటలు, చేపిడి గంటలు, రుంజలు, జమిడికెలు ఇవన్నీ భోరున మ్రోగసాగాయి. ఇటువంటి వాతావరణంలో,

"సొక్కుచు సోలుచు తూలి యాడుచును
తక్కుచు తమలోన తావు దప్పకను

నిక్కుచు నీల్గుచు నిగిడి రేణుకకు
మ్రొక్కుచు నంతంత మొనసి యాడుచును
దాటుచు నెగయుచు విరసంబు లేక
వీరు వారనుచును విరసంబు లేక
ఉబ్బుచు మాతంగు "లుద్ధా యనంగ
కోటాను కోట్లుగా కుంకుమాడుచును"

వీరభక్తులు ఉత్సవంలో పాల్గొన్నారని ఆ వర్ణన విపులంగా చెప్తుంది.

పల్లె పట్టుల్లో జరిగే ఏ జాతర చూచినా, పై వర్ణనకు చాల చక్కగా సరి పోయే విధంగానే కనిపిస్తుంది.

సర్వసాధారణంగా, ఊరిలో గత్తర చెలరేగినప్పుడు, ఇటువంటి "కొలుపులు" చేయడానికి తప్పకుండా పూనుకుంటారు జనం. అప్పుడు ఊరు మొత్తం, ఇంటికింతింత అని 'చందా' వేసుకుని, ఆ డబ్బుతో బలిపశువును కొంటారు. దీన్నే "పోతు బోనము" అనడం కద్దు. ఇదికాక ఎవరిశక్తి ననుస రించి వారు "యాట"నో (పొటేలు) కోడినో కూడా విడివిడిగా సమర్పించు కోవడం కద్దు. గ్రామదేవత కొలువులు సాగించాలనే నిర్ణయం తీసుకున్న తర్వాత ఊరంతటికి ఆ వార్తను "టముకు" ద్వారా వెట్టివాడు చాటి చెప్పడం జరుగుతుంది. గ్రామ మధ్యంలో ఒక కలశాన్ని స్థాపిస్తారు. దీన్నే "పురము వెయ్యడం" అంటారు. ఆ తర్వాతనే గ్రామదేవత ప్రతిష్ఠాపన అక్కడ జరుగు తుంది. ఊరివారంతా దేవికి బోనాలు చెల్లిసారు. బోన మనేది, "భోజన" శబ్దానికి వికృతి. రంగు రంగులుగా పువ్వులూ గీతలూతీర్చి దిద్ది అలంకారం చేసిన "పూజుకుండ"ల్లో ముందు రోజున ఈ అన్నాన్ని వండుతారు. ఈ కుండనే చద్ది కలశమని అనడంకూడా ఉంది. దానిమీద మరో చిన్న ముంత ఉంచి, ఆ ముంతలో పానకం పోస్తారు. దాన్ని 'కడుముంత' అంటారు. కడు ముంత మీద చిన్న మూకుడును మూతగా పెట్టి, అందులో నూనెపోసి వత్తి వేసి జ్యోతిని వెలిగిసారు. ఈ మూకుణ్ణి 'కంచుడు' అని పిలుస్తారు. స్త్రీలు చక్కగా అలంకరించుకుని, ఈ దొంతిని పదిలంగా నెత్తిమీద కుదురుగా నిలుపుకుని

దేవతను ప్రతిష్ఠాపించిన చోటికి తీసుకువెళ్తారు. ఒకముంత కల్లుగాని, నీళ్ల గాని అమ్మవారి ముందు వారబోసి ఈ బోనాల్ని ఆమెకు నివేదిస్తారు. ఈ రకంగా నీటిని వారబొయ్యడాన్ని "సాక" అంటారు.

పోతుబోనం చల్లించడానికి చాలా తతంగం ఉంది. ఊరంతా కలిసి ఉమ్మడిగా జతచేర్చిన బియ్యాన్ని వండి అమ్మవారిముందు కుంభం పోస్తారు. పూజారి లేదా వేల్పులోడు బలి ఖడ్గాన్ని పూజిస్తాడు. బలియిచ్చే పశువును శుభ్రం చేసి దానికి కుంకుమ మెత్తి, పూలదండలు చుట్టి, అలంకారాలు చేస్తారు. పోతు అంగలోపం లేనిదై, రోగగ్రస్థం కానిదై, ఎటువంటి అవకరాలు లేనిదై, ఉండడం అవసరం. దాని కొమ్ములుగూడా వంకరలు తిరిగినవి కాకుండా ఉండాలి. ఆ పోతును పూనకం పొందిన పోతరాజు గావు పట్టుపట్టి చంపవచ్చు అనగా నోటితో మెడకొరికి చంపడం లేదా, మద్దు కత్తితో ఒక్క ఏటుకే తల తెగిపడేటట్లుగా నరకవలసి ఉంటుంది. అట్లా నరికింతర్వాత దానిరక్తాన్ని కుంభం మీద చల్లాలి. ఆ రక్త సిక్తమైన అన్నాన్ని ఛేటలతో ఎత్తుకొని యువకులూ, బలిష్ఠులూ అయిన సాహసులు, ఊరంతా అన్ని వీధులలోనూ చల్లి రావాలి. అన్నంమెతుకులు ఎక్కడెక్కడ పడతాయో అక్కడక్కడల్లా ఏవిధమైన రోగాలు, ఈతి బాధలు లేకుండా జనులు సుఖసంతోషాలతో వర్ధిల్లుతారని జానపదుల విశ్వాసం.

ఇట్లా "పొలిఅన్నం" ఎత్తుకపోతున్నప్పుడు పరాయి ఊరువాళ్లెవరైనా వచ్చి. ఆ అన్నాన్ని పొలిమేర దాటించి తమ ఊరికి తీసుకుపోతే, ఈ బలివల్ల జరగనున్న శుభమంతా అవతలి ఊరికే చెందుతుంది. అందువల్ల అవతలి ఊరి వాళ్లను ఆ సమయంలో, ప్రసాదం తీసుకుపోకుండా బలమైన మెరికల్లాంటి యువకులు సర్వసన్నద్ధంగా ఉంటారు. అట్లా రేగిన కలహాల్లో ఒకరినొకరు ప్రాణాలు తీయడానికైనా వెనుదీయరు. అట్లా ఎవరినైనా ఒకరు చంపినా అది హత్యగాపరిగణింపబడదు.

బలియిచ్చి జంతువును ఈ విధంగా జాతర చెయ్యడాన్ని రాయలసీమలో "పెద్దేవర చెయ్యడం" అంటారు. ఆజంతువు దబ్బలను (Liver) పళ్ల మధ్య

కరచుకుని ఊరుచుట్టూ తిరిగి వస్తాడు ఊరి మాదిగవాడు. ఆ చర్యవల్ల కలరా, మసూచి మొదలైన వ్యాధులేవీ సోకవని, పశువులకు గూడా గాలి సోకటవంటి ఉపద్రవాలురావనీ, జానపదుల నమ్మకం. ఈ రకంగా చెయ్యడాన్ని ఊరు బాగుచేయడం అని వ్యవహరిస్తారు.

బలిక్రియ ముగిశాక రంగ మెక్కడం అనే మరో చిత్రమైన కర్మకాండ కనిపిస్తుంది. ఆవంలో కాల్చని పచ్చికుండను మెడదాకా భూమిలో పాతిపెట్టి మీద కొత్తచేటను పెట్టి, దానిమీద ఎక్కి, పూనకం పొందిన వేల్పులోడు జనుల భవిష్యత్తును ఊరి బాగోగులను వివరిస్తాడు.

ఊరికి సంబంధించిన వీరుల సాహసకార్యాల్ని స్మరించేటప్పుడు కూడ ఇటువంటి ఉత్సవాలు జరుగుతాయి. పల్నాటి సీమలో వీరులను ఏడాదికొకసారి పూజించే ఆచారం ఉంది. పల్నాటి యుద్ధంలో చనిపోయిన వారికొరకై కృతజ్ఞతా సూచకంగా జరిగే ఉత్సవం ఇది. ఆ సీమ అంతటా వీరుల స్మృతి చిహ్నాలుగా చేతులో ఖడ్గం ధరించి గుఱ్ఱమెక్కి యుద్ధం చేస్తున్నట్లుగా మలచిన పెద్ద పెద్ద రాళ్ళు కనిపిస్తాయి. వీటిని వీర కల్లులని వ్యవహరిస్తారు. పల్నాటి సీమలోని ఈ వీరోత్సవాలు ఆరు రోజులపాటు జరుగుతాయి. అప్పుడు పల్నాటి యుద్ధపు కథ అంతా ప్రసక్తమవుతుంది. ఇరుపక్షాలవారిని పిలువనంపడం, రాయబారం, యుద్ధ భేరులు మ్రోగించడం, మొదలైన యుద్ధనటనం జరిపి, ఆరో రోజున భూత తృప్తి కోసమై బలికాండను యథావిధిగా జరిగించి, రక్తం కలిపిన అన్నాన్ని సమర్పించడం జరుగుతుంది. ఎక్కువ ఆసక్తితో 'గుత్తి కొండ బిలం దగ్గర జరిపే ఈ వీరారాధనోత్సవం ఆంధ్ర దేశంలో మిక్కిలి ప్రఖ్యాతి వహించింది. ఇటువంటిదే దొనకొండ దగ్గర జరిగే గంగజాతరకూడా. ఆ సమయంలో ఆరాధింపబడేది యుద్ధంలో హతులైన వీరులే.

8. సతీ కల్లులు

గ్రామ దేవతల్లో అసంఖ్యాకులైన దేవతలు, మొదట పేరంటాళ్లే పొదిలెమ్మ, కనకమ్మ ముండ్ల మూడెమ్మ, కళగోళమ్మ సారక్క. సమ్మక్క మొదలైనవారంతా తొలుత భూమిమీద పుట్టినవ్యక్తులే! వీళ్లచుట్టూ ఉన్న కథల్ని

చూస్తే ఇందులో అందరూ బలవన్మరణానికో, వీరోచిత మరణానికో పాల్పడ్డ వారు. బెజవాడ కనకదుర్గమ్మ ఏడుగురు అన్నదమ్ముల కొకతే చెల్లెలు. ఆవిడను అనుమానింపగా ఆవిడ నూతిలో పడి చచ్చిపోయి కనకమ్మ అనే పేరుతో శక్తిగా వెలిసింది. అలాగే పొదిలిలో వెలసిన పొదిలెమ్మ కూడా! కామమ్మ అనే స్త్రీ తన భర్త చనిపోగా అతనితోపాటు సహగమనం చేసి చితి గుండంలోనుండి ఎఱ్ఱతామరపూవై వెలసింది. మరో స్త్రీ మండపేట పాపమ్మ, భర్తతో సహగమనంచేసి పామై తన పినతండ్రిని ప్రబోధించి వెలసింది. అలాగే వీరరాజమ్మ అనే సాహసురాలైన స్త్రీ శత్రువుల్ని చంపి సతియై వెలిస్తే, లక్ష్మమ్మ అనే మరో పతివ్రత భర్త చేతుల్లో మరణించి దేవతగా మారింది. ఇలా స్త్రీలు పేరంటాళ్లుగా, దేవతలుగా మారి, ప్రజలచేత ప్రతియేడుగానీ, లేక మూడేసి, ఐదేసి సంవత్సరాలకుగానీ కొలుపులందుకోవడం జానపదులు అటువంటి కొలుపుల్ని మిక్కిలి ఉత్సాహంగా, భక్త్యావేశాలతో, పండగల్లా జరుపుకోవడం కనిపిస్తుంది.

ఈ ఉత్సవాల్లో కూడా మొక్కులు చెల్లించుకునేవారు, నైవేద్యాలర్పించే వారు, బలుల్ని సమర్పించేవారూ అగ్ని గుండాలు తొక్కేవారు. సిడులు ప్రేలే వారూ ఉంటారు. ఈ రకంగా స్త్రీలు, దేవతలుగామారి, ఆ దేవతా చిహ్నాలుగా ఏర్పడ్డరాళ్లను "సతీ కల్లు"లు అని వ్యవహరించడం కనిపిస్తుంది.

ఈ దేవతల జాతరల్లో కొన్ని చోట్ల అమ్మవారి విగ్రహానికి చక్కగా అలంకారం చేసి, చీరె కొంగులో నిప్పులు మూట కట్టడం, అమ్మవారిని అగ్ని తోరణం కిందనుండి ఊరేగించడం ఉంది. అల్లా నిప్పులు మూటకట్టే చీరకొంగు కాలదు. గడ్డి బొద్దుల్ని వెలిగించి రెండు కొయ్యలకు తోరణంగా కడ్తే అమ్మవారు ఆ తోరణం కిందనుండి సాగిపోయేవరకూ ఆ గడ్డి బొద్దు ఎంత సేపటి కింద వెలిగించిందయినా నుసికాకుండా అలా వెలుగుతూనే ఉంటుంది. అట్లా జరిగితేనే ఆ దేవత సత్యం ప్రకాశమైనట్లు. ఎప్పుడూ ఈ రకమైన జానపదుల నమ్మకాలు వమ్మయ్యే సంఘటనలు జరగవు. మనం వివరించలేని మహత్తు మనకళ్ల ఎదురుగుండా కనిపిస్తూనే ఉండడం అద్భుతదాయకంగా ఉంటుంది.

కొన్నిచోట్ల, జాతరల్లో, సిడులు వ్రేలుతామని మొక్కులు మొక్కే వారుంటారు. సిడి అనేది రకరకాలుగా ఉంటుంది అందులో గాలం సిడి అనేది ఒకటి, గంపసిడి అనేది ఎరొకటీ, ఇట్లా ఎన్నో రకాలు. పెద్ద పొడుపైన స్తంభంపాతి దాని చివరన బలమైన త్రాటికి సూదిమొన కలిగిన గాలపు కొక్కేన్ని కప్పీలమీద అమరుస్తారు. ఈ సిడి వ్రేలడానికి మొక్కులు మొక్కుకున్న వాడు శుచియై, పువ్వులూ, కుంకుమా మొదలైనవి ధరించి, స్తంభం మొదటికి రాగానే, అతని వీపున ఈ గాలపు కొక్కేన్ని గుచ్చి, కప్పీ సహాయంతో స్తంభం చివరి దాకా లాగుతారు. అంత ఎత్తున అతడు కేవలం వీపున గుచ్చబడిన ఆ గాలపు ముల్లే ఆధారంగా గాలిలో స్తంభం చుట్టూ తిరుగుతూ, బాధను సహిస్తూ, నవ్వుతూ, అదపాదడపా చుట్టూ ఉన్న జనసమూహం మీదికి పువ్వులు విసురుతూ ఉండాలి. ఆలా పడిన పువ్వుల్ని ఏరుకుని ఇంట్లో దాచుకుంటే, ఆ ఇంటికి ఎటు వంటి అరిష్టాలూ సోకవని జనంలో ప్రబలమైన నమ్మకం ఉంది. గంప సిడి దీని కంటే సౌమ్యమైంది. మొక్కుకున్నవాడు కొక్కేనికి గుచ్చుకుని వేలాడకుండా కేవలం గంపలో కూర్చుని, అంత ఎత్తున చుట్టూ తిరుగుతుంటాడు ఈ రకంగా మొక్కులు చెల్లించడమేకాక, కొందరు కంటిరెప్పలకూ, పెదాలకూ, చెవులకూ సూదులు గుచ్చుకుని బాధను సహిస్తారు. మరికొందరు, ఆ సూదుల చివర దూదులు చుట్టి, తైలంలో ముంచి, జ్యోతిని వెలిగించి, తామే జీవద్దీపాలుగా వెలుగుతారు. ఈ రకమైన బాధా సహన కారకాలైన చర్యలన్నీ జానపదులసొత్తు. అవి ప్రత్యేకంగా దేవతను ఆరాధించి, కొలుపులు కొలిచే ఉత్సవాల సమయంలో విరివిగా ప్రదర్శితమౌతుంటాయి.

**వ్యావసాయికమైన ఉత్సవాలు :-** జనపదాల్లో నూటికి తొంభై మంది వ్యావసాయి కులు. అందువల్ల తొలకరి సమీపించగానే, దుక్కిదున్ని, నారు పోసి ఊడిచి, పెంచి, పంటపండించి, పంటనింటికి తీసుకు పోయేంతవరకు కొనసాగే సర్వవిధా లయిన వ్యావసాయికపు పనులూ పల్లెజనులకు మిక్కిలి ఇష్టాలైనవి. ముఖ్యంగా వానాకాలపు తొలి రోజుల్లో, భూమి సాగును ప్రారంభించడం ఒక పండుగగా వాళ్లు ఆచరించడంలో అసామంజస్యం లేదు. ఇదే "ఏరువాక పున్నమి. ఏరు అనగా నాగలి. నాగలియొక్క తొలిసాగుదల అనే అర్థంలో ఈ ఉత్సవానికి ఈ పేరు వచ్చింది.

ఆరోజు రైతులు, నాగలినీ, కాడినీ, ఎడ్లనూ, అలంకారం చేసి పూజ చేస్తారు. పశువుల్ని కావలి వాడు లేకుండానే ఊరిబయటికి మేపుకై తోలేస్తారు. అలా తోలినపుడు ఆ పశువులు ఏ మెకం బారిన పడకుండా సురక్షితంగా తిరిగి వస్తే అది శుభసూచకం. అలా వెళ్లేటప్పుడు అవి గోగునారతో కట్టిన తోరణాల గుండా వెళ్లాలి. అవి తిరిగివచ్చాక ఆ తోరణాల్ని నుగ్గు నుగ్గు చేసి, గోగు పీచును తలాకాస్త ప్రతిరైతూ ఇంట్లో దాచుకుంటాడు. దానివల్ల శుభం కలుగు తుందని అతని నమ్మకం- కొన్నిచోట్ల పశువులకు పులగం వండి పెడతారు. ఆ రోజున పొంగళ్లు పెట్టుకుని ఇంటిల్లపాదీ ఆరగిస్తారు. ఈ ఏరువాక సాగడం గురించి జానపద సాహిత్యంలో ఎన్నో పాటలు కనిపిస్తాయి.

అటువంటిదే, పంట బాగా పండి కుప్పనూర్పిళ్లు జరిగాక, పంటను ఇంటికి తెచ్చుకోబోయేముందు రైతు చేసే ఉత్సవం.

ఆవేళ కళ్లంలో రాసులుగా పోసిన ధాన్యాన్ని కూలివాళ్లకు చేటలతో కొలిచి యిస్తారు. కళ్లం దగ్గరికి అడుక్కోవచ్చిన బిచ్చగాళ్లకు లేదనకుండా అంతో ఇంతో పెట్టి పంపుతారు. కుప్పమీద జ్యోతి వెలిగించి, "యాట"ను బలి పెట్టి, దాన్ని అక్కడే చంపి ఆ పంటకు సంబంధించిన కుటుంబంవారు అక్కడ భోజనాలు చేస్తారు. కూరకానీ, అన్నంకానీ ఏదీ మిగలకూడదు. మిగిలినా, పరాయి వాళ్లెవరూ దాన్ని భోజనం చెయ్యకూడదు. బలియిచ్చిన జంతువు తోలూ పేగులూ, మొదలైన అఖాద్యాలైన వస్తువుల్ని అక్కడే గొయ్యి తీసి పాతి పెడ తారు. అలాగే వండిన వంటకం మిగిలిపోతే దాన్ని ఆ ప్రదేశానుండి అవతలకి తీసుకుపోగూడదు గనుక అక్కడే పాతిపెడ్తారు.

కుప్పల్ని తరలించిన తర్వాత గానీ, పురులు కట్టిన తర్వాత గానీ, కళ్లంలో అడుగున మిగిలిన ధాన్యపు గింజల్ని వతనుగ వెట్టి చేసేవారికి ఇచ్చి వేస్తారు. ఆరోజు రైతు కుటుంబంలో ఇంటిల్లపాదీ సంబరం చేసుకుంటారు.

ఈ విధంగా జానపదులు నిర్వహించే జాతరలూ, జరుపుకునే ఉత్సవాలూ, మనోరంజకంగా ఉండి, ఎన్నో వింత సంగతుల్ని వెలికి తెచ్చేవిగా ఉంటాయి.

1674. సుభాషిణి.

# పదవాఙ్మయంలో పిల్లల ప్రసక్తి

జానపద వాఙ్మయాన్ని పరిశీలిస్తే, ఇందులో పురుష కల్పితం ఎంత ఉన్నదో స్త్రీ కల్పితంకూడా అంతే ఉన్నదనిపిస్తుంది. ముఖ్యంగా గానసహితమైన ఈ వాఙ్మయంలో స్త్రీ కర్తృకాలైన పదాలూ, పాటలూ, కీర్తనలూ, మొదలైనవి ఎక్కువగానే కనిపిస్తాయి. గానంలేని, కేవల వచన రూపంలో ఉన్న, పేదరాసి పెద్దమ్మ కథలవంటివి కూడా, ఎక్కువగా స్త్రీ ముఖత ప్రచారాన్ని చెందేవిగానే ఉంటున్నాయి, ఎప్పుడైనా, ఏ ఇంట్లోనైనా, కథలు చెప్పే తాతల సంఖ్యకంటే అవ్వల సంఖ్యే ఎక్కువ.

అటువంటి స్త్రీ కర్తృకమైన పదవాఙ్మయంలో, స్త్రీలకు తమ సంతానం పట్ల ఉండే మమత, ఆ సంతానపుఘనత, రూపరేఖా విలాసాదికాలూ, ఆధిక్యమూ, అన్నీ ప్రముఖ స్థానాన్ని పొందుతున్నాయి. ముఖ్యంగా తనబిడ్డను గురించి చెప్పుకోవడానికే స్త్రీ, నోరువిప్పి, ఈ వాఙ్మయకర్తృత్వంలో ప్రధాన స్థానాన్ని వహిస్తున్నదనడంలో అతిశయోక్తి లేదు. నిజానికి ఏ స్త్రీ అయినా తనకున్న అష్టైశ్వర్యాలకన్నా, తన ఐదవతనాన్ని, సంతాన భాగ్యాన్ని ఎక్కువగా చూచుకుంటుంది. అందునా నాగరక వాసనలు పోక పోవడం వల్ల ఇతర వ్యాపకాలు ఎరుగని జానపదస్త్రీకి, ఈ సంతానంతప్ప మరోలోకం లేదు. అందువల్లనే పదసాహిత్యంలో పిల్లలకున్న స్థానం ప్రధానమై ప్రకాశించింది.

ఏ జానపద కథను పరిశీలించినా, అందులో ఉండే ఆయినింటి ఇల్లాళ్ళు గానీ, రాజుగారి పట్టమహిషులుగానీ, మొదట సంతాన లాభంకోసం పడరాని పాట్లు పడుతారు. సంతానం పొందడానికై వాళ్లు కాశీతీర్థం రామేశ్వరానికి నోముతారు. రామేశ్వరపు ఇసుక గంగకు నోముతారు. పెళ్లిళ్లుకానివారికి పెళ్లిళ్లూ, ఒడుగులు కానివారికి ఒడుగులూ చేయిస్తారు. నాగపూజ చేయిస్తారు. తీర్థయాత్రలు చేసి కనబడ్డ చెట్టుకూ పుట్టకూ మొక్కుతారు. వీటన్నిటివల్లా

ఫలం కనిపించకపోతే, తెగించి, కాకులు దూరని కారడవులూ, చీ..లుదూరని చిట్టడవులూ దాటి, తపస్సు పట్టబోతారు.

"రుద్రాక్ష మీద భద్రాక్ష భద్రాక్షమీద పోకచెక్క పోకచెక్కమీద సన్న సూది సన్నసూదిమీద శిరస్సు కిందికీ సిరిపాదం మీదికీ పెట్టి వరతపసు పట్టు కుని" ఉంటారు. అటువంటి ఉగ్రమైన తపస్సు పూనగా ఆవిడ చీలమండల్లో రక్తం, మోకాటి చిప్పలకూ, అక్కణ్ణుండి తొడలకు, ఆపైన నడుముకూ, గుండెకూ, జారి తర్వాత ముక్కు చెవుల్లోనుండి బయటికి దూకుతుంది. అది చూచి పరమేశ్వరుడో మరో మంత్రసిద్ధుడో ప్రసన్నుడై, ఆ పడతికి సంతానం కలగడంకోసం, విభూతిగానీ, పువ్వుగానీ ప్రసాదిస్తాడు. దాన్ని అనుభవించాకనే ఆవిడ సంతాన లాభాన్ని పొందుతుంది. ఈ విధంగా జానపద వాఙ్మయంలో కేవలం ఒక బిడ్డ పుట్టడం చుట్టూ ఇంతరమ్యమైన కల్పన చోటు చేసుకొని ఉంటుంది. ప్రతి జానపద స్త్రీ, తాను తన బిడ్డణ్ణి ఇన్ని కష్టాలు పడి కనక పోయినా, ఆ బిడ్డనుమాత్రం వరప్రసాదిగానే భావిస్తుంది. అందువల్లనే, పిల్లల చుట్టూ, అన్ని పాటలూ, అన్ని కథలూ ఈ వాఙ్మయంలో గోచరిస్తుంటాయి.

తల్లికి పిల్లవాణ్ణి నిద్రపుచ్చడమనేది ఒక మధురమైన చర్య. వాడికి పాలిచ్చి కొంగుతో పెదిమలు తుడచి ఉయ్యాలలో పడుకోబెడుతుంది. అప్పుడు ఆపిల్లవాడు తల్లి కళ్లకు కేవలం తన కొడుకుగా మాత్రమే కనిపించడు వాడు, అచ్యుతమైన, అనంద సంధాయకుడైన ముకుందుడు. అందువల్ల ఆ ఉయ్యాల మామూలు ఉయ్యాలకాకూడదు. కాబట్టి

> "తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించీ
> బలుపైన ఫణిరాజు పాన్పు సవరించి"

ఆ తల్లి తన కొడుక్కు జోలపాటలు పాడుతుంది. అంతేకాక,

> "లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ
> లక్ష్మి విలాసుడమ్మా:
> పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ
> వేదాంత వేద్యుడమ్మా

వేణు నాదంబుతోను ఈ బిడ్డ
వేదములు పాడునమ్మా"

అని గొంతెత్తి ఎంతో మురిపెంతో నలుగురికీ చెప్పుకుంటుంది.

అట్లా పాడుతూ ఉండగా, తన బిడ్డ ఆకార వర్ణన చేయవలసిన అవసరం వస్తే, ఇక తల్లికి, తన్మయత్వంలో ఒళ్లే తెలియదు.

వాడెంతో అందగాడు. రాజేంద్రభోగి.

"చిన్ననా బాలునీ సిరిమొగం చూచీ
సిగ్గుపడి చంద్రుడూ పొడవ జాలండూ
చిన్ని నా అబ్బాయి చిరునవ్వు జూచి
గోరింట పూచింది కొమ్మ లేకుండా"–

అని మురిసిపోతుంది.

"మా అయ్య కన్నులు కలువరేకుల్లు
మాబాబు జుంపాలు పట్టు కుచ్చుల్లు
మా అయ్య దంతాలు మంచి ముత్యాలు
మాబాబు చేతుల్లు పొట్లకాయల్లు..."

తనబిడ్డ అంగాంగ వర్ణన చేసుకుంటూ, తన్మయత్వాన్ని భజిస్తుంది–అదే ఆడపిల్ల అయితే,

"చిక్కుడూ పువ్వెరుపు చిలక ముక్కెరుపు
చిగురెరుపు చింతల్ల దోర పండెరుపు
రక్కెసాపండెరుపు రాగిచెంబెరుపు
తా ఎరుపు అమ్మాయి తన వారిలోన–"

అని ఆ బిడ్డ శరీరవర్ణ సౌభాగ్యాన్ని ఎత్తి చూపిస్తుంది. అటువంటి తన బిడ్డల్ని, వీధిలో నిలుచునే రోజులువస్తే,

"వీధి నెందరు ఉన్న విసరదే గాలి
రచ్చ నెందరు ఉన్ని రాదమ్మ వాన
మాచిన్న పాపల్లు వీధి నిలుచుంటే
మొగిలి పువ్వుల గాలి ముత్యాలవాన"

అని సంబర పడి పోతుంది.

ఇంత అపురూపంగా తల్లి మనస్సులో చెదరని స్థానాన్ని సంపాదించుకున్న బిడ్డలు ఏడిస్తే: — ఇక నేముంది, కళ్లవెంబడి చెక్కిళ్లపై జారేవి కన్నీరు కాకూడదు.

ఎవ్వరే అబ్బాయిని ఏడిపించారు
ఏడవకు ఏడవకు వెర్రి నాతండ్రి
ఏడిస్తే నీ కళ్లు నీలాలుగారు
నీలాలు గారితే నేజూడలేను
పాలైన గారవే బంగారు కండ్ల.

అని పరిదీనమూర్తియై అర్థించడం మొదలు పెడుతుంది. ఇంతకూ బిడ్డకళ్లు కలువపూవులై తే, అందులో చిప్పిలిజారే కన్నీరు కమ్మ తేనెకాక తప్పుతుందా?

అమ్మణ్ణి కన్నుల్లు తమ్మి పువ్వుల్లు
తమ్మి పువ్వులు తేర్చు కమ్మ తేనెల్లు
చిన్నారి కళ్లల్లొ కన్నీటి జల్లు
కన్నీరు చూపకే కరగు నెదజల్లు
చక్కన్ని నా తల్లి గుక్క పట్టింది
చెక్కుటద్దాలలో చెదిరెనే సంజ—

అని బిడ్డ దుఃఖాన్ని చూచి కళవళించి పోతుంది. వాడిని ఉయ్యాలలో చేర్చిపాడే పాటలేకాక, వాడికి ఉగ్గు పెడుతూ, ఆటలు నేర్పుతూ, కాళ్లమీద వేసుకుని ఊగిస్తూ, ముచ్చట్లు చెప్తూ. ఎన్నో రకాలైన గేయాల్ని అల్లుకోగలదు జానపదస్త్రీ.

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
ఏనుగులు తిన్న వెలక్కాయలు జీర్ణం
గుర్రాలు తిన్న గుగ్గిళ్లు జీర్ణం
అబ్బాయి తాగిన ఉగ్గుపాలు జీర్ణం

అని పాపకు ఉగ్గుపోసి కాళ్లమీద కూర్చుండ బెట్టుకుని పొట్టా, వీపూ సవరిస్తూ పలుకుతుంది. ఉగ్గుగిన్న బోర్లేసి పొట్టకు తాకించి ముద్దు పెట్టుకుంటూ పదమెత్తు కుంటుండి,

అట్లాగే అరచాపిన కాళ్లమీద కూర్చుండ బెట్టుకుని, ఒక చేయి వెన్ను పట్టున తాపి, మరో అరచేతిమధ్య గడ్డం ఇరికించుకుని, బిడ్డను ముందుకూ వెనక్కూ ఊగిస్తూ.

"ఊగూ, ఊగూ బసవన్నా
ఉలవలు తినరా బసవన్నా
అంకాళమ్మ గుడికాడ
టెంకాయలు కొట్టరా బసవన్నా -

అని పాడుకుంటుంది. బిడ్డ చేతిని తన చేతులో ఇముడ్చుకుని, గాలిలో ఊపుతూ,

చెయ్యాసమ్మా చెయ్యాసు,
చేకట్లు కొట్టూ చెయ్యాసు
బాలా పాపా చెయ్యాసు
బంగరు కొండా చెయ్యాసు -

అని పసిపాపకు కరచాలనం నేర్పుతుంది. బిడ్డ రెండు చెంపలనూ తన రెండు అరచేతుల మధ్య ఇమిడ్చి తలను సున్నితంగా అటు పక్కకూ ఇటు పక్కకూ వంచుతూ

చిన్ని తల నొచ్చెనే చిన్నమ్మా తల నొచ్చెనే
దాదీ తల నొచ్చెనే దాదమ్మా తల నొచ్చెనే
అమ్మా తల నొచ్చెనే అమ్మమ్మా తల నొచ్చెనే

అంటూ పాడుతూ, బిడ్డకు తల తిప్పడం, నేర్పుతుంది.

బిడ్డ రెండు చేతులూ పట్టుకొని చప్పట్లు కొట్టిస్తూ

"తప్పట్లోయ్ తాళాలోయ్
దేవుడిగుళ్లో మేళాలోయ్
పండ్లూ ఫలమూ దేవునిదోయ్
పాలూ నెయ్యీ పాపాయికోయ్

అని పాడుతుంది.

బిడ్డ అరచేతిని చక్రాకారంగా తిప్పిస్తూ

"తారంగం తారంగం
తాండవకిష్టా తారంగం
వేణునాదా తారంగం
వెన్నలదొంగా తారంగం
నల్లని సామీ తారంగం
చిన్నికృష్ణా తారంగం"

అని లయకు అనుగుణంగా తాను ముఖచాలనం చేస్తూ కళ్లు తిప్పుతూ పాడుతుంది.

శిశువును ఎదురుగుండా నిలువబెట్టుకుని రెండు చేతులూ పట్టుకొని, చల్ల కవ్వాన్ని, తరిత్రాడు గ్రహించి తిప్పినట్లుగా బిడ్డను అటూ ఇటూ తిప్పుతూ,

చల్లా చెయ్యీ గొల్లభామ
మూతీ తిప్పూ ముసలిభామ

అని పాడుతుంది.

"పెసర పప్పోయ్ పేర్నెయ్యోయ్
అట్ల పెంకోయ్ అరట్లోయ్

ఉట్టిమీది కుండలో
గట్టి పెరుగోయ్"

అంటూ తన పాదాల మీదికి పిల్లవాణ్ణి ఎక్కించుకుని కాళ్లపైకిలేపుతూ, బిడ్డడు కిలకిల నవ్వుతుంటే తానూ మురిసిపోతుంది.

తల్లి, బిడ్డ అరచేతిని బాగా చాపి, వేళ్లు ఎడంగా చేసి, ఒక్కొక్క వేలు ముట్టుకుంటూ,

"తిందాం తిందాం ఈ వేలు
ఎట్లా తిందాం ఈ వేలు
అప్పు తెచ్చుకు తిందాం ఈ వేలు
అప్పెట్ల తీరుద్దాం ఈ వేలు
తిని పారివేదాం ఈవేలు"

అని పాడుతుంది. తర్వాత అన్నమూ నెయ్యీ పప్పూ అన్నీ కలిపి అరచేతిని కంచం చేసి, నీకోముద్దా, నీకోముద్దా అంటు తలా ఒకముద్ద పంచి పెడుతుంది. చివరికి అప్పు ఎగవేసే దొంగలు పారిపోయే వైనాన్ని చూపిస్తూ, బిడ్డ చంకల వరకూ తన చేతిని కితకితలు పెడుతూ కదిపి,

"తాటిమానికి దొంగా లెక్కిరి
ఎక్కిరి ఎక్కిరి ఎక్కిరి ఎక్కిరి."

అని తాను నవ్వుతూ, బిడ్డను కిలాదున నవ్విస్తుంది. ఈ విధంగా ఎన్నో పాటలు తల్లి పాడుతూ, పాడుతూ బిడ్డచేతచేయించే శరీర పరిశ్రమకు, పదవాఙ్మయంలో శాశ్వత స్థానం లభించింది.

అంత ఆనందంతో ఆరోగ్యంగా ఉండే బిడ్డలు, తల్లి కెప్పుడూ రత్నమాణి క్యాలుగా కనిపిస్తారు. పై పెచ్చు,

హంసల్లు హంసల్లు అందురేగాని
హంసలకు రూపేమి నడకలేగాని

హంసల్లు మా యింటి ఆడపడుచుల్లు
పావురాలు మా యింటి బాలపాపల్లు

అని సగర్వంగా చెప్పుకుని మురిసిపోతుంది. అటువంటి బిడ్డకు గోరుముద్దలు తినిపిస్తూ, వాడు తిననని మారాం చేస్తుండగా, చంక నెత్తుకొని అటు ఇటు తిప్పుతూ,

"చందమామ రావే జాబిల్లి రావే
కొండెక్కి రావే గోగుపూలు తేవే
వెండిగిన్నెలో వేడిబువ్వ తేవే
పవిడిగిన్నెలో పాలుబువ్వ తేవే
తెచ్చి మా అబ్బాయికి వేగిరం ఇయ్యవే"

అంటూ వాడిచేత అన్నం తినిపించడానికి నానా అవస్థలూ పడుతుంది.

ఆ పిల్లవాడు తల్లి కళ్లకు మణిదీపం. అందువల్లనే,

"గోరంత దీపమ్ము కొండలకు వెలుగూ
ఈశ్వరుని చందమామ జగమెల్ల వెలుగూ
మా యింటి అబ్బాయి మా కళ్ల వెలుగూ"

అని తన పాపణ్ణి, చందమామతో పోల్చుకుని ఆనందిస్తుంది. వాడు కులదీపకుడు. పైపెచ్చు రేపు మేనమామలతో తనకు వియ్యాన్ని ప్రసాదించేవాడు. తన అన్న కూతురికి సరియైన మగడు. తన కొడుకే అన్న అహం ఆవిడకు నిండుదనాన్నిస్తుంది. అందుకే

మామలను అబ్బాయి ఏమేమి కోరు
గాదెల్ల నుండేటి ధాన్యాలు గోరు
ఏటి కెద్దును గోరు యవసాయం గోరు
చూడచక్కని మామ కూతుర్ని గోరు
రచ్చల్ల గూర్చుండు రాజసం గోరు—"

అంటూ, అట్లా కోరడం, తనబిడ్డ జన్మహక్కుగా భావిస్తుంది. అందులో ఆవిడ కెంత మాత్రమూ చిన్నతనం ఉండదు.

"ఇదే సందు, అదే మందు" అన్నట్లుగా, బిడ్డని గొప్పతనాన్ని బేరీజు వేసుకునే తల్లి, ఆ ఊపులో తన పుట్టింటి ఐశ్వర్యాన్నీ, పుట్టినింటివారి గొప్ప తనాన్నీ తలుచుకుని తృప్తి పడుతుంది.

"ఎవ్వరే అబ్బాయి మేనమామల్లు
అంచుపంచెలవారు అంగీలవారు
చెవి చెవికి బారెడే పోగుల్లవారు
పెసరకాయలవంటి పెదిమెల్లవారు
మిరపకాయలవంటి మీసాలవారు
వారు మా అబ్బాయి మేనమామల్లు"

అంటూ ప్రశ్నా, సమాధానమూ రెండూ తానే చెప్పుకుని సంబర పడిపోతుంది.

మగబిడ్డనుగూర్చి ఇంతఘనంగా ఆలోచించే తల్లి ఆడపిల్ల దగ్గరికొచ్చే టప్పటికి, ఏదో దైన్యాన్ని వెలిగ్రక్కకుండా ఉండలేదు.

కూతురికి చిన్ననాటినుండి, అణకువనూ, వినయాన్ని, గృహనిర్వహణా సామర్థ్యాన్ని నూరిపోయడం మర్చిపోదు. అందుకు కారణం ఆడపిల్ల పుట్టగానే అది "ఆడ" పిల్లగాని "ఈడపిల్ల" కాదన్న కఠినసత్యం. అందుకే ఆడపిల్లకు జోలపాడుతూ తల్లి,

"ఆదివారమునాడు అమ్మన్న పుట్టె
సోమవారమునాడు చురుకుగ నడిచె
మంగళవారమునాడు మాటల్లు నేర్చె
బుధవారమునాడు బుద్ధులన్నీ నేర్చె
గురువారమునాడు పరిణయంబాయె
శుక్రవారమునాడు సూడిదె లందె
శనివారంనాడు అత్తింటికేగె"

అని ఎప్పుడో సుదూరకాలంలో జరుగబోయే శుభకార్యాన్ని, పుట్టీపుట్టగానే, ఒక వారంలో జరిపేసి కళ్ళు తుడుచుకుంటుంది, ఆ పిల్లకి, పాటల్లోనే, "వీధిలో కురులిప్పి ముడవవద్దనీ, "పలుగురిలో పన్నెత్తి నవ్వవద్దనీ," "పోయిన చోట బుద్ధి కలిగుండ" మనీ, అహర్నిశలూ, ఉపదేశాలిస్తూనే ఉంటుంది. అయినా కొడుకువలే కూతురు కూడా తల్లి కళ్లకు చల్లని చందమామ. ఆవిడ బంగరు బొమ్మ. ఊగే చిలక, తంగెడుపువ్వు, గుడిపావురము, చిన్నెలఅంచ, కన్నుల వెలుగు, సొగసుల గువ్వ, చక్కని నెమలి, ఇలా ఇంకా సృష్టిలో ఉన్న అందమైన వస్తువులు ఎన్నో ఎన్నో;

తల్లి మనస్సులో, ఇంతముఖ్యమైన స్థానాన్ని సంపాదించుకునే, పిల్లలే కలగక పోతే. ఇక ఆ స్త్రీ బ్రతుకుకు ఆవిడ దృష్టిలో సార్థక్యమే ఉండదు. అందుకే,

"కొత్త చింతపండు గోనెల్ల చీకు
గొబ్రాలి వస్త్రాలు పెట్టెల్ల చీకు
కొడుకుల గననివాళ్ల కడుపేమి కడుపు
కుల ముద్ధరించని కొడు కేమి కొడుకు
పిడికెడు విత్తనాలు మడికెల్ల జాలు
ఒక్కడే కొడుకైన వంశాన చాలు"

అని బిడ్డలను పొందడానికే అంగలారుస్తుంది.

ఈ విధంగా పదవాఙ్మయంలో పిల్లల ప్రసక్తి, మొత్తం ఆ వాఙ్మయాన్నే వెలిగించే మణిదీపం.

అఖిలభారత తెలుగుబాలల మహోత్సవసంచిక 1974 అక్టోబరు.

# పంచకన్యలు

అహల్యా ద్రౌపదీ కుంతీ
తారా మందోదరీ తథా
ప్రాతఃకాలే స్మరేనిత్యం
పంచకన్యా ప్రకీర్తితా

ఈ శ్లోకం నేను చిన్నప్పటినుండీ వింటున్న శ్లోకం. ఇది విన్నప్పుడల్లా నా మెదడులో తేలుకొండెలాంటి సందేహం ఒకటి తలయెత్తుతుండేది. మనకున్న పద్దెనిమిది పురాణాల్నీ, రామాయణ భారతాల్నీ తిరగవేస్తే ఎన్నో స్త్రీ పాత్రలు కనిపిస్తుండగా, కేవలం ఈ అయిదు గుర్నీ ఒకచోట గుదిగూర్చి పొద్దున్నే స్మరించండిసుమా! అని హెచ్చరించడంలో ఏమైనా అంతరార్థం ఉందా?

అసలీ శ్లోకానికి కర్తయెవరు? దీన్ని కూడా వ్యాసమహర్షే చెప్పాడని అందామా అని కొంత జిజ్ఞాసతో వెతికాను కూడా. కాని కర్త యెవరో నికరంగా తేలలేదు. విద్యార్థి కోశాలవంటి రిఫరెన్సు గ్రంథాలలో ఈ శ్లోకం ఉంది అయితే ఒకచోట కుంతికి బదులుగా సీత ఉండడం కనిపించింది. దీన్నిబట్టి పంచ కన్యల్లో సీత స్థానాన్ని కుంతికి అప్పగించినట్లా? ఈ వెతుకులాటవల్ల మరింత క్లిష్టత కలిగిందేగాని ఏమీ తెగేట్లుగా కనిపించడం లేదు.

ఇంతకూ కన్య అంటే ఏమిటి? సంస్కృతం నుండి వచ్చిన ఈ మాటకు తెలుగులో పెళ్లికాని పడుచు అని మాత్రమే అర్థం. సంస్కృతంలో అంతేకాక, కూతురనీ, స్త్రీ అనీ కూడా అర్థాలున్నాయి. పై శ్లోకంలో ఉన్న పంచకన్యలకు అయిదుగురు స్త్రీలు అనే అర్థం మాత్రమే చెప్పుకోవాలి.

అయితే, ఎందరో స్త్రీలు సాహిత్యప్రపంచంలో తారసపడుతుండగా, కేవలం ఈ అయిదుగుర్నీ మాత్రమే ఎందుకు మనం స్మరించడం? ఇక్కడ నేను

అయిదుగురిలో సీతను గ్రహింప దలచుకోలేదు. ఈ కోవలో సీతకంటే కుంతీ దేవి ఉండటమే నాకు ఎక్కువ సమంజసంగా తోస్తుంది.

రామాయణ, భారతాలూ, పురాణాలూ, అన్నీ క్రీస్తుపూర్వపు శతాబ్దాలలో పుట్టిన గ్రంథాలు. ఇందులో రామాయణ, భారతాలు రెండూ వీరగాథలు, అనగా ఒకానొక చారిత్రక కాలానికి చెందిన వీరపురుషుల జీవిత కథలు.

ప్రాచీన కథలన్నింటినీ పరిశీలనాదృష్టితో చూస్తే, ప్రతికథలోనూ రెండు భిన్నవిషయాలు కలగలిసినట్లుగా కనిపిస్తుంది. అందులో మొదటిది అభౌమమైన కల్పన అంటే ఈ భూమిమీది మనుష్యులవశంలో లేని ఎన్నో అద్భుతకార్యాలను అసంభవఘటనలను అతిమానుషశక్తియొక్క సహాయంవల్ల జరుగుతున్నట్లుగా చూపించడం; లేదా, సామాన్యమానవుడే అతి మానుషశక్తిని సంపాదించి ఈ రకపు అద్భుతకార్యాలను నిర్వహిస్తున్నట్లుగా చిత్రించడం. రెండోది కవితానున్న సమాజ స్వరూపాన్ని ఈ రకపు అద్భుత సంఘటనల మాటున ఆకుమాటు పిందెల్లాగా కనబడీ కనబడనట్లుగా కూర్చడం. ఇందులో మొదటిది కల్పన. రెండవది సత్యకథనం. కానీ, చిత్రమేమిటంటే ఈ కథలు చదివేటప్పుడు మనం ఈ కల్పనాంశాన్నే ఎదకు హత్తుకుని, సత్యకథనంఉన్న విషయంకూడా గమనింపకుండా దాటివేస్తుంటాము.

ఇంతకూ ఇటువంటి కథల్లో పాత్రలుగా దిద్దబడిన పంచకన్యల గురించి ఆలోచిస్తున్న నాకు వాళ్ళ జీవితాల వెనుక దాక్కొన్న సత్యకథానాన్ని గ్రహించి, నిర్ధారించాలన్న కుతూహలమే ఎక్కువ, అంటే వీళ్ల జీవితాల్లో సమకాలిక జీవనాశయాలూ లేదా, నియమాలు, ఎన్ని నిక్షిప్తం గాబడివున్నాయి, ఆనాటి సాంఘికచరిత్రకు వీళ్ల పాత్రలు ప్రతీకలు కాగలుగుతున్నాయా అన్నదే ఆలోచింపవలసిన విషయం.

మొదట కల్పనాంశం అన్నానే, అది ప్రతి పాత్ర యొక్క జననం, మరణం, అద్భుత కార్యాచరణ మొదలైన వాటిల్లో కనిపిస్తుంది. అనగా ఈ పాత్రల్లో ఎవరూ మామూలుగా పుట్టరు. సామాన్యమైన చావు చావరు.

పంచకన్యల్లోని అహల్య పాత్రనే పరిగ్రహిద్దాం. ఈవిడను బ్రహ్మ సృష్టించాడు. ఇంత అందగత్తెను ఎవరికిద్దామా అన్న విచికిత్సలో పడినప్పుడు,

దేవత లందరూ మాకివ్వు, మాకివ్వు అని అడిగారు. బ్రహ్మ ఎవరి కివ్వాలో తోచక వాళ్లల్లో ఎవరు భూప్రదక్షిణం ముందుచేస్తే అతని కిస్తానన్నాడు. దేవత లంతా అందుకోసం పరుగెత్తితే, గౌతముడు తనకున్న తెలివి నుపయోగించి గోప్రదక్షిణం భూ ప్రదక్షిణంతో సమానం కనుక అక్కడొక గోవు ఈనుతుండగా దాని ప్రదక్షిణంచేసి, నియమపాలనం చేశాడు. ఆ విధంగా అహల్య గౌతముని భార్య కాగలిగింది. కాని, ఇంద్రుడికి ఆవిడమీద మనస్సు ఉండటంచేత, తర్వాత కొన్నాళ్లకు ఆశ్రమప్రాంతంలో కోడైకూసి, గౌతముడు బయటకుపోగా, ఆవిడతో రమించాడు. తర్వాత ఈ మోసం తెలిసి గౌతముడు ఇంద్రుణ్ణి, అహల్యను శపించాడు. శాపావసానాన గౌతముడు తిరిగి అహల్యను భార్యగా పరిగ్రహించాడు.

అహల్యను గురించిన కథ లింతటితో ఆగి పోలేదు. జానపద కథా కావ్యం, లేదా జానపద పురాణం అనడానికి అర్హతను సంపాదించుకున్న "గౌత పురాణంలో" అహల్యను గురించిన కథలు తీరు తీరులుగా కనిపిస్తాయి

అహల్యమీద మోజుతో సూర్యుడు, ఇంద్రుడూ వచ్చి ఆవిడతో క్రీడించారు. సూర్యుడివల్ల ఆవిడకు సుగ్రీవుడు, ఇంద్రుడివల్ల వాలీ ఇద్దరు కుమారులై జనించారు. ఆమెకు గౌతమునివలన అంజన అనే కూతురు జనించింది. గౌతముడు ఇద్దరు కుమారులను భుజాలమీద కెక్కించుకొని అంజనను నడిపిస్తూ తీసుకువెళ్తున్నాడు. అప్పుడు అంజన ఆయన్ను పరాయిబిడ్డల్ని నెత్తికెక్కించుకొని సొంతబిడ్డను నేలను నడిపిస్తావా అని దూషించింది. గౌతముడు అంజనవల్ల విషయం గ్రహించి వీళ్ళు నాబిడ్డలు కాకపోతే వానరముఖులై ఎదురీది ఒడ్డుకు వస్తారని సముద్రంలో ఆఇద్దర్నీ పారేశాడు. అందువల్లనే వాలి, సుగ్రీవులు వానరముఖు లయ్యారు. ఈ సంగతి తెలిసి అహల్యనువ్వు గుడ్డి దానివి కమ్మనీ, వానరుణ్ణి కనమనీ అంజనను శపించింది. ఇంతకూ అంజనాదేవికికూడా తన భర్తవల్లకాక, వాయువువల్ల జనించినకొడుకు అంజనేయుడు, అలా తనతో రమించినందువల్ల ఆవిడ కన్యాత్వానికి భంగం కలుగదనికూడా వరమిచ్చాడు వాయుదేవుడు

ఈ కథలవల్ల అహల్య ఒక భర్తకు మాత్రమే చెందిన స్త్రీ కాదు. భర్త పట్ల విశ్వాసంతో పరపురుషుని కన్నెత్తిచూడని పరమ పవిత్ర కాదు. ఈ సత్యం ఈ నాటి ఘన సమాజానికి ఎంత చేదుగావున్నా, ఈ కథాకాలం నాటికి అంతగా పట్టింపులు లేని సాంఘిక న్యాయం.

రెండవ పాత్ర తార. ఇంతకూ "తార" లిద్దరున్నారు. అందులో ఏ తార అయినా ఈ పంచకన్యల్లో చేర్చదగ్గ అర్హత సంపాదించుకున్నదే. శ్లోకకర్త కేవలం తార అన్నాడే కాని, ఏ తారో నిర్ధారింపకపోవడంవల్ల ఇద్దరిలో ఎవరైనా కావడానికి వీలుంది. ఇందులో ఒక తార బృహస్పతి భార్య, దేవ గురువు బృహస్పతిదగ్గర శిష్యరికం నెరపడానికి వచ్చాడు చంద్రుడు. చివరకు గురుద్రోహియై, తారను గురువు లేని సమయంచూచి తనతో తీసుకుపోయాడు. చంద్రునివల్ల తార గర్భం ధరించింది. ఈ సంగతి తెలిసి తన భార్యను తాను తిరిగి పొందడానికి బృహస్పతి చంద్రునితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. రాక్షసులు చంద్రుని పక్షాన చేరడానికి ఉద్యుక్తులు కాగానే దేవతలకు భయం కలిగింది బ్రహ్మ అప్పుడు కలుగజేసుకుని తారను బృహస్పతి కిప్పించాడు. తార బుధుణ్ని ప్రసవించింది. వాడు తన కొడుకు కనుక, తనకు కావాలని చంద్రుడు పట్టు బట్టినాడు, కాదు, వాడు నా కొడుకేనని బృహస్పతి భీష్మించు కున్నాడు. అప్పుడు బ్రహ్మ మళ్లీ కలుగజేసుకొని తారనడిగి, ఆ పిల్లవాడు చంద్రుడి కొడుకేనని ఆవిడవల్ల నిర్ధారణ చేసుకుని బుధుణ్ణి చంద్రుడి కప్ప గించాడు. ఇంత జరిగినా బృహస్పతి తారను తిరస్కరించలేదు. ఇదీ గమనించవలసిన ముఖ్య విషయం.

మరో తార వాలి భార్య. ఈవిడ కూడా ఆనాటి సాంఘిక జీవన పద్ధతిని తెలియచేసే బలవత్తార్కాణం. దుందుభి అనే రాక్షసుడితో యుద్ధంచేస్తూ బిలం లోకి దూసుకుపోయిన వాలిని, మరణించినట్లుగా భ్రమించి సుగ్రీవుడు బిలాన్ని మూసి కిష్కింధనూ, వాలి భార్య తారనూ కైవసం చేసుకున్నాడు. తిరిగి వాలి వచ్చి సుగ్రీవుణ్ణి తరిమి రాజ్యంతోపాటు తన భార్యను కూడా తన అధీనంలోకి

తెచ్చుకున్నాడు. అనగా తార సుగ్రీవుడితో సంసారం చేసినా వాలి కాపట్టింపు లేదు. చివరకు వాలి రామబాణ హతుడుకాగా, తిరిగి తార సుగ్రీవుడి అధీనంలోకి వెళ్లిపోయింది. ఇక్కడ గుర్తించవలసిన ముఖ్యాంశం స్త్రీ సోదరు లందరికి సమానంగా అనుభవింపతగ్గది. ఇప్పటికి కొన్ని తెగల్లో అన్న చచ్చినచో అన్న భార్య తమ్ముడికి దక్కుతుంది. రామాయణంలో సీత కూడా లక్ష్మణుణ్ని అన్న పోతే నేను నీకు దక్కుతా ననుకుంటున్నావా" అని దూషిస్తుంది. ఇక ద్రౌపది సంగతి సరే సరి. ఇద్దరు తారలు ఈ విధంగా ఒకనాటి సామాజిక స్వరూపాన్ని స్పష్టంచేస్తున్నారు.

మండోదరి మయుడి పుత్రిక. రావణ పత్ని. ఈవిణ్ణి గురించి కూడా చిత్ర విచిత్రాలయిన జానపద కథలున్నాయి. వివాహానికి పూర్వం ఈవిడను వాలి అనుభవించినట్లూ, అప్పుడు కలిగిన పుత్రుడే అంగదుడైనట్లూ, ఈ కథలు చెప్తుంటవి. అందువల్లనే రావణుడు రామ లక్ష్మణ వధార్థం పాతాళహోమం చేస్తుండగా, దాన్ని వితథం చేయడానికి అంగదుడు మండోదరి జుట్టు పట్టుకుని రావణుని ముందుకు ఈడ్చుకొని వచ్చాడట. కొడుకు కాబట్టి ఆవిణ్ణి అంగదుడు స్పృశింప కలిగాడు ఇక్కడ కూడా స్త్రీ శీల పరిరక్షణ మీద ప్రత్యయం కనిపించడం లేదు.

ద్రౌపది పాండవ పత్ని. మహావీరుడైన అర్జునునికి విక్రమశుల్కగా నిర్ణయింపబడిన భార్య. కానీ, కుంతీదేవి వచనంవల్ల పాండవులైదుగురికీ పత్ని కావలసి వచ్చింది. ఒక కుటుంబంలోని అగ్రసోదరుడి భార్య మిగిలిన సోదరు లందరికీ పత్నిగా వ్యవహరించే ఆటవికాచారం ఈనాటికి మనదేశంలో కొన్ని జాతుల్లో నిలిచే వుంది. భారత కాలంలో ఈ ఆచారం ఉన్నదనడానికి ద్రౌపదీ కథనమే ప్రబల తార్కాణం. ఇది కేవలం తల్లి వచనంవల్ల ఇలా నిర్ణయింప బడిందనడానికి వీలులేకుండా భారతంలో తార్కాణాలు దొరుకుతాయి. కర్ణుణ్ణి శ్రీకృష్ణుడు పాండవుడవని ప్రబోధించి కౌరవపక్షం వదలమని చెప్తూ నీవలా చేస్తే నీకు రాజ్యమేకాక ద్రౌపదికూడా లభిస్తుందని ప్రలోభ పెడతాడు. అలాగే ధర్మరాజు కర్ణుని జన్మరహస్యం తెలిశాక, నీ వెవరవో మాకు ముందే తెలిస్తే ఈ రాజ్యాన్నీ, ద్రౌపదినీ కూడా అనుభవించేవాడివి కదా అని వాపోతాడు. ద్రౌపది

వివాహం వెనుక అతి ప్రాచీనకాలంనాటి విచిత్రమైన సాంఘిక ఆచారం అంత గూఢంగా కల్పనాంశం మధ్య పొదగబడి వుంది.

ఇక కుంతి : కుంతి భోజుని కూతురైన ఈవిడ వివాహానికి పూర్వమే సూర్యునివల్ల పుత్రుణ్ణి కన్నది. తన కన్యాత్వం చెడదని సూర్యుడు హామీ యిచ్చినా, కర్ణుణ్ణి విడిచి పెట్టేసింది. పెళ్లయ్యాక భర్త అనుమతివల్ల యముణ్ణి, వాయువును, ఇంద్రుణ్ణి ఆహ్వానించి ముగ్గురు కొడుకుల్ని కన్నది. అంతేకాక మాద్రికికూడా అశ్వినులవల్ల ఇద్దరు కొడుకులు పుట్టేదారి చూపించింది. ఈ కథల్లో ఋషి, వరం, దిక్పాలురు, వంటి కల్పితాంశాలలావుంచి, కేవలం ఒక స్త్రీ తన భర్త అనుమతివల్ల ఇతర పురుషులవల్ల సంతానాన్ని పొందగలగడం అనే సత్యాంశాన్ని సాక్షాత్కరింప జేసుకుంటే ఆనాటి సాంఘికన్యాయం ఎంత విచిత్రంగా ఉండేదో స్పష్టమవుతుంది. ఆమాటకొస్తే భారతంనిండా ఇటువంటి పుట్టుకలే గోచరిస్తాయి. వ్యాసుడు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ఇట్లా తయారు చేస్తే పెద్ద పట్టికే సిద్ధంకాగలదు.

పంచకన్యల్ని పరిశీలిస్తే ప్రతి ఒక్కరి చరిత్రా ఇంతవిశిష్టంగా, ఆనాటి స్త్రీకి సంఘంలో వున్న స్థానాన్నీ, ఆవిడచుట్టూ అల్లుకుని వున్న సాంఘిక నియమాల్ని చూపించగలుగుతున్నది.

సామాజిక వేత్తల అభిప్రాయం ప్రకారం ఆదిమకాలంలో మాతృసామ్య వ్యవస్థ ఉండేది. అనగా మనుష్యుడు తోటివాళ్లను గుంపులు కట్టుకుని వనచరుడై బలప్రయోగం వల్ల కేవలం జంతువుల్ని చంపి తిని, మృగయాజీవనం నెరిపే దశలో ఉండేవాడు. అప్పుడు స్త్రీ యొక్క బాధ్యత కేవలం పిల్లల్ని కనడం, పెంచడం మాత్రమే. అంతేకాని, భర్త నంటిపెట్టుకుని ఉండటం, కుటుంబాన్ని ఏకముఖమైన సంస్థగా పట్టి ఉంచటం, ఆవిడ పనికాదు. పిల్లలపట్ల భర్త అసూయాపరుడై ఆపదలు తలపెట్టడం సంభవిస్తే స్త్రీ భర్తనుండి దూరంగా పోయి పిల్లల్ని కాపాడుకోవడానికి కూడా సిద్ధపడేది. మనుష్యత్వానికి దగ్గరవైన ఆదిమబీజాలను నిక్షిప్తం చేసుకున్న గొరిల్లా జాతిని పరిశీలిస్తే ఆడగొరిల్లా సంతానవతికాగానే మగ గొరిల్లానుండి దూరంగా పోవడమేకాక, అవసరమైతే యుద్ధానికి

కూడా సిద్ధమవుతుందన్న సత్యం విదితమవుతుంది. ఈనిన పిల్లులూ, పులులూ, కూడా అంతే. ఇటువంటి జాంతవమైన మానసికతత్వంతో వున్న తొలి స్త్రీకి వ్యభిచార భావం తెలీదు. కారణం ఒక స్త్రీ ఒక పురుషుడికి కట్టుబడి వుండాలనే నియమం కూడా తెలీదు కనుక.

ఈ స్థితినుండి మానసిక పరిణామం జరుగుతున్నకొద్దీ మనుష్యుడు వేట కంటె వ్యవసాయాన్ని అభిమానించసాగాడు. వనేచర వృత్తిని విడిచిపెట్టి ఎక్కడో ఒక విడిది పట్టును నిర్మించుకొని సుఖజీవనానికి దారులు వెతుక్కో సాగాడు. అప్పుడు పుట్టిందే కుటుంబవ్యవస్థ. ఈ వ్యవస్థకు ముఖ్యంగా కావలసిన అంశం కుటుంబాభివృద్ధికి మూలకందాలైన స్త్రీ పురుషుల్లోని స్థిరత్వం కుటుంబం ఎప్పుడు ఏర్పడిందో, పురుషుడు ఎప్పుడు ఆటవిక జీవనాన్ని విడిచి పెట్టాడో, అప్పుడే మాతృస్వామ్యమైన వ్యవస్థ మెల్లగా పితృస్వామ్యంగా మార సాగింది. వెనుకటిపలె కాకుండా స్త్రీని కుటుంబానికి పట్టిఉంచడానికి, ఆవిడ శీలంలో స్థిరత్వం కావలసివచ్చింది. అనగా ఒకస్త్రీకి ఒక పురుషుడు మాత్రమే అనే భావనకు పటిష్ఠతను చేకూర్చే ప్రయత్నాలు విరివిగా కొనసాగాయి. అందుకు తప్పి చరించిన స్త్రీలు వ్యభిచారిణులుగా నిందింపబడ్డారు. కాని, అటు వంటి జీవిత వృత్తాలే సంఘంలో ఎక్కువగా కనిపించే సంధికాలంలో అటువంటి వారిని కేవలం పరిస్థితుల ప్రభావంవల్లనో, మహాపురుషుల ఆగ్రహానుగ్రహాలవల్లనో జరిగిన వాటినిగా సమర్థించే కల్పనాంశం చేరింది. పంచకన్యల జీవిత చరిత్రలో ఈ విషయం స్పష్టంగా తెలుస్తున్నది.

కుటుంబ వ్యవస్థ స్థిరీకృత మవుతున్న కొద్దీ, స్త్రీ జీవనం నియమ కఠినం కాసాగింది. అంతేకాదు, కుటుంబం మీద సర్వాధికారాలూ వహించిన పురుషుడు ఆవిడచుట్టూ ఎన్నో ఆజ్ఞలూ, ఆంక్షలూ చేర్చాడు. ధర్మశాస్త్రాల్లో స్త్రీ పరంగా వచ్చిన నిషేధ సూత్రాలన్ని ఈ అంశాన్నే స్పష్టంచేస్తున్నాయి. నిషేధసూత్రం ఎప్పుడు వచ్చినా ఉన్నదాన్ని కాదని కొత్తదాన్ని ప్రవేశపెట్టడానికే నని గ్రహించవచ్చు.

ఈ నాటిస్త్రీకి సంఘంలో వున్న ప్రతిపత్తికి విరుద్ధంగా ఆనాటి స్త్రీ స్వరూపం ఈ కథలవల్ల సుస్పష్టంగా గోచరిస్తుంది. అప్పటి స్త్రీ. పురుషుడి

సొత్తైన అనేక చరాచర వస్తువుల్లో ఒకటి. పురుషుడు కొన్ని తన ఇష్టమైతే అమ్ముకోవచ్చు. కుదువ పెట్టవచ్చు. జూదంలో పణంగా ఉంచవచ్చు ఇష్టంలేని నాడు విసిరి అవతల పారవేయవచ్చు.

ఆవిడను తానే నియోగించి, అవిడ ఇతరులకు కన్న సంతానాన్ని తన సంతానంగా స్వీకరించవచ్చు. అతిథులూ, అభ్యాగతలూ, వచ్చినా, అర్థిత్వం వహించి ఏ యాచకుడు వేంచేసినా, వాళ్ల ప్రీతికోసం ఆవిణ్ణి నియోగించవచ్చు. భారతాంతర్గతమైన అనేక స్త్రీ పాత్రల్ని పరిశీలిస్తే ఈ విషయాలకు సుస్పష్ట తార్కాణాలు లభిస్తాయి. పంచకన్యల చరిత్ర ఉపయోగపడేదికూడా అందుకే.

అయితే. ఈనాటి మన సాంఘిక ప్రతిపత్తిని దృష్టిలో ఉంచుకొని ఆ పాత్రలను నీరస దృష్టితో చూడనక్కరలేదు. వాటి మీద కక్షగట్టి వాటిని మార్చాలని ప్రయత్నించ నక్కరలేదు. ఇది ఇలాగే జరిగివుంటుంది అని ఈనాటి మన సామాజిక జ్ఞానంతో వాటిని తిరిగివ్రాస్తే విశ్వప్రయత్నాలు చేయ నక్కరలేదు. వాటిని అలాగే భద్రంగా ఉంచడం వల్లనే ఆ స్థితినుండి ఎన్ని ముందడుగులు వేసుకుంటూ మన జీవితాలను ఈ విధంగా నిర్మించుకోగలిగామో. స్పష్టంగా తెలుస్తుంది. మన ప్రాచీనమైన గతం స్పష్టంగా మనకు తెలుస్తూ ఉండకపోతే వర్తమానం మీద మమకారమూ, అపేక్షా కోల్పోయే ప్రమాదంలో మానవజాతి పడిపోవచ్చును.

అందువల్ల మన పురాణ కథలన్నీ మనం భద్రం చేసుకోతగ్గవే కాని, నిరసించ దగ్గనీ వికృతం చేయదగ్గవి మాత్రం కాదు.

ఆంధ్రప్రభ - 1975 మే

# 20 వ శతాబ్దపు తెలుగు కవిత - స్త్రీలు

కవిత్వమనేది హృదయ సంబంధమైన కళ. దీనికి స్త్రీ పురుష విచక్షణ లేదు. స్పందించే హృదయమున్న ప్రతివ్యక్తి లింగభేద రహితమైన దృష్టితో తన మనస్సులో పుట్టే భావాలను మథించి శోధించి, తరిమెణ పట్టి తనకుండే బాధను వాహికగా చేసుకుని ఇతరులకు అందజేయవచ్చును. అందుకు కూడా తొలిదశలో భావంలో నాజూకుతనం కావాలనీ, పాండిత్య ప్రకర్ష ఉండాలనీ నియమాలేవీలేవు. ఎవరి మాతృభాషలో వారు పుట్టిన నాటినుండీ పండితులే. భాషధ్యేయం విస్పష్టమైన భావప్రకటనమే అయితే ఎవరిమాతృభాష వారికి, ఆ ధ్యేయాన్ని పరిపూర్ణంగా నిర్వహించే వాహిక. అందుకై దానికి మెరుగులూ, పూతలూ, ఆడంబరాలూ అక్కరలేదు. అందులో స్త్రీ పురుష భేదంలేదు.

ఒకతల్లి గుక్కపట్టి ఏడుస్తున్న కూతుర్ని సముదాయిస్తూ, తన హృదయ భావాన్ని ఎంతో కవితాత్మకంగా చెప్పవచ్చు.

"అమ్మాయి కళ్లల్లొ కన్నీటి జాలు<br>
కలువ రేకులలోని కమ్మ తేనెల్లు<br>
చక్కన్ని నాతల్లి గుక్కపట్టింది<br>
చెక్కు టద్దాలలో చెదిరెనే సంజ<br>
విసురు విసరవే గాలి విసరవే వడిగా<br>
చెమటార్చి శ్రమదీర్చి చెక్కిళ్లు దిద్దు<br>
పలుకు పలుకవె చిలుక పదిలంగ పలుకు<br>
ఏడుపూ మానేను వెర్రి నా తల్లి<br>
ఏడుపూ మానంగ ఎవరు అమ్మణ్ణి<br>
కిలకిలా నవ్వేటి కలువల్లరాణి

ఇంతకంటె హృదయాన్ని స్పందించే గుణం మరెక్కడో పాండిత్యంలో ఉండదు. పాండిత్య గంధంలేనిదీ, చదువు సంధ్య లెరుగనిదీ, ఒక జానపద స్త్రీ ఆవిష్క-

రించి కవిత్వమిది. కవిత్వతత్వం ఈవిడ నరాల్లో రక్తమై ప్రసరిస్తోంది. ఇటువంటి కవయిత్రులు ఆంధ్ర జానపదసాహిత్యం నిండా ఉన్నారు. కాని వాళ్లు అనామకలూ, చరిత్ర తెలియని వాళ్లున్నూ. ఇక ప్రాచీనమైన తెలుగు సాహిత్యంలో నన్నయ నాటినుంచీ నాయన రాజులవరకూ కోకొల్లలుగా కవులు వర్ధిల్లినచోట, స్త్రీలు మాత్రం కవయిత్రులుగా వేళ్లమీద లెక్క పెట్టదగ్గవారే. ఆ సాహిత్యాన్ని ఎన్ని సార్లు క్షుణ్ణంగా పరిశీలించినా మొల్ల, రంగాజమ్మ, తిమ్మక్క, వెంకమాంబ, ముద్దుపళని, అంటూ ఇవే పేర్లు కనిపిస్తాయి. దీనికి మొదటి కారణం, ఇక్కడ కవి కావడానికి పాండిత్య స్ఫోరకత ఉండి ఉండాలన్న నియమం సాధారణలక్షణంగా మారడం. రెండవది, స్త్రీలకు సాధారణ లక్షణంగా కుదురుకున్న చదువు లేనితనం. ఇదంతా ప్రాచీన కాలానికి సంబంధించిన నేపథ్యం.

ఇక ఆంధ్ర సాహిత్యంలో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారితో ఆధునికయుగం ఆరంభమైన విషయం అందరికీ తెలుసు. అప్పుడే తెలుగు సాహిత్య స్వరూపంలో ఎన్నోమార్పులు సంభవించాయి. పద్యం ఎన్నో నియమాలను సడలించుకుని, రాజాస్థానాలనుండి పండిత ప్రకాండుల బాహు బంధాల నుండీ పెనుగులాడి విడిపించుకుని జనం మధ్యలోనికి వచ్చేసింది. అలా రావడానికి ఆనాడు తగిన బాటలు పరచినారు శ్రీ తిరుపతి వేంకటకవులు. వారు చాలావరకు పద్యం చూట్టూ ఉచ్చుల్లా దిగేసుకు పోయిన శాస్త్రీయపు హద్దుల్ని వదులు చేశారనాలి.

> "కాలము బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
> షాలలితాంగి మారుటది సత్కవిసమ్మతమౌను" అని

నిర్ణయించారు. వారి ఆశుకవితా ధోరణి సగటు మనిషిలో పద్యాన్ని రాయాలి అనే కుతూహలం రేకెత్తించింది.

ఆనాడు ప్రతివ్యక్తి తాను తీసే కూనిరాగం కూడా ఛందోబద్ధమైన పద్యం నడిచినట్లుగా నడవాలని తహతహలాడి పోయాడు. అప్పుడు ఆంధ్ర దేశమంతా ఎక్కడచూచిన పద్యాలల్లగల్గినవాళ్లే. దీనికి తోడు భావవైప్లవ్యానికి

యే కోణంనుండి చూచినా కొదువ అన్నదిలేదు. పరాయి పాలనలో చిన్నబోయిన దేశం యొక్క శృంఖలలు విడగొట్టి స్వేచ్ఛా వాతావరణంలో దేశమాతను కలకలలాడేట్లు చేయాలనే ధృఢసంకల్పం ప్రతిచోటా కన్పిస్తుండేది. ఇక స్త్రీ పరంగానైతే, ఆనాటి సంఘంలోనున్న అవకతవకలను సరిదిద్ది అన్యాయానికి బలి అవుతున్న స్త్రీని ఉద్ధరిద్దామనే సంచలనం మరోప్రక్క కనిపించేది. అదీ, ఇదీ కాకపోతే అంతవరకూ మూసకట్టుగా కనిపిస్తున్న మన సాహిత్యంలోకి వివిధాలయిన శాఖల్ని ప్రవేశపెట్టుదామన్న గట్టి ప్రయత్నం ఉండేది. ఆ రకంగా విభిన్న భావసంచలనాలచే ప్రభావితులై ఎందరో కవులు ఆనాటి ఆంధ్ర సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. ఆ కవులతో బాటు కొందరు కవయిత్రులు కూడా వెలుగులోకి రావడం తటస్థించింది.

అయితే ఈ కవయిత్రుల కావ్యవస్తువు సర్వేసర్వత్ర సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి రూపు దిద్దుకున్నది అని చెప్పడానికి వీలుకానిది. ఇందులో చాల మంది తాము ఆధునిక యుగంలో నివసిస్తున్నా తమచుట్టూ ఎన్నో సమస్యలు వికటలాస్యంచేస్తు వాటిని వేటినీ పట్టించుకోక కేవలం భక్తినీ, ధర్మానీ ఇతివృత్తంగా గ్రహించి ప్రౌఢశైలిలో కావ్యరచన కావించినవారే ఇట్టికావ్యాలకు ఉదాహరణప్రాయాలుగా కొటికలపూడి సీతమ్మగారి "అహల్యాబాయి చరిత్ర, సీలంసుభద్రాంబగారి సుభద్రా రామాయణము, చేబ్రోలు సరస్వతీదేవిగారి. సరస్వతీరామాయణము, చిల్కాపాటి సీతాంబగారి 'పద్మినీ పరిణయము' జూలూరి తులశమ్మగారి "పద్మావతీ విజయం", కల్లూరి విశాలక్షమ్మగారి "భారత కథామృతం, ఇంకా ఎన్నో ప్రౌఢ కావ్యాల్ని పేర్కొనవచ్చు. ఈ కావ్యాల్లో కనిపించే శైలీ సౌభాగ్యాల్ని పరికిస్తే, ఇవి ప్రాచీన కవుల కావ్యరచనకు ఏ విధంగానూ తీసిపోవనే సత్యం స్ఫురిస్తుంది.

### శతకాలు - ఖండకావ్యాలు

ఈ కవయిత్రులు ఇంచుమించు ప్రతివారూ బృహత్కావ్యాలతోబాటు శతకాలను, ఖండికలను రాయడం సంభవించింది. ఆధునికయుగం ఆరంభమైన తొలిరోజుల్లోనే స్త్రీలు సంపాదకురాండ్రై కొన్నిపత్రికల్ని నడిపేవారు. ఇందులో

ఒకటి శ్రీమతి పులుగుర్తి లక్ష్మీనరసాంబగారు నిర్వహించిన సావిత్రి, రెండవది చింజమూరి వెంకటరత్నమ్మగారి "అనసూయ", మూడవది, బాలాంత్రపు శేషమ్మగారి "హిందూసుందరి". ఇవేకాక, కేసరిగారి "గృహలక్ష్మి", 'విశ్వదాత' "భారతి" వంటి పత్రికలుకూడా స్త్రీల సమస్యలయెడ స్త్రీల రచనలపట్ల సానుభూతి కలిగినవై వారిని ప్రోత్సహిస్తుండేవి. పైన పేర్కొన్న శతకాదులు, ఖండకావ్యాలు, ఈ పత్రికల్లో ప్రముఖంగా ప్రచురింపబడేవి. అందువలన ఆనాటి కవయిత్రులకు శతక రచనపట్ల, ఖండకావ్య రచనపట్ల, మిక్కిలి ఆదరంఉండేది. వీరు రచించిన కావ్యాలలో వస్తువు పురాణాశ్రితమే అయినా శతకాలలో ఆత్మ చింతన, హితబోధ ప్రముఖంగా కనిపించడం జరిగింది. ఈ శతకాలు ఒక రకంగా ఆత్మాశ్రయ లక్షణానికి ఆధారభూతాలై ప్రకాశించినవి. కొటికలపూడి సీతమ్మ "సాధురక్షకశతకం"లో ఇలా అంటారు.

> "కోపము మెండు నాకెపుడు, కుత్సిత బుద్ధి యఖండవృత్తితో
> కాపురముండు నామదిని, కల్మషమింక నశింపదయ్యె నా
> పాపపు చిత్తవృత్తులను భస్మము సేయగదయ్య వేగ సం
> తాపహరుండ భక్తవరదా! శరణాగత సాధురక్షకా!"

ఇట్టి ఆత్మ నివేదనపరమైన పద్యాలు ఈ కవయిత్రుల శతకాల్లో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఈ లక్షణంతోపాటు స్త్రీ స్వభావాన్నిగూర్చి, ప్రవర్తనను గూర్చి హితబోధ చేయడానికి ఆనాటి కవయిత్రులందరూ పూనుకున్నట్లుగా కనిపిస్తుంది. శ్రీమతి ఇనగంటి సరస్వతీదేవి స్త్రీలను ప్రబోధిస్తూ

> "పడతి పుట్టుకతోడనే పరునిసొత్తు
> నీటముంచిన పాలముంచినను ప్రాణ
> కాంతుడే దైవమంచు నెక్కాలమెంచి
> అతని మెప్పించి మెప్పొందనగును సతికి"
> అరయ పుట్టింట పంచభక్ష్యపరమాన్న
> మారగించుట కంటె సౌఖ్యంబెసంగు

అబల నొక్క కబళమైన నత్తగారి
గృహమునందు స్వాతంత్ర్యమై యెసగుగాని"

అని స్త్రీ లోకానికి బుద్ధులు చెప్పారు. అట్లాగే శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ, జొన్నలగడ్డ శారదాదేవి అనే జంట కవయిత్రులు

"పతిపెడ ద్రోవల తొక్కిన ధృతిజెడి కలహింపకమ్మ తిన్నగనతనిన్
చతురమతిఁ ద్రిప్పఁజూడుము - ప్రతిమాలు మగని యటంచు
ప్రాకట భక్తిన్"

అని సాధ్వీజనోచితమైన తాలిమి గుణాన్ని నూరిపోశారు.

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి తరుణీశతకంలో,

"తొందరచెందకు కోపం
బందకుమా. పరుల తూల నాడకుమా కా
లెందైన జారగా తీ
యందగు నిక నోరుజార నగునే తరుణీ.

అని స్త్రీలను ఉద్బోధించడం చాలా సహజంగా కనిపిస్తుంది. ఇటువంటి ఉదాహరణలు చెప్పదల్చుకుంటే కోకొల్లలు. ఈ రకంగా స్త్రీలకు బుద్ధి చెప్పడంతో బాటు, యువకుల్ని మందలించిన కవయిత్రులుకూడా లేకపోలేదు. శ్రీ తి ఆత్మూరి అన్నపూర్ణమ్మగారి 'కుమార సుగుణ బోధిని' అనే ప్రబోధకృతిలో మగపిల్లలకు నీతులు చెప్పడానికి పూనుకున్నారు.

"రుసరుస లాడుచు తిట్టుచు
కసరుచు కోపింప సతులు గ్రక్కున వశులై
మసలుదురని తలపోయుదు
రసురులవలె దుష్టపురుషు లవని కుమారా."
"నీ సతియె నీకు మిత్రము
నీ సతియే నీకుతోడు నిజముగ సుమ్మీ!
రోసమున సతిని దూరిన
మోసము నీ సౌఖ్యమునకు ముందు కుమారా!"

ఇందులో స్త్రీ జన పక్షపాతం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. కానీ పురుషపరంగా చేసే ఈ రకపు హితబోధ చాలా అరుదు.

సమకాలిక పరిస్థితులను తాము రచించిన ఖండికలలో ప్రస్ఫుటంగా చేయడంకూడా ఈ కవయిత్రులు ఎరుగుదురు. ఆనాడు అతివేలంగా కనిపించే విదేశీ అలంకారంమీది మోజును ఎత్తి పొడుస్తూ, శ్రీమతి తూతిక కమలాంబగారు ఇలా అంటున్నారు.

సీ. పసుపు మోమునరాయుపని మోటుదోచెను
 ఫేసు పౌడర్లపై ప్రీతి హెచ్చె
ముద్దులగుల్కెడి దుద్దుల పసపోయె
 చెవులకు లోలకుల్ చెలువుమీరె
కాళ్ల కందము గూర్చు కడియము ల్పోయెను
 పట్టీల గొలుసులు పట్టుతీరె
ముక్కున నగలుంట మోటుగా దోచెను
 మోమున తిలకంబు గోమువోయె

తే.గీ. ముడియు కొప్పును సిగయును మోటులయ్యె
వాలుజడలందు మిక్కిలి వాంఛ యొదవె
భరత భూమిన చరియించు భామినులకు
కరము పెంపొందు క్రొత్త నాగరకమునను.

ఇందులో విదేశీ నాగరకతపై నీరసభావం ఉన్ననూ అది కటువుగా వ్యక్తము కాలేదనవచ్చు. కానీ శ్రీమతి నేమాని భారతీరత్నాకరాంబగారు ఈ విషయంలోనే విద్యాధికలైన స్త్రీలను హెచ్చరిస్తూ

"పరదేశానుగతంపు నాగరకతల్ పాటించి జాతీయతన్
వెరపింతేనియు లేక మా పడతుకల్ విద్యాధికారత్నముల్
ధరపాల్జేయుచునున్న వారలుగదా దాక్షిణ్యపుణ్యాత్మవై
తరుణీవారల కిచ్చిపోవుము స్వజాత్యాసక్తినిన్ భారతీ"

అని యువతీలోకములో విదేశ నాగరకతపట్ల విముఖతను, స్వజాత్యాసక్తిని పెంపొందించడానికి ప్రయత్నం చేశారు. విద్యాధికలైన స్త్రీలను గురించిన సూచనలిట్లా ఉండగా, విద్యాగంధంలేని స్త్రీను గురించి వేమూరి శేషమాంబ గారు తమ మాధవశతకంలో ఇలా అంటున్నారు.

"గొల్లది చల్లవాడుకిడ, గోడల గీతలు గీచి లెక్కలన్
తెల్లము చేయు, చాకలిది తెచ్చిన బట్టలు, వైచు బట్టలున్
పల్లవపాణి త్రాడునకు బాగుగవైచును, విప్పుముళ్లు; తా
సల్లలితంబుగా చదువ జాలని చిన్నియ లెన్నమాధవా?

చదువులేని వారిని గూర్చి ఈమె యిట్లా విచారిస్తుండగా శ్రీమతి ఇందుమతీ దేవిగారు.

"చదివినలాభమేమి మరి చాన గృహంబును దిద్దు నేర్పు నిం
పొదవ పతివ్రతాత్వమును భూరిదయామతి సత్యభాషలున్
మృదువగు మానసంబలరు నేని జగన్నుతయౌను గాదె యా
ముదిత సతీ విభూషయన మోదమునందదెమంగయాంబికా"

అని స్త్రీలకు విద్య ఉన్నా, లేకున్నా ఒక్కటే అని తనమనోభావాన్ని నిక్కచ్చిగా, దృఢంగా వెల్లడించారు. స్త్రీలకు సంబంధించి హితబోధ యిలా ఉండగా, ఆకాలంలో సమకాలికమైన సంఘటనలగురించి పద్యాలల్లిన వాళ్లూ లేక పోలేదు. శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు పెచ్చుపెరిగిపోతున్న ఆనాటి అల్లుళ్ల కట్నాలను కానుకలను నిరసిస్తూ

"ఆషాఢమాసంబు అల్లునకు ప్రీతి
శ్రావణమాసంబు చానలకు ప్రీతి
అల్లుళ్ల లాంఛనము లలవియె యెన్న
ఆడపిల్లలవారు హతమౌనట్టి
జామాత బహుమతులు చాలగా గలవు"

అని ఎత్తిపొడిచారు పర్సా జానకీదేవిగారు, మనుష్యజాతిలో ఉండే రెండే రెండు గొప్పా, బీదా అనే తారతమ్యాన్ని స్ఫుటంగా తెలిజజేయసమకట్టి

"మానవులలోన ధనికుడు మాన్యుడగును
ఆకటికి రోయువాడు పుల్లాకు సుమ్ము
అందు ప్రథముని జీవితమంత మధువె
మొండివాన రెండవవాని గుండెలందు" అని

చైత్ర వైశాఖమాస వాసంతశోభ
ధనికలోకపు విశ్రామధామమయ్యె
శ్రావణాషాఢ నిబిడవర్షానిశాత
మన్సువెదకు మృత్యుధామమ్మెయయ్యె" అని

సమాజస్థమైన చేదునిజాన్ని సూటిగా, చేవగా చెప్పగలిగారు. అయ్యదేవర బాలా త్రిపుర సుందరమ్మగారు టీచర్సు ట్రైనింగ్ పొందిన ఉపాధ్యాయురాలు. ఆ ట్రయినింగ్ అయ్యాక తాను పడ్డపాట్లను ఎంతో సహజంగా, హాస్యభరితంగా ఆవిష్కరించారు,

ఏ బ్యాచినడుగునో ఎవరినో యనుభీతి
కొలువు క్రిటిసిజముల్ తొలగిపోయె
వ్రాసినదానినే రామకోటిగవ్రాయు
అబ్జరువేషను లంతరించె
పాడినపాటనే పాడించు నీనోట్సు
అపు లెసన్సుల హంగు లుడిగె
తలవని తలపుగా తగిలెడి టీచింగు
వర్కుబాధలు కూడ ప్రాతవడియె

వేళపాళలులేని డ్రిల్ వెనకబడియె
గడిచె డాక్టరు సర్టిఫికేట్ల బాధ
బ్రతికితిమి జీవుడా శాంతపడగదోయి
గడచిపోయెను ట్రైనింగు గండమహహ.
ఎలుకను దెచ్చి పిల్లియిది, ఈ నడుమన్ విధి మూడుకాళ్ల పి
ల్లుల సృజియించెనన్న తలలుం కదిలించుట తీరె, మా మనం

బులకు యథేచ్ఛగగ్గె ప్రతి పుస్తకమొక్కొకదేవుడన్న రో
జులు గతియించె సింక పరిశుభ్రపు నోగిరమబ్బు జీవుడా!

ఈ రకంగా సమకాలిక సంఘటనలచే ప్రేరేపింపబడి మనోరంజకంగా పద్యాలు వ్రాసే కవయిత్రులు నేడు చాలా అరుదుగా ఉన్నారనే చెప్పాలి.

ఈ కవయిత్రుల కావ్యాలలో లేఖికా కావ్యరచన కూడా కనిపిస్తున్నది. గిడుగు లక్ష్మీకాంతమ్మగారు దేశాంతరగతుడైన తన భర్తకు వ్రాసిన ఉత్తరాలను 'లేఖదూత' అనే పేరున ప్రకటించారు. అందులో ఆమె భర్తదగ్గర లేని ఇల్లాలు పడే గృహసంబంధమైన ఎగుడు దిగుడులను, తన మనోభావాల్ని చాలా సహజంగా, స్పష్టంగా చాటుకున్నారు.

"పిల్లలకోడిపొట తెరపించుక లేదికనేమి సేతు నే
నిల్లును దిద్దుకొంచు నొక యించుక తెన్నొకటబ్బె నేని నే
నల్లసమంది అత్తరిని ఓపికదెచ్చుక కొన్ని పద్యముల్
చల్లగ వ్రాయ జూతు సుమి చారుగుణాకర శ్రీమనోవరా!"

అని తన లేఖికా కావ్యానికి నాంది వాచనం పలికారు. ఈ రకపు కావ్యానికి ఈవిడే మొదలు.

ఇటువంటి లేఖాంశాలనే కావ్యబద్ధం చేసిన మరో యిద్దరు కవయిత్రులున్నారు. వారు ఐతం ఇందిరా భారతులు. మాగంటి అన్నపూర్ణమ్మ విదేశాలలో ఉన్న తన భర్తకు వ్రాసిన ఉత్తరాలు అన్నపూర్ణ లేఖావళి యనేపేర ప్రసిద్ధికెక్కినవి. వీరు రచించిన అన్నపూర్ణా సుభాషిత రత్నావళిలో ఆ లేఖాంశాలే కావ్యరూపాన్ని సంతరించుకున్నాయి. అన్నపూర్ణ స్వదేశాభిమానిని. సత్యాగ్రహ సమరంలో గాంధీజీ పిలుపు విని వెంటనురుక నుత్సహించిన వీరవనిత. తన కాలి పారాణి ఆరకముందే చదువుకోసమై భర్త విదేశ పయనం చేయవలసి వచ్చింది. విదేశీవిద్యకాని, వేషభాషలుకాని ఈ జాత్యభిమానినికి నచ్చని విషయాలు. సీమనుండి సూటు, బూటు వేసుకున్న ఫోటోను భర్త పంపగా

చేరినది మీరుపంపిన చిత్రపటము
పొంగిపోతిని అటుపైన క్రుంగిపోతి

దుస్తుతీరు నిల్చిన భంగి దుర్భరమ్మొ
కోపగించితి, ఏడ్చితి, కూలబడితి" అని

దుఃఖించి, "తాల్చ నిచ్చితి భక్తితో గాంధికేను
రెండు వేల్సేయు పట్టు చీరెలను మరియు
పెండ్లి చీరెనుగూడ నర్పించుకుంటి
వలయుచో ప్రాణమే నిత్తు భరత ధరకు.

పెండ్లి యుంగరమునుకూడ ప్రీతి తోడ
తిలకు నిధికిచ్చినాను మీ విలువగలుగు
చేతి గడియారమిచ్చితి చేతమలర
ఆకట మిము నిచ్చుకొనెడి భాగ్యంబులేద. అని వాపోయింది.

ఈ జంట కవయిత్రులు అన్నపూర్ణ హృదయము చక్కని శైలిలో సరళ సుంద రముగ తీర్చిదిద్దినారు. అందుకు వీరెంతయు ప్రశంసనీయులు.

ఇట్లా ప్రాచీన కావ్య ఫక్కికలో రచించిన కావ్యాలు, ఆత్మాశ్రయ లక్షణాలను తెల్లంచేసే శతకాలూ, సమకాలిక సంఘటల్ని వెల్లడించేఖండికలనూ రచించిన ఈ కవయిత్రులందరూ ఆధునిక కవితా రంగంలో ప్రథమ దశకు చెందినవారవుతారు. ఈ కోవకు చెందిన జీవత్కవయిత్రులలో ప్రసిద్ధులు కల్లూరి విహాలక్షమ్మ, పుట్టపర్తి కనకమ్మ, స్థానాపతి రుక్మిణమ్మ, బుర్రా కమలాదేవి, ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ, సోమరాజు ఇందుమతీదేవి, యల్లా ప్రగడ సీతాకుమారి మొదలగువారు ప్రసిద్ధులు.

ఇంక ఆధునికి కవిత్వరంగంలో రెండవదశ భావకవిత్వతశ. ఈ విభాగంలో భావకవితాధోరణిలో కలం సాగించిన వారిని చెప్పవలసి ఉంటుంది. 20 వ శతాబ్ది ప్రథమ పాదంలో తెలుగు దేశన్ని ఉత్థాత లూపిన నవీన కవితా ధోరణి భావకవిత్వమే. దీని ప్రభావానికి లోనైకొందరు కవయిత్రులు కూడా కవితావిష్కారం చేశారు, ఈ మార్గంలో పేరెన్నికగన్నవారు వింజమూరి వెంకట రత్నమ్మగారు, బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు, చాకలి బంగారమ్మగారు, వట్టి కొండ విశాలాక్షమ్మగారు, విశ్వ సుందరమ్మగారు.

ఇక్కడ గుర్తించాల్సిన విచిత్ర సత్యమేమంటే ఏ రకపు రచనా ప్రభావానికైనా లోబడిన చాలామంది కవయిత్రులు ఆధునిక కవులలో అగ్రగణ్యులైన వారికి ఏదోవిధంగా దగ్గరివారే, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ గారు అప్పారావు గారి సతీమణి వింజమూరి వెంకటరత్నమ్మగారు కృష్ణశాస్త్రిగారి అక్కగారు, రాధావసంత బాపిరాజుగారికీ, లక్ష్మీకాంతమ్మ నాళం కృష్ణారావుగారికి, లలిత రాయప్రోలు సుబ్బారావుగారికి, హేమలత జాషువాగారికి కృష్ణకుమారి నాయని సుబ్బారావుగారికి పుత్రికలు. అనసూయపత్రికా సంపాదకులైన శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు మంచి భావుకులైన కవయిత్రులు. ప్రేమధామం కోసం వెదికిన వెదుకులాటలో ఆవిడ భావనాబలం ఎంతో చక్కగా స్పష్టమవుతున్నది.

ఉదయకాలమందు ధరణియు జలధియు
ఇనుని కాంతికి ప్రతిఫలమిచ్చునపుడు
ఇల్లు విడిచి కడు నుత్సాహ హృదయ నగుచు
ప్రేమరాజ్యంబు వెదుకగ వెడలి యుంటి,"

కవివరుండొకడు దారిలో కానిపింప
నచ్చటికి నడ్డుదారి యేదని యడుంగ
రమ్ము నావెంట కొలదికాలమ్ము లోన
కాంతు వద్దాని సౌధశిఖరము నంచు
నతడు ప్రత్యుత్తరము నిచ్చెనంతలోన.

అంతలో దవ్వు నందొక్క వింత పురము
తోచె మిరుమిట్లు గొల్పెడు ద్యుతులతోడ
అదు గోనీవు కోరునదంచు నతడు పలికె
కాని యది స్వప్నముల రాజధాని యగుట
నామది చివుక్కుమనె నాశ నాశమయ్యె.

కవయిత్రి వెతికి వెతికి చివరకు తనచిన్న యిల్లే తన ప్రేమధామంగా గుర్తిస్తుంది,

శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు సౌదామని అనే కలంపేరుతో ఏనాడో కవితాసంకలనాలలో స్థానాన్ని సంపాదించుకున్నవారు. జీవితానుభవాలు ఈపిణ్ణి కదల్చివేసి, అనేక కావ్యవస్తువులై ఆత్మాశ్రయ లక్షణానికి తార్కాణాలుగా నిలిచిపోయాయి.

"చూచితి మెంతో దేశము సుఖము శాంతి దొరుకునాయని
మునిగితిమెన్నో నదులను మోక్షము చేపట్టుదమని
ఎక్కితిమెన్నో కొండల ఈశ్వరు దర్శింతామని
మ్రొక్కితిమెన్నో వేల్పుల నొక్కపండు వర మిమ్మని" అని

మనసారా కోరుకుని కవయిత్రి వరం పొంది రెండురత్నాలను తెచ్చుకో గలిగింది, కాని

"బ్రతుకు కలంకారములౌ వాని దాచ చేతకాక
ఎచటనౌ పోగొట్టుకుంటి ఎంతటి దురదృష్టముననౌ," అని

తర్వాత ఆవిడ వాపోవలసివచ్చింది. కన్నబిడ్డల వియోగబాధ అంటే అటువంటిది.

అట్లాగే చావలి బంగారమ్మగారుకూడా భావ నిర్భరమైన కవిత రచించిన విదుషి. ఒకనాడు తను రైల్లో ప్రయాణం చేస్తుండగా, తనతోపాటు పయనిస్తూ తన్ను వెంటాడే ఒక కొండనుచూచి, ఆవిడలోని కవితాత్మ రెక్కలు విప్పుకుంది.

రైలులోపలనేను రాబోతు ఉన్నాను
నను జూచి వెనుదిరిగెనో
ఆకొండ
నైజమే అటులుండెనో
వడివడిగ లేచింది. తడబడుతు నడిచింది

డబ్బుతే డబ్బుతే డబ్బుతే అను పలుకు
విడువకను పల్కేజీ పడినడక రైలుతో
తనుగూడి చనుదెంచెనే
ఆకొండ
తడయకను పయనించెనే-

ఇందులో ఉన్న బంధురమైన భావం ఏ ప్రసిద్ధభావకవి భావానికీ తీసిపోదు.

పూల మాలిక లల్లినందుకు
కరకు కత్తులె కాన్కలాయెను
తేనె సుధలను చల్లినందుకు
తేటి పోటులు కాటు లాయెను

అగ్నిమండెను గుండెలోపల. - అంటూ కుపితవిధిని ప్రదర్శించిన శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు కూడా ఈ కోవలోనివారే. శ్రీమతి నట్టికొండ విశాలాక్షి, పిల్లుట్ల శారదాదేవి, కొత్తపల్లి లలిత, రాధావసంత మొదలైనవారు ఈ విభాగానికి చెందినవారే. ఒక్కొక్కరి కవితల్లోనుండి ఉదాహరణ లివ్వడానికి ఎన్నైనా ఉన్నాయిగాని, గ్రంథం పెరుగుతుందన్న భయంవల్ల వాటిని పొందుపరచడంలేదు.

ఇక మూడవదశ, వచనకవితాదశ. గణ యతిప్రాసల్ని బిగించుకుంటూ తీరిగ్గా పద్యాలు రాసుకునే వ్యవధిగల కాలం కాదిది. శీఘ్రత ఈయుగధర్మం. అదీకాక కవిత్వం మామూలు మనిషికోసం రాయాలనే తపన ప్రతికవిలోనూ బయలుదేరిన కాలమిది మామూలు మనిషికోసమే ఉద్దేశింపబడిన కవిత్వానికి, సగటు మనిషి గుండెల్ని సూటిగా తాకే కవితా విధానమే అవసరం. రాళ్ళెత్తే కూలీ, మరతిప్పే మామూలు మనిషి, నాగలి పట్టే రైతూ, అందరికీ సంబంధించిన వస్తువు, అందరికీ ప్రేరణ ఇచ్చేవస్తువు, ఈ కవితలో భాసించాలనేది ఈ యుగధర్మం. వాళ్లదాకా పోవడానికి, వాళ్లకూడా అర్థం కావడానికి వచన కవిత్వమే అసలైన వాహిక. ఆ విషయం జనత గుర్తించడంవల్లనే వచనకవితకు అన్నిరకాల కవితారీతుల్లోనూ, నేడు సర్వప్రథమమైనస్థానం

లభించింది. వచన కవిత్వం రాయడం చాలా సులువనిపిస్తుందికానీ, కవిత్వ లక్షణమైన భావసంయమనం, ప్రతీకల చిత్రణ, ఊహా పారమ్యం, ఇవన్నీ కేవలం వచనంవలె కనిపించే పాదాలలో బిగించి దాన్ని కవిత్వంగా మార్చడం చాలా కష్టం. మామూలు వచనానికి, వచనపద్యానికీ మధ్య గీచేగీత చాలా అస్పష్టరేఖ. ఈ గీతకూ అటూ ఇటూ ఉండే సరిహద్దులు వేటికవిగా ఉండక ఒకదానితో ఒకటి కలిసిపోతూ కనిపిస్తాయి. అంతమాత్రంచేత మామూలు వచనానికి, కవిత్వంగా మారిన పద్యానికి మధ్య భేదం లేదనడానికి లేదు. ఈ రెంటికి మధ్యనున్న అంతరం బాగా పట్టిచ్చేదిగా ఉంటుంది.

అది గ్రహించని చాలామంది ఒక వాక్యం వ్రాసి దాన్ని యిష్టంవచ్చినన్ని పొట్టివీ పొడుగువీ ముక్కలు చేసి ఒకదానికింద ఒకటిగా ఆముక్కల్ని నిలువుగా పేరిస్తే వచనకవిత్వ మైపోతుందన్న భ్రమలో ఉంటారు. ఈ యాతన అంతా పడలేకనేకాబోలు సులువుగా నవలలు వ్రాయడానికి అలవాటు పడ్డ రచయిత్రులు ఎంతోమంది ఈ శాఖ జోలికి రావడంలేదు. అందుకే ఈ రంగంలో ప్రచురంగా కవయిత్రులు ఏ ఒక్కరో తప్ప, కనిపించడం లేదు.

ఇంతకూ వచన కవిత్వానికి ప్రాచీన కవితా లక్షణాలు ఒక్కఛందోగతి మినహాయించి అన్నీ ఉన్నాయి. దీన్ని చిక్కగా భావనిర్భరంగా, సమకాలిక సమాజ ప్రతిబింబంగా రూపు కట్టించడంతోపాటు, దీనికో సుస్పష్టమైన ధ్యేయాన్ని నిర్ణయించడంకూడా జరిగింది. ఈ రకపు కవితా మార్గంలో ఆమోదకరమైన సాధనను కొనసాగిస్తున్న ఈ వ్యాసకర్త్రి తన కవిత్వానికి ధ్యేయాన్ని ఇలా చెప్పుకుంటున్నది.

"నా కవిత భవిష్యత్తును వెలుగులో ముంచుతుంది
నిరాశను తరిమికొడుతూ
ప్రవక్తలాగా శాసిస్తుంది.
మానవత్వాన్ని మన్నిక చేస్తుంది.
పలుకుల్లో పదునైన
చురకత్తుల్ని అది విసరదు"

అందని ప్రతిదాన్నీ బుగ్గిచేస్తాను చూడమంటూ
అగ్గిపూలు కురవదు
లోకంలో కనపడుతున్న
లోపాలన్నీ గుండెలు గుచ్చి
ఇన్నింటికీ కారణం ఇంకెవ్వరో లెమ్మన్నానో
నాకవిత్వం నన్ను
చాచిలెంపకాయ కొట్టే కోపదారి తల్లిలాగా
కళ్లెర్రచేసి చూస్తుంది
నేనువేరూ లోకం వేరూ అని
ఎన్నడూ నన్ను అందలం ఎక్కించదు,
నన్నూ ఈలోకాన్నీ
ఒక్క క్షణం విడిగా బతకనివ్వదు.

తిమిరంతో సమరం జరిపించే కవయిత్రి తన్నుతాను కాంతిబిందువుగా భావించుకుని,

వంతెన కింద నీటి పొరలాగా
కదలికలు కోరని కాలం గుండెల్ని
గాలంలా గుచ్చే నేను
కిరణ శరాన్ని
ఈ తరానికి చెందిన అద్భుత వరాన్ని - అని సవాలుచేస్తూ

"చీకటిని చేజేతులా
చెంతకు చేర్చుకుంటున్న
కశ్మలాన్ని కాల్చడానికి
నాలుకలు కోసే అగ్నిని నేను
అన్యాయ శతఘ్నిని" - అంటూ గర్జిస్తుంది.

అందరు కవులకు మల్లే ఈ ఆధునికకవయిత్రులకు కూడా తమ దేశం మీదా, తమజనం మీదా, ఎక్కడలేని ప్రత్యయం. తనదేశంలో రెండువైపులా

విపత్తు వాటిల్లి దేశమంతా ఒకగడ్డు సమస్యకు నిర్వీర్యమై తలఒగ్గినపుడు ఆవిడ తన కంఠ మెత్తి ఆ కలతలు కలకాలం నిలవవనీ అన్నదమ్ముల కలతలు ఆటలో అరటిపండ్లనీ జోస్యం చెప్పింది. ఆ ఇద్దరూ ఎప్పుడూ ఒకటేనంటూ

"వాడి మెడమీద పీడి చెయ్యి
పీడి తొడ మీద వాడి కాలు
ఒకరి మొహాలు ఒకరు మోటించుకొని
అనురాగ సరసిలో విరిసిన
తెలి జంట కలువల్లా మెరిసిపోతున్నారు.
స్వప్న వియద్గంగలో సేద దేరే
శ్వేతహంస యుగళంలా
శోభిస్తున్నారు.—"

అని భవిష్యత్తును స్పష్టంగా కన్నులకు కట్టించింది.

ఈమధ్యనే వచనకవితారంగంలోకి నిశితమైన అవగాహనతో ప్రవేశించిన శ్రీమతి తురగా జానకీరాణి గారి కవిత ఎన్న దగ్గది. తానుతిన్న పెద్ద ఆఘాతం వల్ల హృదయాన్ని కరిగించి ఈ వచనపద్యంలో అచ్చు కట్టిస్తున్న ఈవిడ గమనింపదగ్గవారు. వచన కవిత్వంలో ఆత్మాశ్రయ లక్షణానికి ఈవిడ ఖండి కల్ని చక్కని ఉదాహరణలుగా గ్రహించవచ్చు.

"నాది పాతకలమే కదా అని
రాత మొదలు పెడితే
నానుదుటి గీతలా
వంకర పోయింది పాళీ.
విదిపి సరిచేయబోతే
అర్ధరాత్రి నాబిడ్డ లేచి
నాన్నా అని చేసే ఆక్రందనలా
కీచుమంటూ ఆగిపోయింది." - హృదయాన్ని స్పందింప

జేసే గుణానికి ఇంతకంటె పరాకాష్ఠ మరేముంటుంది?

ఈ రంగంలో ఎప్పుడన్నా ఒక్కసారి శ్రీమతి పరిమళా సోమేశ్వర్, వాసిరెడ్డి సీతాదేవి వంటివారు వినిపిస్తున్నారు. ఉత్సాహంగా ముందుకు సాగాలని ప్రయత్నాలు చేస్తున్న వర్ధిష్ణువులు శ్రీమతి లక్ష్మీరమణ, శారదా అశోకవర్ధన్ జ్యోతిర్మయి, రాణి కమలాదేవి, శేషుబాయి మొదలైనవారు.

ఏది ఏమైనా, నడుస్తున్న కాలంలో, ఆధునిక కవితారంగంలో స్త్రీలు అధికసంఖ్యలో ముందుకు రావలసి ఉంది. కవిత్వమనేది ఏ కొందరికో మాత్రమే పరిమితమనే పొరపాటు అభిప్రాయాన్ని అవతల బెట్టి, ఈ నాడు దేశంలో రచనా వ్యాసంగం చేస్తున్న స్త్రీలందరూ, తక్కువమాటలతో ఎక్కువ భావాన్ని హృదయస్పర్శిగా చెప్పే ఈప్రక్రియనుకూడా చేపట్టాలని నేను మనసారా కోరుకుంటున్నాను.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఫిబ్రవరి 1976

# శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి సాహిత్య పరిణామంలో మూడు ఘట్టాలు

పంతులుగారి జీవితచరిత్రను పరిశీలిస్తే ఆయనలో రెండు భాగాలు విడిగా కనిపిస్తూనే, మళ్లీ రెంటికీ ఏకత్వాన్ని సాధించే సమన్వయశక్తి స్పష్టంగా దర్శన మిస్తుంటుంది. అటు సాహిత్యంలోనూ ఇటు సంఘసంస్కరణలోను సవ్యసాచిత్వాన్ని నెరిపి రెంటికి యేక సూత్రత ఘటించి, రెండు ఫలాలను యేక ముఖంగా సాధించిన యుగకర్త ఆయన. ఆయన జీవితానికి ఒక ధ్యేయం ఉంది. ఆయన చేతిలో అమోఘమైన రచనాశక్తి ఉంది. ఆధ్యేయాన్ని సాధించడానికి ఆయన, రచనాశక్తినీ, నైతిక బలాన్నీ, పూర్తిగా వినియోగించుకున్నారు. ఏకాలాలనికైనా రచయితల్లో రెండు రకాలు కనిపించవచ్చు. ఒకరకం, "రచన మా ఊపిరి" అంటూ దాని అందచందాలను సవరిస్తూ మురిసిపోయేరకం. రెండోరకం వాళ్ళకు, కేవలం రచన కాదు ముఖ్యం, అది సాధించే ప్రయోజనం. అటువంటివాళ్ల వ్యక్తిత్వానికీ, ఆశయాలకూ భేదం ఎన్నడం కష్టం. వాళ్లను వాళ్ల రచనలనుండి విశ్లేషించి వేరుగా చూపించడం కష్టం. వాళ్లు, తమను తాము ప్రయోజనకరంగా లోకానికి అర్పించడంలో, తమ రచనాశక్తిని కేవలం ఒకవాహికగా (Medium) వాడుకుంటారు. ఆవిధంగాచూస్తే ఈరకం వాళ్లకే అక్షరాలా. రచన ఊపిరిగా కనిపిస్తుంది. పంతులుగారు ఈరెండవ కోవకు చెందినవారు. ఆయన రచన ఆయనతో అడుగడుక్కూ తాదాత్మ్యం వహిస్తూ ఉంటుంది.

పంతులుగారిపేరు తలుచుకోగానే అందరికీ ఆయన సంఘసంస్కర్తగానే మొదట స్మృతిపథంలో నిలుస్తారు. కాని రచనా వ్యాసంగం లేని పంతులుగారిని ఊహించడమెట్లా? ఆయనకు వ్రాయడం చేతకాకపోయివుంటే, సంఘ సంస్కరణ ప్రయత్నాలు ఫలవంతాలు కాగలిగేవా?

సాంఘిక సంస్కరణలు సులువుగా సాధించేరోజులు కావవి. నలుగురు కూర్చుని ఒక సంఘంగా యేర్పడి తీర్మానాలు తయారు చేసినంత మాత్రాన

ప్రభుత్వం డబ్బూ మద్దతూ, ఇచ్చే ఈ కాలం కాదు, ఆ కాలం. తానున్న సంఘంలో దురాచారాలను, మూఢమైన నమ్మకాలనూ గుర్తించి, బాధపడి వాటిని మార్చదలచుకున్న వ్యక్తి. ఆరోజుల్లో మొదట మొదట, అసహాయ శూరుడై ఏకాకిగానే పోట్లాడ వలసి వచ్చేది. అటు పూర్వాచార పరాయణులైన ప్రజలనుండీ ఇటు కల్లోలం ఇష్టంలేని ప్రభుత్వ నుండీ కూడా ఎన్నో ప్రతిఘటనలు ఎదుర్కొన వలసి వచ్చేది. అందువల్ల సాంఘిక విప్లవాలను సృష్టించ దలచుకున్న యేనాయకుడైనా, అటు రచయితా, ఇటు వక్తా, అయి ఉండక తప్పేదికాదు. ఈరెండు శక్తులూ, అతడు సాంఘికరంగంలోకి దూకినపుడు, కత్తీ, డాలూ లాగా ఉపయోగపడేవి. ఏసంఘ సంస్కర్త జీవితాన్ని పరిశీలించినా ఈ సత్యం మనకు స్పష్టమవుతుంటుంది. ఇవి రెండూ ఒక బండికి కట్టిన జోడుగుర్రాలలాగా. సంస్కరణ వాదిని అంటిపెట్టుకుని ఉండడమేకాక, అతణ్ణి ఎక్కడికక్కడ ఆగిపోనీయకుండా ముందుకు తీసుకుపోయే శక్తి, స్తోమతా కలిగి ఉండేవి. ఇటువంటి వాళ్లకు, ఈ రెండు లక్షణాలూ, ప్రత్యేకంగా శ్రమచేత సాధించవలసిన మహత్తర విషయాలుకావు. అవి సామాన్యంగా వాళ్లకున్న అతిముఖ్యమైన అలవాట్లలో అలవాట్లుగా అబ్బే సంస్కారస్వరూపాలు.

ఇట్లా పంతులుగారికి దత్తమైన రచనాశక్తినీ తన్మూలంగా మూర్తి దాల్చిన సాహిత్యాన్ని పరిశీలిస్తుంటే, దాన్ని క్రిందివిధంగా ఒకపట్టికలో అమర్చవచ్చును.

పంతులుగారి సాహిత్య స్వరూపం



నవలలకూ ప్రహసనాలకూ, సాహిత్య సాంఘిక పరిణామోద్దేశ్యాలు రెండూ ఉన్నవి.

పంతులుగారి స్వీయ చరిత్ర చదివితే, ఆయన హృదయక్షేత్రంలో తొలు దొల్త ఎటువంటి సంఘసంస్కరణప్రయత్నానికైనా ముందుగా, సాహిత్య సృజనాపేక్ష మొలకెత్తిందని చెప్పవచ్చును. అందుకు అవసరమైన పునాదిగా ఆయనకు చిన్నప్పుడే లభించిన ఏకసంథాగ్రాహిత్వం పనిచేసింది. సోమరాజుగారి వీధిబడిలో ఆంధ్రనామసంగ్రహాన్ని భట్టీయం వేయడం, పురాణశ్రవణ కాలక్షేపం చెయ్యడం, రఘువంశం ఐదుసర్గలు కంఠపాఠం చెయ్యడం, ఆయనకు పదేళ్ల ప్రాయంలోనే అలవడ్డవిద్యలు. దానికితోడు భారతంలో విరాటోద్యోగాలూ యుద్ధపంచకమూ నోటికి వచ్చేవి. భాగవత సప్త, దశమ, స్కంధాలు నాలుక చివర నుండేవి. పురాణాలు చదివి, అందులో ఋషులు తపోమహిమవల్ల సాధించిన మహత్కార్యాలన్నీ సాధించాలనుకునేవారు. పదమూడేండ్లకు ఆయనకు పెళ్లయితే పెళ్లిపీటలమీద వధూవరు లిద్దరిచేతా, రుక్మిణీకల్యాణం పద్యాలను చదివించి వచ్చిన వారంతా ఆనందించారు. ఆయన మూడో తరగతిలో ఉన్నప్పుడే, అప్పుడే కొత్తగా వెలువడ్డ ఓగిరాల జగన్నాథం పంతులుగారి సుమనోమనోరంజన ప్రబంధాన్ని కాపీ చేసుకున్నారు. వసుచరిత్ర కొనడానికి వాళ్లమ్మ ఒప్పుకోకపోతే బడిమాని ఆ జీతాన్ని వాయిదాలక్రింద చెల్లు వేస్తూ పుస్తకం చదువుకునే ఏర్పాటు చేసుకున్నారు. ఇంత సాధనసంపత్తిని సమకూర్చుకున్న తర్వాతనే కవిత్వం పంతులుగారిని వరించింది. మొదట తెలుగుకవిత్వం చెప్పడం, ఈయనకు నియమనిష్ఠలతోనే మత ప్రాదిపదిక మీదనే ఆరంభమైంది. మతానికి నీతిప్రధాన మనీ నీతిమాలినవాడు నిజమైన భగవద్భక్తుడు కాలేడనీ, పంతులుగారు తొలుత నమ్మేవారు. ఉపన్యాసాలూ, వ్రతాలూ, భగవత్ప్రీతి కరాలని భావించి ప్రతి ఏకాదశి నాడూ, గోపాలస్వామి ఆలయంలో భజన చేస్తూ పొద్దు పోయిందాకా గడిపేవారు. శివరాత్రినాడు ఉపవాసం చేస్తూ మార్కండేయ స్వామివారి ఆలయంలో భగవచ్చింత నతో దినమంతా గడిపేవారు. అటువంటి సందర్భాలలోనే మొదట గోపాలస్వామి మీద ఒక కందశతకమూ, మార్కండేయస్వామి మీద మరొకటీ ఆవిర్భవించాయి.

ఇది, ఆయన వయస్సు ఇరవైయేళ్లు దాటినప్పుడు. అప్పుడే పంతులుగారిలో ఎవరూ అందుకోని ఉన్నత స్థానాన్ని అందుకోవాలనే తపన బయలుదేరిందని ఆయన స్వీయచరిత్ర తెల్పుతుంది. పురాణాలు చదివేటప్పుడు మహర్షుల త్రే ఘోరతపశ్శక్తిని పొందాలనీ, కావ్యాలు చదివేటప్పుడు మహాకవుల శక్తి కావ్యకర్తకావాలని ఆయన అనుకుంటుండేవారు. అప్పటికి తెలుగులో స్వ తెలుగు కావ్యాలు కొద్దిమంది వ్రాశారు. నిర్వచనకావ్యాలూ ఆ తే రె లక్షణాలకూ నిరోష్ఠ్య లక్షణంకూడా చేర్చి అసామాన్యమైన రచన చెయ్యాలనే సంకల్పం పంతులుగారికి కలిగింది. "నాకా ను సంకల్పము వుదయించుటకును, తదనుసారముగా, కావ్యారంభము టకును చిరకాల మంతరముండదు" అని ఆయన చెప్పుకున్నారు. వెంటనే శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం ఆవిర్భవించింది. ఆ రోజుల్లోనే రసికజన మనోరంజనమనే మిశ్రప్రబంధాన్నికూడా వ్రాయడానికాయన ఉపక్రమించారు. స్వీయచరిత్రలో దీన్ని గురించి ఆయన వ్రాసుకున్న వివరాలు ఆయనకు కవిత్వంమీదనుండే బలమైన అభిలాషను దర్పణంపట్టి చూపించేవిగా ఉన్నాయి. అప్పటికే రసికజనమనోరంజనంలో రెండాశ్వాసాల రచన సాగించగా దానికి మిత్రులు శుద్ధప్రతిని కూడా తయారు చేశారు. అప్పుడు "తెలుగున మిశ్ర ప్రబంధములు నూఱుకొలది ఉన్నప్పుడు, ఇది వానిలో నొకటియగునుగాని దీనికాధిక్యమేమి కలగబోవునని బుద్ధిపుట్టి, దీని నచ్చతెలుగులోనికి మార్చినచో శ్లాఘ్యతరముగా నుండునని భావించి, సాధ్యమైనంతవరకు నా పద్యములను తెనిగించియు, సాధ్యముకానిచోట్ల క్రొత్తపద్యములను రచించియు నైదాశ్వాస ముల శుద్ధాంధ్రప్రబంధమును చేసితిని", అని పంతులుగారు రసికజనమనోరంజన రూపాన్ని పూర్తిగా మార్చేశారు. ఈ విధంగా అనితర సామాన్యమైన సాహిత్యసృజన చెయ్యాలనే బలమైన సంకల్పమే తర్వాత ఆయనచేత తెలుగు సాహిత్యంలో నేడున్న దాదాపు అన్ని శాఖలకూ నాందీ వాచకం పలికించింది ఆ బిగువులోనే ఆయన చిత్రకవిత్వాన్ని చేపట్టారు. మత్తేభ గర్భసీసాలూ గోమూత్రికా బంధమూ, అచ్చతెనుగు పద్యాలూ, ఒకటేమిటి అన్ని విచిత్రాలూ ఆయనకు ఆకర్షించాయి. కేవలం పట్టుదలవల్ల సర్కసు ఫీట్లలాంటివి చేశాడన్న నాటక లోకంలో పడ్డది గాని. అట్లా సృష్టించిన ఆ రచనల్లో కూడా భాషా

మాధుర్యమూ శబ్దార్థాల ఒదుగూ. శిల్పసంపదా అన్నీ ఉంటే, అవి రమణీయ సృష్టిగానే పరిణమించాయన్న విషయం చాలామంది గ్రహించరు. ఆయన అచ్చతెనుగు పద్యాలను చాలా వాటిని తిక్కనపద్యాలతో పోల్చవచ్చును. పద్యం చదువుతుంటే, ఆయన ఎక్కడా ప్రయత్నపూర్వకంగా తెలుగు మాటలను ఏరి, పద్యంకూర్చి నట్లనిపించదు. తొలిదశలో తత్సమసరణిని నన్నయాద్యులు ఎన్నుకోకపోయి ఉండి ఉన్నట్లయితే తెలుగుపద్యం ఇలాగే ఉండేది సుమా అనిపిస్తుంది. ఆ విధంగా అచ్చతెనుగు గ్రంథకర్తలకంటే ఈయన విశిష్టుడూ, భిన్నుడున్నూ. ఆనదీ అనిపించుకోగల ప్రత్యేకతను సాధించినవాడు.

ఇక భారతాన్నంతా అచ్చతెనుగులో వ్రాయాలన్న ఉద్దేశంతో సభాపర్వా న్నారంభించారు కాని, తెలుగులో వచన గ్రంథాలు లేకపోవడంవల్ల ఉన్నవేవీ పండితాదరణీయాలు కాకపోవడంవల్లా ఆయనకు తెలుగులో వచన సాహిత్యం విస్తరింప చేయాలనే బుద్ధి పుట్టింది. అందువల్ల అచ్చతెనుగు భారతం రచన అక్కడితో ఆగిపోయి, 'విగ్రహం' రూపుదిద్దుకోసాగింది. విగ్రహం బయటి కొచ్చాక, దానికి దేశం నలువైపులనుండీ ప్రశంసలు కురిశాయి. ఆ పుస్తకాన్ని అభినందిస్తూ సముద్ధరంగయ్యసెట్టి అనే, మద్రాసు క్రైస్తవ కళాశాలాధ్యాపకుడు పంతులుగారికి ఉత్తరం వ్రాస్తూ "తెలుగులో నొక స్వయంకల్పితమైన వచన ప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనలేరా" — అని అర్థించారు. ఆ అభ్యర్థనే తర్వాత పంతులుగారిచేత రాజశేఖరచరిత్ర రచనకు దారి తీయించింది.

తర్వాత ఎక్కువ శ్రద్ధగా ఆయన పూనుకొని వెలువరించిన రచనల్లో చాలాభాగం అనువాదాలు ఆక్రమించుకుంటాయి. అందులో ముఖ్యమైనవి, ఆంగ్ల సంస్కృత నాటకాలు. పంతులుగారు, ఇవేగాక హరిశ్చంద్రాది నాటకాలను నాటక కంపెనీలకు ప్రదర్శనార్థం వ్రాసి యిస్తుండేవారు. ఇవికాక శరీరశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, జంతుస్వభావచరిత్ర, అలంకారసంగ్రహం, కవులచరిత్ర, ఉత్తమస్త్రీలచరిత్ర, మొదలైనవన్నీ పంతులుగారి కలంనుండి మొదటిసారిగా తెలుగులోకి కొనిరాబడి, ఆయనకు యుగకర్త అనేపేరును సార్థకం జేసినవి. ఈకోవకుచెంది ఆయన పూర్తిచేయకుండా ఆపేసిన గ్రంథాలూ లేకపోలేదు.

ఇవన్నీ ఇలా నిర్విరామంగా అనంతశ్రమకోర్చి వ్రాసుకపోడంలో ఆయన ఉద్దేశ్యం ఒక్కటిగా కనిపిస్తుంది. స్వీయచరిత్రలో ఆ విషయాన్ని ఆయన ఇట్లా చెప్పుకున్నారు. "తెలుగుభాషను వృద్ధి చేయవలెనన్న అభిలాషము నాకు మొదటినుండియు విశేషముగా నుండెను. నేనారంభించిన కాలమున తెలుగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములు లేవు. వివిధములేమి? ఇంచుమించుగా నేవిధమైననియు వచన రూపమున లేవనియే చెప్పవచ్చును. అప్పుడన్నియు నూతన సృష్టి చేయవలయును" ఆ సృష్టిని పంతులుగారు చేసి చూపించారు. ఆవిధలగా వారి సాహిత్యంలో తొలిఘట్టానికి పరిణామాపేక్షకమైన రచనా ప్రయోజనం సిద్ధించింది.

ఇక మలిఘట్టం, సాంఘిక పరిణామోద్దేశ్యం కలది సంస్కరణ భావాలకు. స్థానమిస్తూ, వాటి ప్రచారంకోసం. ఫలితంకోసం పూర్ణంగా వినియోగపడిన ఈ ఘట్టమంతా నిజానికి ఒకటి 1. ఈ ఘట్టాన్ని గురించి ఉదాహరణ పూర్వకంగా ఎందరో విమర్శకులు చెప్పేఉన్నారు. ఆయన తలపెట్టిన, విధవా వివాహ నిర్వహణ బాల్యవివాహ ఖండన, లంచగొండి తనాన్ని నిర్మూలించడం, ఏకేశ్వరోపాసన వంటి అనేక సంస్కరణ విషయాలను ఈ సాహిత్యంతనలో నింపుకున్నది. ఈ ఘట్టం రెండుగా భాగింపబడటానికి విలువను కల్పిస్తుంది. పంతులుగారి పత్రికా వ్యాసంగమంతా ఇటువంటి ప్రత్యేకతను పొందిన మరోఘట్టం. ఇందులో ఆయన రచనలేకాక, తనచే నిర్వహింపబడే తన పత్రికల్లోకి చుట్టూ ఉన్న జనాభిప్రాయాన్ని ఆహ్వానిస్తూ ప్రచురించే వ్యాసాలుకూడా వచ్చి చేరడానికి ఆస్కారముంది. ఇవన్నీ తన అభిప్రాయానికి, ధ్యేయానికి, బలమిచ్చే సమకాలిక సాంఘికాభిప్రాయాలు. ఈ ఘట్టం ఆయన సాహిత్య పరిణామదశలో రెండోది

నిజానికి ఆయన వాంఛించిన సాంఘిక సంస్కరణలన్నీ ఫలవంతం కావడానికి ముఖ్యకారణం ఆయన పత్రికావ్యాసంగమేనని నిరాఘాటంగా చెప్పవచ్చును.

పంతులుగారింకా ఏపత్రికాస్థాపించని రోజుల్లో పురుషార్థప్రదాయిని శ్రీకొక్కొండ వెంకటరత్నంపంతులుగారి ఆంధ్రభాషాసంజీవనీ మంచి ప్రచారంలో ఉండేవి. ఈ రెంటికీ తరుచుగా పంతులుగారు వ్రాస్తుండేవారు వారి శుద్ధాంధ్ర

భారతం ఆంధ్రభాషాసంజీవనితోనే ఆరంభమైంది. తర్వాత స్త్రీ విద్యాఖండనం సంజీవనిలో రాగా, దానికి జవాబులు, పంతులుగారు పురుషార్థ ప్రదాయినిలో వ్రాసేవారు. అప్పుడే అయనకో గట్టి ఆలోచన కలిగింది. తన ఊహల్ని స్వేచ్ఛగా లోకానికి వెల్లడించడానికి తనకో స్వంతపత్రిక ఎంతైనా అవసరమనుకున్నారు. అట్లా నాలుగే పుటలతో 1874లో వివేకవర్థిని అనే మాసపత్రిక పుట్టటానికి పంతులుగారి స్త్రీవిద్యా సమర్థనవాదం కారణమైంది. ఈ నాలుగు పుటలే 3 నెలల్లో 17 పుటలుగా పెరిగాయి వివేకవర్ధనిని స్థాపిస్తూ పంతులుగారు ఈ పత్రిక ప్రకటమునందు నా ఉద్దేశములు భాషాభివృద్ధియు. దేశాభివృద్ధియు, ముఖ్యముగా రెండు. నేనేర్పరచుకున్న భాషాభివృద్ధి మార్గము, మృదువైన సులభశైలిని. సలక్షణమైన వచన రచన చేయుట. దేశాభివృద్ధి మార్గము, జనుల లోగల దురాచార దుర్వర్తనములను బాపియు, వృద్ధిపద్ధతులను చూపియు వారినధిక నీతిమంతులనుగా జేసి, దేశమున్నతస్థితికి తెచ్చుటకై శక్తివంచన లేక పాటుపడుట"-అని తన ధ్యేయాన్ని వివరించాడు.

పంతులుగారి ప్రహసనాల్లో చాల భాగం మొదట, వివేకవర్ధనిలోనూ, హాస్యసంజీవనిలోనూ ముద్రితాలయ్యాయి. అంతేకాక నిరంతరం దీనికి ఆంధ్ర భాషాసంజీవనికీ యుద్ధంజరుతూనే ఉండేది. స్త్రీలకు విద్యకూడదు అని అక్కడుంటే, దీనికి అనుబంధమైన కోదు భాషాసంజీవనిలో వెంటనే "పురుషులకు విద్య కూడదు" అనే వ్యాసం ప్రచురితమయ్యేది. వాళ్లు చూపించిన ఉపపత్తుల్నే తిరిగేసి. పురుషులకు అన్వయించి, ఇక్కడ చూపించే వాళ్లు. ఇటువంటి రచన వెనుక కేవల హాస్య స్ఫోరకతమాత్రమేకాక మనుషుల్ని ఆలోచింపజేసే పటిష్ఠమైన జ్ఞానశక్తి ఉన్నట్లు తోస్తుంది.

మరోసారి వేశ్యలుండాలనీ, వాళ్లకు ఒసుగులు జరుగుతూఉండాలనీ అది సదాచారమేననే, కొందరు కొన్ని ఉపపత్తుల్ని వ్రాసిప్రకటించారు. హాస్యసంజీవని దాని సారాంశాన్ని పంచరత్నాలని పేరుపెట్టి ప్రకటిస్తూ ఇట్లా వ్రాసింది.

"ఈమధ్య వనూళ్లు వేయు పద్ధతి పోయినందున వేశ్యలకు కలిగిన నష్టమును బట్టి జగత్ప్రళయము సంభవించునని భయపడి లోకోపకారార్థము దయార్ద్రి

హృదయులైన వేశ్యాభిమానులగు పూజ్యులు కొందరు, పూర్వాచారములను మరల నుద్ధరించి శాశ్వతకీర్తిని సంపాదించవలెనని స్వవాదోప బలార్థముగా నేడు పుటల గ్రంథములను వ్రాసియున్నారు, హాస్యసంజీవని దానియందలి హేతురత్నములను వారలంకరించిన మృదువచోభూషణములతోనే ఎల్లవారల మాడ్కులను మిరుమిట్లు గొలుపనెంచినది. ధీరులారా! జయసిక్యౌసకుడు!" పంతులుగారి పత్రికా పుత్రిక తండ్రికి వాదోడుగా ఉండి ఈవిధంగా నిర్వహించిన కార్యభారము భారతమంత. వివేకవర్ధని అనే బలవర్ధక సహాయమమే పంతులుగారికి లేకపోయినట్లయితే ఆయన్ని ఈనాడు మనం ఈ విధంగా తలుచుకుని ఉండేవాళ్లం కాకపోవచ్చును. నిజానికి పత్రికా రచన అనే సాహిత్యవ్యాసంగాన్ని సంఘసంస్కరణ ప్రయోజనానికి సంపూర్ణంగా వినియోగించుకోవడంలో కూడా, తెలుగులో, పంతులుగారే మార్గదర్శకత్వం వహించారు. అభిప్రాయ నివేదనానికి వాహిక అయిన పత్రిక ఒకటి సంఘ సంస్కారికి ఎంతైనా అవసరం. ఆ అవసరాన్ని గుర్తించిన ఘనత ఒక్క పంతులు గారికే దక్కింది.

పత్రిక ద్వారానో లేదా ముద్రించుకున్న పుస్తకాలద్వారానో అభిప్రాయాన్ని అందంగా సాహిత్యంలో పొదగడం అనేది ఒక వరమే. అందం మీద మాత్రమే దృష్టి పూర్తిగా కేంద్రీకరించకుండా, ఆ అందాన్ని ఏ ఉత్తర ప్రయోజనానికి వినియోగిస్తూ ఫలితాన్ని సాధించడం అదృష్టం. పంతులుగారి సాహిత్యాన్ని పరిశీలిస్తే, అందులో కనిపించే అందం అప్రయత్నంగా సమకూడిందన్న భావన కలగగా, ఆసాహిత్యం సాధించే ప్రయోజనం మొత్తం ఆ సాహిత్యానికే ఊపిరిగా తోస్తుంది. ప్రయోజన రహితంగా పంతులుగారు ఒక్క అక్షరమైనా వ్రాసి ఉంటారనుకోవడం, ఆయన శత్రువులకైనా చేతకానిది.

సాహిత్యశిల్పంతో, ఈ అంటీపట్టనితనమే ఈయనకు తాను చిత్రించిన పాత్రల మీద సానుభూతి లేకుండా చేసింది. ఉదాహరణకు, బహిష్కార పత్రిక అనే ఒక ప్రహసనం నుండి యీ సంభాషణను గమనించండి.

రామచంద్రశాస్త్రి:- రాత్రి మనఊళ్లో ఒక వెధవ పెళ్లి జరిగింది సుమా!

గోపాలశాస్త్రి : ఏమి జరిగితే యేమి? నీవు చేసే పనికంటే అదే మంచిది.

రాము :- ఇలా వెధవముండను పెండ్లిచేసుకుని కులానికి వెలియై నింద పడకపోతే మహారాజులాగ ఒక వెధవముండను వుంచుకుని అది పడుచుతనంలో ఉన్నన్నాళ్లు దాని దగ్గర డబ్బులాగుతూ సుఖంగా ఉండరాదా?

గోపా :- ఒకవేళ దానికి కడుపు వస్తేనో?

రాము:- వస్తేనేమి కడుపుదింపుకున్నా పోతుంది. పిల్లను కని చంపిపారవేసినా పోతుంది. ఈ రెండుపనుల్లో యేది చేసినా కులం పోదు ఒకవేళ ఈ రెండు పనులూ జరగ డానికి వీలులేకపోతే, ఆ వెధవముండ కులంలోంచి చెడిపోతుంది. కాని మనకేమి అపాయంలేకుండా నిర్భ యంగా ఉండవచ్చు. అంతగా కావలిస్తే మనకు వరో వెధవముండ దొరుకుతుంది." ఈ రకమైన హాస్యం మనల్ని ముగ్ధుల్ని చెయ్యడానకిబదులు భయపెడుతుంది. మళ్లీ సూదంటురాయిలాగ ఆకర్షిస్తుందికూడాను.

పంతులుగారి సాహిత్యవ్యాసంగంలో సాహిత్య పరిణామోద్దేశ్యం కల రచనలూ, సాంఘిక పరిణామోద్దేశ్యం కల రచనలూ, ఆయన చేపట్టిన పత్రికా పుత్రికలూ, మూడు ముఖ్యమైన ఘట్టాలను నిర్మిస్తూ కనిపిస్తాయి.

# స్త్రీలు - తెలుగు నవలావికాసం

ఈనాటిదాకా ఈ విషయాన్ని గురించి ఎంతోమంది కూలంకషంగా పరిశీలించి, లెక్కలుగట్టి తెలుగు లోకానికి అందించే ఉన్నారు. కవిత్వం, నవల కథానిక, వ్యాసం, నాటకం, మొదలైన ప్రక్రియల్లో తెలుగు స్త్రీ ఎంత కృషి చేసిందీ ఎటువంటి స్థానాన్ని పొందిందీ, ఎన్ని రచనల్ని తెలుగు లోకానికి అంద జేసిందీ అన్నీ లెక్కలుగట్టి ఒప్పజెప్పే పని ఇక్కడ నేను చేయబోవడంలేదు. అలాచేస్తే అది చర్విత చర్వణమై ఉపయోగాన్ని కోల్పోతుంది.

ఇక్కడ ఒక ప్రశ్న. రచయితలూ, రచయిత్రులూ అనే విభాగం రచనా రంగానికి తగునా అన్న సందేహం బుద్ధిజీవులలో తలయెత్తుతున్నది. రచనకు ఆడ రచనా మగ రచనా అనే తేడా లేదని వాదించేవారు ఎందరో ఉన్నారు. కాని ఏ భాషకు సంబంధించిన సగటు రచయిత్రుల రచనల్ని పరిశీ లించినా అవి పైవాదానికి విరుద్ధంగా సాక్ష్యం మిస్తున్నట్లుగా తెలిసిపోతుంది.

సంఖ్యలో తక్కువ ఎక్కువ అనే అంతరం స్త్రీ పురుషులమధ్య ప్రము ఖంగానే ఉన్నట్లుచెప్పుకున్నాం.సంఖ్యలో తక్కువైన విద్యాధికలైనస్త్రీలు పోటీలో పురుషులతో సమానంగా రచనా రంగంలో నిలబడడం అసాధ్యం కాకపోవచ్చును. కాని ప్రస్తుతం కష్టసాధ్యమైన పని. ఈనాడు స్త్రీ పురుష సమానతలనుగురించి ఎంతోకృషి జరుగుతున్నమాట ఎవరూ కాదనరుగాని, ఎన్నాళ్లనుండో ఎన్నేళ్ల నుండో వంటింటికీ, నాలుగు గోడలమధ్య నేలకూ మాత్రమే పరిమితమైన స్త్రీ ఆలోచన, అన్ని సంవత్సరాల ఆలోచనా పరిణామాన్ని ఒక్కసారిగా పొంద గలగడం దురాశ. బయట తిరిగి ప్రపంచం చూస్తూ వ్యవహారం నడిపే పురుషు లతో సమానంగా స్త్రీ ఆలోచనాసరళి సాగడానికి ఇంకా ఎంతోకాలం పడుతుంది. అది సహజం. అది క్రమానుగతంగా పరిణామపద్ధతి ననుసరించి రావలసిందే గాని మనం కోరుకుంటున్నాంగదా అని ఒక్క ఉదుటున వచ్చి మనఒళ్ళోవాలదు

అలాజరిగితే అది అసహజం. ఇట్లా అన్నానని స్త్రీలలో, పురుషులతో సమానంగా ఆలోచించి రచనలు చేసేవారు లేనేలేరన్నది నా భావన కాదు. పైననేను చెప్పేదంతా అధిక సంఖ్యాకులకు వర్తించే విషయం. అపవాదాలు (Exceptions) అందరికీ అన్ని విషయాలలోనూ ఉండవచ్చు.

స్త్రీ పురుషుల మధ్య సంఘం అనాదిగా కల్పించిన అసమానతలను గుర్తించి, వాటి ప్రభావాన్ని తక్కువగా అంచనావేయని పరిశీలకులు రచనారంగంలో కూడా వీళ్ళమధ్య ఈ అసమానతలు ఉన్నవనే ఒప్పుకుని తీరవలసి వస్తుంది. రచనా సమూహంలో ఆడ రచయితల రచనల్ని తేలికగా గుర్తుపట్టగల ముద్ర మన కళ్ళఎదుట తాండవిస్తూనే ఉంటుంది. అంతేకాదు ఒకవేళ మగవాడు ఆడపేరు పెట్టుకుని వ్రాసినా అది ఆడరచన కాదనే తీర్మానాన్ని కూడా ఈ ముద్రే చేయగలుగుతుంది. ఇటువంటిముద్ర కలిగి విపరీతంగా తెలుగు నవలారంగంలో పరిశ్రమిస్తున్న రచయిత్రుల రచనా పద్ధతుల్ని విమర్శించడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.

ఈనాడు పరంపరగా స్త్రీలు వ్రాస్తున్న నవలల్లో సర్వసాధారణంగా కనిపించే ఇతివృత్తం ఎటువంటిది? వెనక కాలంలో వందలకొద్దీ జీవితాలను పరిశీలించి సమన్వయిస్తేకాని ఒక సందేశాత్మకమైన నవల పుట్టేదికాదు. ఇప్పటి నవల్లో ఈ అభిప్రాయంతో పరితూగే నవలలు మొత్తంమీదఎన్ని? అందునా స్త్రీలు వ్రాసిన నవలల శాతం ఎంత ?

వెనక కాలంలో కుంకుమ భరిణ, చిన్నకోడలు, మాలపల్లి, చివరకు మిగిలేది, అసమర్థుని జీవితయాత్ర వంటి సాంఘికేతివృత్తం కలవీ, జాగిలం, చిన్నహస్తంవంటి అపరాధపరిశోధకేతివృత్తం కలవీ, ఇట్లా ఎంతో విషయ వైవిధ్యం కల నవలలు కనిపించేవి.

ఈ నాటి నవలలన్నీ అందునా స్త్రీల నవలలన్నీ దాదాపు నూటికి నూరుపాళ్ళు సాంఘికేతివృత్తం కలిగినవే. ఈ ఇతివృత్తాన్ని మలచడంలో స్త్రీల ధోరణి ఒక విధంగా ప్రత్యేక ముద్రను కలిగి ఉంటున్నది. స్త్రీల నవలల్లోని ఈ ఇతివృత్త చిత్రణను గురించి ఏ విధంగానైనా సమాలోచించే ముందు

రచయిత్రిగా ఆవిడకా అధికారాన్ని కల్పించి పెట్టిన పరిస్థితుల్ని అవగాహన చేసుకోవలసి ఉంటుంది.

ఇప్పుడు తెలుగులో నవలలు వ్రాస్తున్న స్త్రీల సాంఘిక స్థితిని గ్రహిస్తే అందరూ ఇంచుమించు మధ్యతరగతి గృహిణులు. వీళ్ళలో, జీవితంలో కుదురుకున్న వాళ్ళతోపాటు, అప్పుడే చదువు పూర్తి చేసి జీవితరంగంలో కాలు పెడుతున్న విద్యార్థినులూ, నవ వధువులూ కూడా ఉన్నారు. ఈ మధ్య నాలు గైదు సంవత్సరాలనుండీ పత్రికలిస్తున్న ప్రోత్సాహంవల్ల, వీళ్ళే ఎక్కువగా నవలల్ని ప్రకటిస్తున్నట్లుగా మనం గమనించవచ్చు. వీళ్ళకు జీవితాన్ని వివిధ కోణాలలో తరిచిచూచి, అనుభవించి, ఆ అనుభవాన్ని నలుగురికీ అందించే అవ కాశం ఉండడానికి, వయస్సు చాలదు. అటువంటి కలాలనుండి రూపుచెందిన ఇతివృత్తం ఎట్లా ఉంటుంది? నిజానికి నవలలోనూ, కథలోనూ. కవిత్వానికి ఉండే విధంగా, ఊహకూ భావావేగానికి ఎక్కువ చోటు ఉండకూడదు. నవల ఒక జీవితంయొక్క యథార్థచిత్రణం కావాలి. కాని కల్పనాచిత్రం కాకూడదు. బహుశా పైనచెప్పిన కారణం వల్లనే అనుకుంటాను ఎక్కువమంది రచయిత్రుల నవలలు జీవితంయొక్క సత్యకథనాలుగా, సమగ్ర చిత్రాలుగా కనిపించవు. నవలఅంటే, కేవలం ఊహకులొంగిన, కాల్పనికమైన గద్యరచన అని కాబోలు వీరి భావన.

ఈ నవలల్లో ఉండే ఇతివృత్తానికి సర్వసాధారణంగా స్త్రీ పురుషుల మధ్య ప్రేమ ప్రముఖాధారంగా ఉంటుంది. ప్రేమ కథలు ముగ్గురి మధ్య నడిచేవి కోకొల్లలు. నాయికా నాయక స్థానంలో ఇద్దరు కుదురుకోగా మరోపాత్ర, అయితే దుష్టపాత్రో, కాకపోతే త్యాగపాత్రో, కాక తప్పదు. ఇక అపోహాలూ, కష్టాలూ కన్నీళ్ళు. ఒక మనిషి త్యాగం వీటితో చివరికి కథ సుఖాంతమైపో తుంది. అప్పుడప్పుడూ విషాదాంతం కూడా కావచ్చును. తాను ప్రేమించి పెళ్ళాడ దలచిన వాడికోసం ఒక నాయిక ముసలివాణ్ణి కట్టుకుంటే, మరొకతె దేశాంతరాలు పట్టిపోతుంది. ఇంకొకతె సరాసరి ఆత్మహత్యే చేసుకుంటుంది. పాఠకుల్లో ఉత్కంఠను పెంచడానికి ఈ ప్రేమ కథల్లో ఎన్నో మలుపులు,

ఒక్కొక్కసారి ఈ మలుపులకోసం సృష్టించిన అర్థంలేని సంఘటనలూ, అయో మయపు ముగింపులూ చిరాకు తెప్పించేవిగా ఉండక తప్పడంలేదు.

నిజానికి ప్రతినవలలోనూ ఒక మలుపు తప్పకుండా ఉండితీరాలన్న నియమం ఏమన్నా ఉన్నదా? అదేమీ లేదే! అదీకాక నవలలో ఎల్ల వేళలా సామాజిక సమస్యా పరిష్కారం చేసితీరాలని లేదు. ఈ సంఘంలో బ్రతుకు తున్న వ్యక్తుల విభిన్న జీవనపద్ధతుల్ని గమనించి అవి అలా ఎందుకున్నాయో విశ్లేషించి చెప్పినా నవలే అవుతుంది. మనకళ్ళముందుండి మనకర్థమవుతున్న మనస్తత్వాన్ని యథాతథంగాచిత్రించినా నవలే అవుతుంది. అయితే ఈ రకమైన విశ్లేషణ శాస్త్రీయంగా మాత్రం ఉండాలి. ఆలా ఉండడానికి రచయితో, రచయిత్రో ఆయా సన్నివేశాలతోనూ, పాత్రలతోనూ నిత్య జీవితంలో ఎంతో అనుభవం సంపాదించి ఉండాలి. నిజానికి పాశ్చాత్య సాహిత్య ప్రపంచంనిండా ఇటువంటి నవలలే! వాటిల్లో మన రచయిత్రులు సృష్టించే మలుపుల్లాంటి మలుపులు ఎక్కడో చాలా అరుదుగా గాని కనపడవు

మన రచయిత్రులు ప్రేమను దాదాపు తమ అన్ని రచనల్లోనూ పొడుగుతున్నారు కదా! కాని ఆ ప్రేమకు సంబంధించిన మనో విశ్లేషణ ఎక్కడైనా కనిపిస్తుందా? రచయిత కాని రచయిత్రి కానీ, తమ జీవితాల్లో, కలిసి బ్రతకడంలో గల సుఖాన్ని తనివితీరా ఆస్వాదిస్తూ, తమకు అందుబాటులోలేని ప్రేమ త్యాగాన్ని గురించి తపించి, చేసే ఊహాత్మక రచనలివి. ఇక్కడ వీళ్ళు విపులీకరించ ప్రయత్నించేది, మనుష్యుల మధ్యగల ప్రేమ తత్త్వాన్ని కాక ప్రేమను త్యాగంచేస్తే కలగవలసిన అననుభూతమైన పరిస్థితిని మాత్రమే, సుప్త చేతన స్థితిలో అతి గుప్తంగా ఉండిపోయే అలభ్య ప్రేమను తీరుతీరులుగా విషాదాత్మకంగా వర్ణించాలనే కోరిక బహుశా దీనికి కారణం కావచ్చును.

ఇక వీళ్ళు చేపట్టే రెండో అంశం స్త్రీలూ - స్త్రీల సమస్యలూ, వాళ్ళకు జరుగుతున్న అన్యాయాలూ! ఈ విషయంలో చక్కని సామాజిక స్పృహకలిగి నిజంగా ఏవి సమస్యలో వాటిని మాత్రమే వివరించి పరిష్కార మార్గాన్ని సూచించే రచనలు లేవనికాదు. బహు కొద్దిగా అటువంటివి కనిపిస్తాయి. మిగిలినవన్నీ సమస్యలు కానివాటిని సమస్యలుగా స్వీకరించి సతమతమయ్యే రచనలు

స్త్రీ. శీల పావిత్ర్యాన్ని గురించి తర్జన భర్జనలూ, ఆ శీలాన్ని ఎల్లవేళలా అపహరించడమే తప్ప వేరే పనిలేని పురుష రాక్షసులూ, వాళ్ళకు బలై జీవితాన్ని దయనీయం చేసుకుని సంఘంనుంచి సానుభూతికోరుకునే స్త్రీలూ, ఇక్కడ కోకొల్లలుగా కనిపిస్తారు. ఈ సమస్యల్లో చదువుకున్న స్త్రీపీ, చదువులేని స్త్రీపీ, అనే తేడా కనిపించదు. ఎంత కూలీచేసుకునే స్త్రీఅయినా, ఎంత విద్యావంతురాలైనా, ఇద్దరికీ ఒకటే పరిస్థితి. అది శారీరకంగా పతనం కావడం, తర్వాత సమాజం సానుభూతి కోరడం.

ఈ నవలామణుల అడుగునీడల్లో పడి పురుష రచయితలు కూడా తోటి పురుషుణ్ణి కేవలం ఆడవాళ్ళను పాడు చెయ్యడానికి మాత్రమే పనికొచ్చే సెక్స్ యంత్రంగా సృష్టించడం ఆరంభించినట్లు కనిపిస్తుంది. ఆఫీసుల్లో, కాలేజీలో, రైలు పెట్టెల్లో, రోడ్డు ప్రక్కన, సముద్రం ఒడ్డున, అక్కడ ఇక్కడా అనేమిటి ఎక్కడపడితే అక్కడ భయంకర మృగంగా చిత్రింపబడుతున్న పురుషుడు! ఈ పురుడికిక పనేమీలేదా! వ్యాపకాలే లేవా' నిజ జీవితంలో, మన అన్నలో, తండ్రిలో, స్నేహితుడిలో చివరకు భర్తలోనైనా ఈ మృగాన్ని మనం చూస్తున్నామా! లేదే! ఒక్కోవ్యక్తి తన జీవితానికి సంబంధించిన అనేక వ్యాపకాలలో తోణికిసలాడుతూ పరిపూర్ణ వ్యక్తిలా అనుక్షణమూ కనిపిస్తూనే ఉంటాడు కదా! అన్ని కోణాలనుండి పరిశీలించి చిత్రించవలసిన మహత్తర మానవ జీవితాన్ని, కేవలం జీవితంలో ఒక చిన్నభాగమైన సెక్స్ స్థాయికి కుదించి భయంకరంగా చిత్రించడం క్షమించరాని నేరంకాదా! దీనివల్ల సాధించదలచుకున్నది శారీరకంగా బలహీనురాలైన స్త్రీ మీద సమాజం చూపించే సానుభూతి మాత్రమే అనుకుంటే, ఆది పొరపాటు అభిప్రాయమని. నా తీర్మానం.

ఇక సమస్యల చిత్రణలో స్త్రీకి చదవుకున్నా, చదవుకోకపోయినా పెద్ద తేడా ఏమీ లేదు. కాని నవలల్లో నాయికలందరూ చాలావరకూ బి. యే. అయినా పాస్ అయి ఉంటారు. కొందరు ఉద్యోగాలు కూడా చేస్తుండవచ్చు. ఇక వాళ్ళకు రాక్షసుళ్ళాంటి భర్తముందు ఎలా నడుచుకోవాలో తెలీని సమస్య. బయటకు పోతే బస్సు ఎక్కడం దగ్గరనుండి ఆఫీసులో మేనేజరు తోటి గుమస్తాలు చివరకు మగ పూల్యస్లు అందలూ ఆవిణ్ణి పెట్టే పాట్లన్నీ అదో సమస్య —

ఇంట్లోభర్తమనస్సులో అనుమానపు పెనుభూతం. పెళ్ళాంసంపాదించే డబ్బంతా చివరకు కాఫీ ఖర్చుకు కూడా ఉంచకుడా లాక్కునే భర్త రాక్షసుడు. -ఇటు వంటివే అన్నీ. సమస్యల తోరణాల కూర్పు!

ఇక కథానుగతంగా లోక వృత్తాన్ని గురించి చెప్పవలసివస్తే బయటి ప్రపంచం, లౌకిక వ్యవహారాలూ, క్షుణ్ణంగా తెలీని కారణాన తప్పుడు సమాచారాలు (Factual Mistakes) ఇవ్వవలసిరావడం! ఎవరికైనా తెలియక పోవడం నేరం కాదు గాని ఏం రాసినా చదువుతున్నారుగదా అని తెలియని తనాన్ని అక్షర రూపంలో బంధించి నిర్లక్ష్యంగా నలుగురికీ అందించడం మాత్రం క్షమించరాని నేరం.

ఈ రకంగా ఒకట రెండు తరహాల కథల మూసల్ని మాత్రమే గ్రహించి రచయిత్రులు నవలల్ని పుంఖాను పుంఖాలుగా అనుసంధించడం జరుగుతున్నది. వసుచరిత్రకు పిల్లవసుచరిత్రలు పుట్టినటుగా, ప్రజాదరణ పొందిన ఒక నవల వెనక తోక నవలల్ని ఎన్నిటినో మనం చూడవచ్చు. ఈ నాడు ఇటువంటి నకలు నవలల్ని పత్రికల ధర్మమా అంటూ నెలకు కనీసం రెండు మూడయినా పట్టుకోవడం కష్టంకాదు.

మరి ఇటువంటి నవలల మీద జనానికి మోజు ఎందుకు పెరుగుతున్నట్లు? వీటిని ఎవరు ఎక్కువగా చదువుతున్నారు?- అనుభవజ్ఞులూ విజ్ఞులూ కొందరు పరిశీలనా దృష్టితో వీటిని చదువుతున్నా ఎక్కువగా లేత వయసు విద్యార్థులు ఆఫీసుగుమస్తాలూ, వంటింటి ఆడవాళ్ళూ వీటిని చదువుతున్నారు. వాళ్ళకు కావలసిందేమిటి? ఉద్రేకపూరితంగా తమలోసాగే అనుభవరహితమైన కాల్పనికోహలకు ప్రోత్సాహం, తాము ఉహాల్లో ఊరేగుతూ కళ్ళు తెరుచుకుని కనే బంగారు కలలకు అక్షర రూపం. తమ తమ భవిష్యత్తులను గూర్చిన చేదు నిజాలకన్నా తమ ఉహలకు సంబంధించిన అందమైన చిలకి జోస్యం కావాలివీళ్ళను. దీన్నే మనస్తత్వ వేత్తలుపలాయనవాదం (Escapism) అంటున్నారు. నిజాల మధ్య ఇరుకిరుకుగా ఇబ్బందిగా బ్రతుకుతూ, అబద్ధమని తెలిసికూడా అబద్ధాల అందాల ఆకాశంలోకి క్షణంసేపయినా రెక్కలల్లార్చుకుంటూ ఎగిరి పోవడమే ఈ వాదం పరమార్థం. పైన చెప్పిన తెలిసీ తెలియని ఆలోచనల్ని ప్రోగుచేసుకుంటున్న వారంతా

ఈ రంగుల కలలకూ, అందమైన అబద్ధాలకూ, మత్తుపదార్థాలకలవాటు పడి నంతగా దాసులై పోతున్నారు. ఆ మత్తులోనుండి బయటికి రావడం ఇష్టంలేక జరుగుతున్న కాలంలో నడుస్తున్న చరిత్రను గురించి, అందులో తాము నిర్వహించవలసిన పాత్రను గురించీ సమగ్రమైన చైతన్యాన్ని పొందడానికి నిరాకరిస్తున్నారు. ఈ విధంగా మన సాహిత్యంలో ఈ నాటి నవలా విభాగం మత్తు మందును సరఫరాచేసే రహస్య నిలయంగా (Secret cell) మారి పోతున్నది.

నిజానికి ఈ రకమైన రచనలకు చేయూతనిచ్చి ప్రోత్సాహం కలిగిస్తున్న రంగాలు రెండు. అవి (1) పత్రికా రంగం. (2) సినిమా రంగం. పత్రికా రంగం కేవలం చదువు వచ్చిన వాళ్ళకు మాత్రమే కాగా, సినిమా రంగం అక్షర నిరక్షరాస్య వర్గాలు రెండింటికీ చెందింది.

పత్రికలూ, రచయిత్రులూ ఎట్లా సరస్పరాశ్రితాలలో, అట్లాగే రచయిత్రులూ సినిమాలూ కూడా! పత్రికల్లో ధారావాహికంగా పడ్డ నవలల్ని సినిమాలు స్వీకరిస్తున్నాయి. సినిమాలు స్వీకరిస్తున్నాయికదా అని రచయిత్రులు కూడా అదే బాణీలలో యథాశక్తి వ్రాయడం అలవాటు చేసుకుంటున్నారు. అందువల్ల ఇదో ఛేదించరాని వలయంగా ఏర్పాటైపోయింది. ఈ పద్ధతిలో రచనా వ్యాసంగం అటు వినోదక్రియ, ఇటు వ్యాపార క్రియ మాత్రం కాగలుగుతున్నది.

కాని సాహిత్యం ఎప్పుడైనా మిక్కిలి శక్తిమంతమైన ఆయుధమే. దీన్ని సమర్థవంతంగా వాడుకుని సమకాలిక పరిస్థితుల్ని హృదయానికి హత్తుకునేట్లు చేయగలం. జనం ఆలోచించేట్లు చేయగలం. జనాన్ని సాంఘిక చైతన్యంతో తొణికిసలాడేటట్లు చేయగలం. వివిధ దేశాల సాంఘిక రాజకీయ విప్లవాల చరిత్రను గమనిస్తే ఆయా సమయాల్లో రచయితలు తమతమ మనుష్యుల్ని ఎలా ప్రభావితం చేశారో గుర్తించవచ్చు. అంతెందుకు, పెద్ద పెద్ద భావ విప్లవాలను జనానికి నూరి పోసింది, ఇంచుమించు అన్ని భాషలలోనూ నవలా ప్రక్రియే. తెలుగులోకూడా 1950కి పూర్వం నవలకు అటువంటి గౌరవమే ఉండేది.

నేటి స్త్రీలు నవలా రంగాన్ని ఏకచ్ఛత్రంగా ఏలుతున్నారన్నది నిస్సంశయంగా చెప్పుకోదగ్గ విషయమే, కాని ఆ ఏకచ్ఛత్రతరాశి వల్లకాక వాసి వల్ల కావాలన్నదే నా ఆకాంక్ష. ఈనాడు పేరు తెచ్చుకుంటున్న రచయిత్రులందరూ, ఒకనాడు మాలపల్లి కర్త ఉన్నవ సంపాదించిన పేరు సంపాదించాలి. ఒక రచయిత్రి పేరు చెప్పగానే ఒక సజీవమైన నవలా అందులో పాత్రలూ కళ్ళ ముందు కదలాడాలి గాని కేవలం కాగితాలమీద పెద్ద అక్షరాలతో అచ్చవుతున్న ఆ రచయిత్రి పేరు మాత్రమే కనిపించి మాయం కారాదు.

ఎవరికైనా తొలి రోజుల్లో అచ్చులో కనపడాలన్న తపన ఉండడం నేరంకాదు. కాని మనస్సును పెంచుకోకుండా, ఆ తొలి రోజులాగా చివరిరోజు వరకూ అక్కడే ఉండిపోవడం మాత్రం క్షమించరాని నేరం.

తెలుగు రచయిత్రి తన రచనల ద్వారా ఎదగాలి. సంఘానికి అవసరమైన చైతన్యాన్ని అందించే వాహికగా తన కలాన్ని మార్చుకోవాలి, ఏవి సమస్యలో ఏవి కావో సమగ్ర పరిశీలన వల్ల తెలుసుకొని సమస్యల చిక్కు ముళ్ళను విప్పడానికి అతిశయోక్తిభరితం కాని పరిష్కార మార్గాన్ని సూచించే స్తోమతను పెంచుకోవాలి. ఒక వేళ పరిష్కార సూచన లేకపోయినా కనీస ఆ సమస్యల స్వరూపం అందరికి అవగత మయ్యేటట్లు రచనల్ని తీర్చాలి.

ఇంత గురుతర భారాన్ని సక్రమంగా నిర్వహించినప్పుడే మన రచయిత్రులు నవలా ప్రక్రియను ఏలుతున్నారన్న సంతోషం మిగులుతుంది. అప్పుడే తెలుగు సాహిత్య రంగంలో రచయిత్రుల ఉనికి ఆ రంగానికే వెలలేని మణీదీపంగా భాసిస్తుంది.

ఆంధ్రప్రదేశ్ నవంబరు 1976